

# విద్యార్థులు – విలువలు

రచయిత

గాలి సుబ్బారావు

# విద్యార్థులు - విలువలు




రచయిత

**శ్రీ గాలి సుబ్బారావు,** యం.ఏ.,

రిటైర్డ్ ప్రిన్సిపాల్

మాజీ పాలక మండలి సభ్యులు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

# ముందు మాట

## విద్యార్థులు - విలువలు

నేను 1963వ సంవత్సరమునుండి 1969వ సంవత్సరం మార్చి వరకు ఉన్నత పాఠశాల విద్యార్థిగా విద్యనభ్యసించాను. ఆనాటి పాఠశాల విద్యార్థులకు, నేటి పాఠశాల విద్యార్థులకు హస్తిమస్తిష్కమంత తేడా ఉన్నది. ఆనాటి విద్యార్థులకంటె నేటి విద్యార్థులకు తెలివితేటలు ఎక్కువగా ఉన్నాయి. కానీ పరిశ్రమ (హార్డ్‌వర్క్), నిజాయితీ, విలువలు తక్కువగా ఉన్నాయని చెప్పాలి. నేటి విద్యార్థులకున్న పాఠశాల వసతులుగాని, టెక్నాలజీగాని ఆ రోజుల్లో లేవు.

ఉన్నత పాఠశాల విద్యార్థులను దృష్టిలో ఉంచుకొని వ్రాసిన పుస్తకం ఇది. వారికిది నేర్చుకునే దశ. నేటి పాఠశాల విద్యావిధానములో ప్రధాన అంశము ప్రభుత్వానికి, అధ్యాపకులకు, తల్లిదండ్రులకు, చివరకు విద్యార్థులకు మార్కులు, ర్యాంకులే. ఈ మార్కులు – ర్యాంకుల సాధనలో సిలబస్ పూర్తి చేయటం, చదివించటం, పరీక్షలు నిర్వహించటం, పేపర్లు దిద్దటంలో అధ్యాపకులు తీరిక లేకుండా ఉంటారు. కొందరికి సమయం కూడా చాలకపోవచ్చు. సమయాభావం వలన విద్యార్థులకు ఇతర విషయాలు, సంబంధిత విషయాలు చెప్పే అవకాశం దొరకదు. చదువుతోపాటు కొన్ని సంబంధిత విషయాల్లో, విలువలు విషయాల్లో, వాటిని నేర్చుకొని పాటించే విషయాల్లో విద్యార్థులు వెనుకంజలో ఉన్నారనే చెప్పక తప్పదు. నేను పాఠశాల విద్యార్థులను దాదాపు దశాబ్ద కాలంనుండి గమనిస్తున్నాను. విద్యార్థుల్లో కొంతమందైనా విలువలుతో కూడిన అంశాలను చదవాలని, నేర్చుకోవాలని, అధ్యాపకులు వారికి బోధించాలని నా ఆరాటం, తపన. ఆ ఉద్దేశంతోనే నేను వృత్తిరీత్యా ఆంగ్లోపన్యాసకుడినైనా వ్యవహారిక, గ్రాంధిక తెలుగు భాషలో 22 అంశాలతో కూడిన పుస్తకాన్ని వ్రాశాను.

**గమనిక :** ఇవి పాఠశాల విద్యార్థులను దృష్టిలో ఉంచుకొని వ్రాసినప్పటికీ ఇంటర్, డిగ్రీ విద్యార్థులకు కూడా ఉపయుక్తంగా ఉంటాయి.

నరసరావుపేట మునిసిపల్ కమీషనర్‌గారు శ్రీ అన్నాప్రగడ భానుప్రతాప్‌గారు, మునిసిపల్ కమీషనర్‌గా నియామకం జరుగకముందు పాఠశాల అధ్యాపకునిగా పనిచేశారు. వారికి పాఠశాల విద్యను గురించి పూర్తి అవగాహన ఉండటమేగాకుండా, పాఠశాల విద్య మీద శ్రద్ధ కూడా ఎక్కువే. తరువాత వారు కష్టపడి చదివి కమీషనర్ అయ్యారు. నాకు సుపరిచితులు. నేను ఒక రోజు ఫోన్‌లో విద్యార్థులకు ఉపకరించే కొన్ని అంశాలతో పుస్తకాన్ని వ్రాస్తున్నాని చెప్పగా వెంటనే వ్రాయండి సుబ్బారావుగారు, నేను అచ్చువేయించి మా విద్యార్థులకిస్తామని చెప్పగా సంతోషించి త్వరగా పూర్తి చేశాను. ఈ పుస్తక ప్రోత్సాహకులైన వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, ధన్యవాదములు.

ఇందులో ఉన్న అంశాలను అధ్యాపకులు చదివి, వారికి సమయం దొరికినప్పుడు ఏదో ఒక అంశాన్ని గురించి విద్యార్థులకు చెబితే వారిలో కొంతమందికైనా మేలు జరుగవచ్చని, కొన్ని అలవాట్లు, విలువలు నేర్చుకొనే అవకాశము, అమలు చేసినచో వారి భావి జీవితానికి సమాజానికి మేలు జరుగుతుందని నా భావన.

ఇట్లు

**రచయిత**

బ్రహ్మర్షి, విద్యా వారిధి
**డా॥ వేదాన్తం సత్య శ్రీనివాస అయ్యంగార్**
ఎం.ఏ. (తెలుగు), ఎం.ఏ. (సంస్కృతం). పి.హెచ్.డి.,
రిటైర్డ్ అసోసియేట్ ప్రొఫెసర్ (సంస్కృతం)
యస్.యస్. &యన్. కళాశాల, నరసరావుపేట

శ్రీ సదనం
2-4-35/సి, వేదాన్తంవారి వీధి,
ఏనుగుల బజారు, నరసరావుపేట

# అంతరంగ తరంగాలు

**చదువని వాఁడజ్ఞుండగుఁ**
**జదివిన సదసద్వివేక చతురత గలుగుం**
**జదువఁగ వలయును జనులకుఁ**
**జదివించెద నార్యులోద్ధఁ జదువుము తండ్రీ ॥** – భాగవతము

భారతీయుల జీవన విధానం ఒక కమ్మని పాట. సుందర నాట్య హేల. తాత్త్వికమకరంద ధార. చిన్నతనంలో చదువుకోవటం, వయసులో కుటుంబ బాధ్యతలు. వార్ధక్యపు మొదటి దశలో సామాజిక సేవలు. తుదకు అంతర్ముఖమైన ఆధ్యాత్మిక జీవనం. ఈ నాలుగు అంశాలు దశలు పరిపూర్ణమైన భారతీయుని జీవన స్వరూపం. ఈ భారతీయ జీవనతత్త్వాన్ని పుణికిపుచ్చుకున్న మనీషి శ్రీ గాలి సుబ్బారావుగారు. తల్లిదండ్రులు, గురువులు 'నిజాయితి, నిబద్ధత, క్రమశిక్షణ'లతో మలచిన శిల్పం సుబ్బారావుగారు. తన ప్రవృత్తికి తగిన అధ్యాపక వృత్తిని స్వీకరించి, కార్యదక్షతతో విద్యారంగంలో సమున్నత శిఖరాలనందుకున్నారు. అందుకనే నేటితరం విద్యార్థులలో లోపించిన విలువలను చూసి ఉద్విగ్నమైన వారి అంతరంగము నుండి వెలువడిన భావవీచికలు అక్షరములై నేడు "విద్యార్థులు – విలువలు" అను పుస్తకంగా పరిమళించినాయి. కృతజ్ఞతతో మొదలై విద్యాలక్ష్యాన్ని తెలుపుతూ ముగించిన ఈ పుస్తకంలో ఇరువది రెండు అంశాలు సోదాహరణంగా సున్నితంగా సూటిగా ఆలోచనామృతంగా ఆవిష్కరించబడ్డాయి. ఈ ఆలోచనా తరంగాలు జీవితానుభవాల ద్వారా వచ్చినవి కనుక నేరుగా విద్యార్థుల హృదయాలను స్పృశించి వారిని ఆలోచింపజేసి సంస్కారవంతులుగ మలచటంలో సఫలమవుతాయనటంలో సందేహం లేదు.

"కృతజ్ఞత – కృతఘ్నత" పదాలకు తేడా తెలియకుండా బ్రతుకుతున్న నేటి తరానికి "భారతం"లోని కర్ణుని, "పాండురంగ మహాత్మ్యం"లోని నిగమశర్మ, "ఫిరదౌసి" లోని మహమ్మదు కథలనే కాక, నేటి సమాజంలో మనం చూసే కృతజ్ఞతకు, కృతఘ్నతకు ప్రతిరూపులైన ఇద్దరు వ్యక్తుల జీవిత సంఘటనలను చూపి, ఆ పదాలకర్థం తెలుసుకోవటమే కాక కృతజ్ఞతగా జీవించటంలోని ఔన్నత్యం, అలా బ్రతకాలనే పట్టుదల చిన్నతనంలోనే కలిగించటంలో రచయిత చేసిన ప్రయత్నం ప్రశంసనీయం. అలాగే పట్టుదలలో ఎర్రచీమని ఆదర్శంగా చూపిన తీరు పిల్లలకు మంచి మార్గదర్శకంగా నిలుస్తుంది.

మహాత్మాగాంధి, జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్, అబ్రహాం లింకన్ మొదలైన చారిత్రక పురుషులనే కాక నేటి తరం మహనీయులు స్వర్గీయ నందమూరి తారకరామారావు, ఎ.పి.జె.అబ్దుల్ కలాంగారు మొదలగువారిని, శ్రీ నారా చంద్రబాబునాయుడు, డా॥ కోడెల శివప్రసాదరావుగారు మొదలగు విశిష్ట వ్యక్తుల కృషి, పట్టుదల, కార్యదక్షత, సామాజిక బాధ్యత మొదలగు ఆచరణీయములైన ఆదర్శ గుణాలకు ఉదాహరణగా చూపిన తీరు పిల్లలకు ఆసక్తిని, మంచి అవగాహనను కలిగించటం నిశ్చయం. ఉపాధ్యాయులుగా తమ వృత్తిని ప్రారంభించి నిరంతర శ్రమతో ఉన్నత పదవులనందుకున్న మన నరసరావుపేట మునిసిపల్ కమీషనర్ శ్రీ అన్నాప్రగడ భానుప్రతాప్ మున్నగువారిని "శ్రమ ఏవ జయతే" అనే నినాదానికి నిదర్శనంగా చూపారు రచయిత. క్రీడలు, విద్య, పరిశుభ్రత, టెలివిజన్, సెల్‌ఫోన్ మున్నగు అంశాలపై శ్రీ సుబ్బారావుగారు చేసిన సూచనలు నేటి ప్రభుత్వాలను, సమాజాన్ని ఆలోచింపజేసేవిగా ఉన్నాయి.

ఈ పుస్తకంలోని ఆయా సందర్భాలలో ప్రయోగించిన "మొక్కై వంగనిది, మ్రానై వంగునా" వంటి సామెతలు విద్యార్థులకు తెనుగుభాషా సౌరభాన్ని అందిస్తున్నాయి. ప్రాక్ పాశ్చాత్య సాహిత్య గ్రంథాల నుండి, ఐతిహాసికాలైన రామాయణ, భారతాలనుండి, ఆధ్యాత్మిక గ్రంథాలైన గీత, బైబిల్‌లనుండి తీసుకున్న విషయాలు ఆ గ్రంథాలను చదువుటలో విద్యార్థులకు మక్కువ పెంచుతాయి.

ఏ వ్యక్తి అయినా తాను గుణవంతుడు కాకుండా ఇతరులకు చేసే ఉపదేశాలకు విలువ ఉండదు. శ్రీ సుబ్బారావుగారు ప్రిన్సిపాల్‌గా, స్పెషల్ ఆఫీసరుగా కె.ఆర్.

జూనియర్ కాలేసి, పి.యన్.సి. & కె.ఆర్. డిగ్రీ అండ్ పి.జి. కోర్సులను నిర్వహిస్తున్న రోజులలో, ప్రత్యేకించి విద్యార్థినుల భద్రతకై, క్రమశిక్షణకై తల్లిదండ్రులు ఆ కళాశాలలో చేర్చడానికి ప్రాధాన్యతనిచ్చేవారనుటమతిశయోక్తి కాదు. శ్రీ సుబ్బారావుగారి నిబద్ధత, నిజాయితి, క్రమశిక్షణ, కార్యదక్షతలపై వారికున్న విశ్వాసమే అందుకు కారణం. ఈ సందర్భంగా ఒక సంఘటన తప్పకుండా చెప్పాలి. నేను శ్రీ మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల, జిల్లెళ్ళమూడికి 1994లో బదిలీపై వెళ్ళాను. 95 మే నెల మధ్యాహ్నం, మంచి ఎండ సమయం. మిత్రుడు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు కళాశాల రికగ్నిషన్ విషయమై ఫోన్ చేసి, రేపే యూనివర్శిటీ ఇ.సి. సమావేశమున్నది, శ్రీ సుబ్బారావుగారిని కలవవలసినదిగా చెప్పారు. అంత ఎండలో విశ్రాంతి తీసుకునే సమయమని కూడా ఆలోచించకుండా వెళ్లాను. నన్ను ఆదరంగా ఆహ్వానించారు. విషయం విని కళాశాల సమాచారం అడిగి తెలుసుకున్నారు. అంతే ఏ ఓరియంటల్ కళాశాలకు లేని విధంగా "శాశ్వత గుర్తింపు" ఆ కళాశాలకు వచ్చింది. ఇది శ్రీ గాలి సుబ్బారావుగారి ఆదర్శ వ్యక్తిత్వానికి ఓ ఉదాహరణ మాత్రమే.

*One cannot teach others without the commission from God.*
*A teacher of men must have great power. -- Sri Ramakrishna*

**చదువు చదువకున్న సౌఖ్యంబులును లేవు**
**చదువు చదవెనేని సరసుడగును**
**చదువు మర్మమెఱిగి చదువగ చూడుము**
**విశ్వదాభిరామ వినురవేమ ॥** – వేమన

**"తేజస్వి నా వధీతమస్తు"**

ఆత్మీయతతో,
**వేదాన్తం సత్య శ్రీనివాస అయ్యంగార్**

భారత స్వాతంత్ర్య దినము
ది. 15-8-2018

# కృతజ్ఞతలు

"విద్యార్థులు – విలువలు" అనే పుస్తకాన్ని అచ్చువేయించుకొని వారి విద్యార్థులకు అందజేసిన –

1. నరసరావుపేట మునిసిపల్ కమీషనర్ **శ్రీ అన్నాప్రగడ భానుప్రతాప్** గారికి
2. **సెయింట్ మేరీస్ ఇంగ్లీష్ మీడియం ఉన్నత పాఠశాల,** రావిపాడు – యాజమాన్యం వారికి
3. **విజేత ఉన్నత పాఠశాల,** పెదవడ్లపూడి యాజమాన్యం వారికి
4. **హిందూ ఉన్నత పాఠశాల,** నవోదయనగర్, నరసరావుపేట – యాజమాన్యం వారికి
5. **టైనిటాట్స్ గ్లోబల్ ఉన్నత పాఠశాల,** యన్జీవో కాలనీ, నరసరావుపేట – యాజమాన్యం వారికి
6. **ఆక్స్‌ఫర్డ్ పాఠశాల యాజమాన్యం,** రావిపాడు రోడ్, నరసరావుపేట – యాజమాన్యం వారికి
7. **భాష్యం విద్యాసంస్థలు,** గుంటూరు – యాజమాన్యం వారికి
8. **లివింగ్ హోప్ ఇంటర్నేషనల్ స్కూల్,** కోటప్పకొండ – యాజమాన్యం వారికి

ఈ పుస్తకాన్ని చదివి వారి అభిప్రాయాన్ని వ్రాసిన శ్రీ వేదాన్తం సత్య శ్రీనివాస అయ్యంగార్, విశ్రాంత సంస్కృత ఉపన్యాసకులవారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని చదివి కొన్ని సూచనలిచ్చిన నా సహచర ఉపాధ్యాయుడు డా॥ నల్లూరి రామారావు, విశ్రాంత ఆంధ్రోపన్యాసకులవారికి నా కృతజ్ఞతలు.

ఈ రచనను పుస్తక రూపంలో అందించిన శ్రీ రాజేశ్వరి ఆఫ్‌సెట్, నరసరావుపేట వారికి – అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

# విషయ సూచిక

# 1. కృతజ్ఞత - కృతఘ్నత

[Gratitude - Ingratitude]

**కృతజ్ఞత :**

మనకెవరైనా సహాయము చేసినా, మనం ఆపదలో ఉన్నప్పుడు మనలను రక్షించినా, మేలు చేసినా, మనం అడిగిన వెంటనే మనకు ఉద్యోగం ఇచ్చినా, మనం ఆపదలో ఉన్నప్పుడు మనలను గాని, మన కుటుంబాన్నిగాని ఆదుకున్నా, తెలివైన కడు బీదవారికి చదువు నిమిత్తమై తగు సహాయమందించి, వారిని చదివించి జీవితంలో స్థిరపడేటట్టు చేసినా, అటువంటి వారి పట్ల సహాయం పొందినవారు వినయంగా ఉంటారు. వారిని గౌరవిస్తారు. వారు కనబడితే వారికి నమస్కరించుట, వారి పట్ల గౌరవభావాన్ని ప్రదర్శించుట అనేది “కృతజ్ఞత” అంటారు. దీనికి ఉదాహరణగా మహాభారతం లోని కర్ణుని ఉదంతాన్ని పేర్కొనవచ్చును. కర్ణుడు కుంతీదేవికి సూర్యునివల్ల జన్మించాడు. ఆమె లోకానికి వెరసి కర్ణుని నదిలో వదలివేసింది. సూతుడు అది చూసి ఆ పసిబిడ్డను తీసుకొని పెంచాడు. తరువాత దుర్యోధనుడు చేరదీసి అంగ రాజ్యానికి కర్ణుని రాజుగా ప్రకటించాడు. కర్ణుడు సహజ కవచ కుండలములతో జన్మించినవాడు. మహా తేజము, పరాక్రమము కలవాడు. ఒక రోజు తల్లియైన కుంతీ దేవి కర్ణుని కడకేగి పాండవులు తన సోదరులని, వారిలో అర్జునుడు తప్ప మిగతావారు తనకు సాటిరారని వారిని యుద్ధంలో చంపవద్దని అడుగగా, వారిని చంపనని తల్లికి కర్ణుడు మాట ఇచ్చెను. ఆ సమయములోనే కుంతి కర్ణుని సోదరులైన పాండవ పక్షానికి రమ్మని కోరగా అందుకతను నిరాకరించి దుర్యోధనుడు తనను ఆపద సమయంలో ఆదుకున్నాడని, అతనిని విడిచి రానని, ఆ విధంగా వచ్చినచో లోకము తనను ‘కృతఘ్నుడ’ని అంటారని, తాను కృతజ్ఞుడునే గాని ‘కృతఘ్నుడ’ను కానని తల్లికి స్పష్టం చేశాడు. మహాభారతంలో ఇంతకు మించి ‘కృతజ్ఞత’ అనే పదానికి మంచి ఉదాహరణ లేదు.

**కృతఘ్నత :**

మనం ఇతరులనుండి సహాయము పొందియు, మేలు పొందియు, మనం అపద నుండి ఇతరుల చేత రక్షింపబడియు, అతి బీదవారిమైయుండి చదువు కొనసాగించలేని స్థితిలో ఉన్నప్పుడు, ఇతరులవల్ల మన చదువుకు అవసరమైన సహాయము పొంది చదువు పూర్తి అయిన పిదప ఉద్యోగము పొంది జీవితములో స్థిరపడియు, మనకెవరైతే సహాయము చేశారో వారిని మరచిపోవుట, వారు కనిపించినప్పుడు వారికి నమస్కారం చేయకుండుట, వారి పట్ల ఏ మాత్రమూ గౌరవభావాన్ని ప్రదర్శింపకుండుటను 'కృతఘ్నత' అంటారు. ఇందుకు మంచి ఉదాహరణగా పాండురంగ మహాత్యములోని నిగమశర్మ పాత్రను పేర్కొనవచ్చును. అష్టదిగ్గజ కవులలో ఒకరైన తెనాలి రామకృష్ణుడు 'పాండురంగ మహాత్యం' అనే కావ్యాన్ని రచించాడు. అందులోనిదే 'నిగమశర్మోపాఖ్యానము'. నిగమశర్మ అనే వ్యక్తి సద్బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినప్పటికీ బ్రాహ్మణత్వము అనగా, బ్రాహ్మణుల లక్షణాలు లేని వ్యక్తి. నిత్యము తన్ను తాను అలంకరించుకొని 'జాతిమాత్రోప జీవి' అన్నట్లుగా ఉండేవాడని కవి వర్ణన. ఒకరోజు దొంగలు నిగమశర్మను కొట్టి దారి ప్రక్కన పడవేసి వెళ్ళారు. గాయాలనుండి రక్తము కారుచు దారి ప్రక్కన పడివున్న నిగమశర్మను పొలమునుండి ఇంటికి వెళుతున్న ఒక రైతు తన ఎడ్లబండిలో ఎక్కించుకొని తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు. తన భార్య చేత వేడి నీళ్ళు పెట్టించి అతని గాయాలను కడిగించి వైద్యునిచే మందులు ఇప్పించాడు. వారం రోజుల తరువాత అతని గాయాలు పూర్తిగా మానినవి. ఆ తరువాత నిగమశర్మ ఒక రోజు రాత్రి ఆ రైతు భార్యతో లేచిపోయాడు. ఇది 'కృతఘ్నత'కు గొప్ప ఉదాహరణ. మేలు చేసిన వానికి కీడు చేయటమే 'కృతఘ్నత'.

నవయుగ కవి చక్రవర్తి, విశ్వనరుడు, కవికోకిల గుఱ్ఱం జాషువాగారు రచించిన "ఫిరదౌసి" ఇతివృత్తం ద్వారా ఈ పదాల వివరణను చూద్దాం.

గజనీ పట్టణంలో నివశించుచున్న రాజు మహమ్మదు. ఒక రోజు ఆయన పారశీక కవులలో అగ్రగణ్యుడైన "పిరదౌసి" కవిని గజనీకి పిలిపించి

'షానామ' అను గ్రంథమును (రాజచరిత్ర) రచించి తనకంకితమిచ్చినచో ఒక్కొక్క పద్యమునకు ఒక దీనారము అనగా బంగారు నాణెమునిచ్చెదనని వాగ్దానము చేసెను. పిరదౌసి ముప్పది సంవత్సరములు కష్టపడి అరువది వేల పద్యములు వ్రాసి రాజు కొలువును చేరి చదివి రాజుగారికి వినిపించాడు. అనంతరము రాజుగారు ఏ కారణము చేతనో బంగారు నాణెములకు బదులు వెండి నాణెములను కవికి పంపగా కవి నిరాశచెంది రాజుగారిని నిందిస్తూ కొన్ని పద్యములు వ్రాసి పంపగా, రాజుగారు కవి మీద ఆగ్రహించి అతనిని చంపమని భటులనాజ్ఞాపించాడు. ఇది తెలుసుకున్న కవి గజనీ పట్టణము విడిచి అరణ్యములు దాటి 'తూను పట్టణము'కు వెళ్ళాడు.

సామంతరాజుల సలహా మేరకు మహమ్మదు రాజుగారు తన మనస్సుని మార్చుకొని రాజభటులచే అరువది వేల బంగారు నాణెములను పంపగా అప్పటికే కవి చనిపోయెనని తెలుసుకొని అతని ఇంటికి వెళ్ళి కవి కుమార్తెకు ఆ బంగారు నాణెములను ఇవ్వబోగా "నా తండ్రి నిరంతము దుఃఖ పెట్టిన నీచమైన ధనమును నేను ముట్టను" అని ఆమె నిరాకరించెను.

ఈ కథ ద్వారా రాజుగారి 'కృతఘ్నత'ను గమనించవచ్చును. రాజుగారు చివరకు బంగారు నాణెములు పంపినప్పటికి 'కృతజ్ఞుడు' కాలేదు.

పూర్వం ఒక గ్రామములో ఒక టీచర్ ఉండేవాడు. ఆయనకు ప్రభుత్వ ఉద్యోగం లేదు. ట్యూషన్స్ చెప్పి కుటుంబాన్ని పోషించేవాడు. ఆయనకు విద్యార్థులలో మంచి అధ్యాపకునిగా పేరు ఉండేది. వృత్తిలో అంకితభావంగల వ్యక్తి. ఆయన చాలా బీదవాడు. సంతానం లేదు. 50 సంవత్సరముల వయస్సులో ఒక కుమారుడు జన్మించాడు. ఆయన 60 సంవత్సరముల వయస్సులో తీవ్రమైన జబ్బు చేసి మరణించాడు. కుటుంబం దిక్కులేని స్థితిలో ఉన్నది. అయన దగ్గర పూర్వం చదువుకున్న విద్యార్థి ఒకరు ప్రభుత్వోద్యోగంలో బాగా స్థిరపడ్డాడు. ఒక రోజున ఆ గ్రామానికి రాగా టీచరు మరణ వార్త విని ఆ కుటుంబాన్ని పరామర్శించడానికి వెళ్ళాడు. ఆ టీచరు భార్య దీనావస్థలో ఉండటాన్ని గమనించి ఆమె కుమారుడిని పట్టణంలో తాను చదివిస్తానని

వెంట తీసుకెళ్ళి పిల్లవాడిని తన ఇంట్లోనే ఉంచుకొని చదివించగా, అతను ప్రభుత్వ ఉద్యోగం పొంది స్థిరపడ్డాడు. ఇది ఆ టీచరు పట్ల పూర్వ విద్యార్థి చూపిన 'కృతజ్ఞత'.

అదే గ్రామంలో 20 ఎకరాల రైతు ఉన్నాడు. దానధర్మాలు చేయడంలో దిట్ట. తన ఇంట్లో ఇద్దరు కూలీలు, భార్య భర్త తన పొలంలోనే పని చేసేవారు. వారికొక కుమారుడు, కుమార్తె. ఆ కుమారుడిని ఆ ఆసామి చదివించాడు. ఆ కూలివాని కుమారుడికి చదువు అయిన వెంటనే ప్రభుత్వ ఉద్యోగం వచ్చింది. దానధర్మాల ద్వారా ఆ రైతు తన ఆస్తినంతా పోగొట్టుకోగా చివరకు ఒక ఎకరము మాత్రమే మిగిలింది. ఓడలు బండ్లు, బండ్లు ఓడలు అయ్యాయి. ఈ కూలివాడు దాదాపు 10 ఎకరాల రైతు అయ్యాడు. ఆ ఆసామి పట్నంలో ఉన్న పూర్వం కూలివాని కుమారుని వద్దకు వెళ్ళి తన పరిస్థితిని వివరించి తన మనుమడిని చదివించవలసినదిగా అభ్యర్థించగా అందుకు అతను సుముఖత చూపించలేదు. చూచితిరా మిత్రమా! ఈ కూలివాని కుమారుడు 'కృతఘ్నుడు' అనగా చేసిన మేలు మరిచాడు.

పై ఉదాహరణలను పరిశీలించిన తరువాత ఈ పదాలను ఈ విధంగా నిర్వచిద్దాం.

**'కృతజ్ఞులు'** – చేసిన మేలు, పొందిన మేలు – మరువని వారు

**'కృతఘ్నులు'** – మేలు చేసినవానికి కీడు చేసేవారు.

మహాభారతం, ఉద్యోగపర్వం'లో విదురుడు ధృతరాష్ట్రునకు కొన్ని నీతి వాక్యములు చెప్పెను. వాటినే 'విదురనీతి' అంటారు. ఈ విదురనీతిలో విదురుడు 'కృతఘ్నత', 'కృతజ్ఞత'ను గురించి ఈ విధంగా వ్యాఖ్యానించాడు.

**'కృతఘ్నత'** – "ఒకనినుండి సహాయము పొందియున్నతికి వచ్చి సంపదల నార్జించిన వాడు తనకు సహాయమొనర్చినవారికి కీడు కలిగించి కృతఘ్నుడగును. అట్టి కృతఘ్నుని కళేబరమును నక్కలైనను కోరవు".

**'కృతజ్ఞత'** – కృతజ్ఞతను గురించి ఈ విధముగా పల్కెను – "కృతజ్ఞత యుత్తమమైనది".

*ప్రియమైన పాఠశాల విద్యార్థులారా! మీరు చిన్నతనం నుండే 'కృతజ్ఞత' గల వ్యక్తులుగా తయారుకావాలని, 'కృతఘ్నత' దరిచేరనీయవద్దని కోరుకుంటున్నాను.*



## 2. చదువు - సంస్కారము

[Education - Culture]

చదువుకి, సంస్కారానికి విడదీయరాని బంధం ఉన్నది. వాటిని వేరుగా సాధారణంగా చూడలేము. చదువు ద్వారా అబ్బవలసింది ఎవరికైనా సంస్కారమే. కాని కొంతమంది ప్రవర్తనను గమనిస్తే చదువుకున్న వారందరికీ సంస్కారం అబ్బదు అని అనిపించక మానదు. చదువు కేవలం డిగ్రీలు, ఉద్యోగాలకే పరిమితమనుకుంటే సంఘ జీవనంలో జీవించటం చాలా కష్టము. చదువుతో పాటు ప్రతి వ్యక్తి సంస్కారవంతుడిగా మారాలి. ఆ విధంగా మారిననాడే సంఘ జీవనంలో సంతోషము, శాంతియుత వాతావరణము నెలకొల్పబడును.

అసలు సంస్కారమంటే ఏమిటి? 'సంస్కారం' అనే పదానికి నిర్వచనమేమిటి? అంటే ఒక మాటలో సమాధానం చెప్పటం కష్టం. సంస్కారం అనేది వ్యక్తి లేక వ్యక్తుల మనస్సుకి, ప్రవర్తనకు సంబంధించిన అంశం. వ్యక్తి లేక వ్యక్తుల ప్రవర్తన ద్వారా వారు సంస్కారవంతులా కాదా అని నిర్ణయించబడుతుంది. ఇతరుల పట్ల, లేక మనకి తెలిసిన వారి పట్ల, మనకంటె పెద్దవారిపట్ల, పిన్నల పట్ల గూడా మర్యాదగా, గౌరవంగా ప్రవర్తించడం, కులమతాలతో సంబంధం లేకుండా వారిని గౌరవించడం, వారి పట్ల మర్యాదగా ప్రవర్తించటం, పలుకరించటం – ఇవన్నీ సంస్కారంలో భాగమే. మనకంటె పెద్దవారికి నమస్కరించటం, వారి పట్ల మన గౌరవాన్ని ప్రదర్శించటం, మనకెవరయినా నమస్కరిస్తే వారికి ప్రతి నమస్కారం చేయడం – ఇవన్నీ సంస్కారవంతమైన చర్యలే.

ఇతరుల పట్ల దురుసుగా ప్రవర్తించటం, కటువుగా మాట్లాడటం, బూతులు మాట్లాడటం, ఎదుటివారు మర్యాదగా మాట్లాడినా, ప్రవర్తించినా అవి పట్టించుకోకుండ వారితో పరుషంగా మాట్లాడి అమర్యాదగా ప్రవర్తించటం ఇవన్నీ కుసంస్కార చర్యలే. ఎదుటివారు మనకు నమస్కరించినప్పుడు వారికి ప్రతి నమస్కారం చేయకపోవటం సంస్కారహీనం.

విద్యార్థులు ముఖ్యంగా చిన్నతనం నుండి చదువులో భాగంగా సంస్కారాన్ని నేర్చుకోవాలి. చదువు పాఠాలా ద్వారా నేర్పుతారు. సంస్కారానికి పుస్తకాలుండవు, పాఠాల ద్వారా సిలబస్సు కూడా ఉండదు. కానీ, చదువుతో పాటు ప్రతి విద్యార్థికి సంస్కారమబ్బాలి, సంస్కారవంతులుగా తీర్చి దిద్దబడాలి. విద్యార్థులు చిన్నతనం నుండే సహచర విద్యార్థులతో మంచిగా ప్రవర్తించటం, మంచి అలవాట్లు నేర్చుకోవటం, వారి విద్యలో భాగం కావాలి. వారి ఉపాధ్యాయులకు, ప్రధానోపాధ్యాయులకు కనిపించిన వెంటనే నమస్కరించాలి. తోటి విద్యార్థులతో జగడమాడుట, కొట్లాటలు ఉండకూడదు. మర్యాదకు, క్రమశిక్షణకు, మన్ననకు, సంస్కారానికి వారు మారుపేరుగా ఉండాలి.

ఆ విధంగా వారి ఉపాధ్యాయులు వారిని మలవాలి. బండరాతిని ఒక నైపుణ్యం కలిగిన శిల్పి అద్భుతమైన శిల్పంగా మలచినట్లు లేక చెక్కినట్లు అధ్యాపకులు పాఠశాలయందే వారి విద్యార్థులను మంచి సంస్కారవంతులుగా చదువుతో పాటు తీర్చిదిద్దాలి.

నేటి విద్యార్థులే రేపటి పౌరులన్నట్లుగా భవిష్యత్తు సంఘ జీవనానికి పునాదిరాళ్ళు విద్యార్థులే. వారు దేశానికి ఉప్పులాంటివారు. ఉప్పు నిస్సారమైతే అది దేనివలన సారం పొందదు. అట్లే నేటి బాలబాలికలు సంస్కారవంతులైతేనే శాంతియుత సంఘజీవనం సాధ్యం కాగలదు.

కేవలము అధ్యాపకులే కాదు, తల్లిదండ్రులు గూడ తమ పిల్లలను చిన్నతనం నుండే మంచి, మర్యాద నేర్పి వారిని సంస్కారవంతులుగా తీర్చి దిద్దటానికి ప్రముఖ పాత్రను పోషించాలి. తల్లి ముఖ్యంగా పిల్లలకు ఆది గురువు. ఆమెనుండి మాటలు రాని చిన్నతనం నుండి పిల్లలు కొన్ని నేర్చుకుంటారు. తల్లిదండ్రులను, కుటుంబ వాతావరణాన్ని పిల్లలు గమనిస్తూ ఉంటారనే విషయాన్ని ఎన్నడూ మరువకూడదు. సంస్కారానికి చదువుతో నిమిత్తము లేదు. చదువురానివారిలో అనగా నిరక్షరాస్యులలో కూడా దేశంలో సంస్కారవంతులు కోకొల్లలు. చదువు ద్వారా ఈ సంస్కారము బలపడాలి.

మరొక ఉదాహరణని చూద్దాం. ఒక రామచిలుక రెండు పిల్లల్ని కన్నది. రెక్కలు వచ్చిన తరువాత అవి తల్లిని వీడి ఎగిరిపోయాయి. ఒకటి ఒక కసాయి వాని ఇంట చేరింది. మరొకటి ఒక ముని ఆశ్రమంలో చేరింది.

ఈ ముని ఆశ్రమంలో చేరిన రామచిలుక మర్యాద, మన్ననలు ఆశ్రమ వాతావరణం ద్వారా నేర్చుకొని ఎవరైనా ఆ ఆశ్రమాన్ని దర్శించినప్పుడు, 'కూర్చోండి, ఏమి కావాలి?' అని వారికి నమస్కరించి అడిగేది. కసాయివాని ఇంట పెరిగిన రామచిలుక ఎవరైనా ఇంటికి వస్తే, 'తన్నండి, నరకండి, చంపండి' అనేది. ఈ రెండు రామచిలుకలను ఒకే తల్లి కన్నప్పటికీ పెరిగిన వాతావరణం ద్వారా ఒకదానికి సంస్కారమబ్బింది. రెండవదానికి సంస్కారమబ్బ లేదు.

మరొక ఉదాహరణ చూద్దాం. దాదాపు నాలుగు దశాబ్దాల క్రితం మా కళాశాలలో ఇంటర్మీడియట్ పబ్లిక్ పరీక్షలు జరుగుచున్నవి. సమయం ఉదయం ఎనిమిది గంటలనుండి పదకొండు గంటలవరకు. ఇంటర్మీడియట్ బోర్డు జాయింటు సెక్రటరీగారు ఆకస్మిక తనిఖీకి వచ్చి ఒక రూములోకి వెళ్ళారు. వెళుతుండగానే నేను ఇంటర్మీడియట్ బోర్డు జాయింట్ సెక్రటరీని అని అన్నారు. ఆ రూములో 40మంది విద్యార్థులు, ఇద్దరు పర్యవేక్షకులు ఉన్నారు. ఆయనకు ఒక పర్యవేక్షకుడు నమస్కరించారు. మరొకరు కుర్చీలో కూర్చుని లేవలేదు, నమస్కరించలేదు. ఆయన రూములోని విద్యార్థులను పరిశీలించి వెళ్ళేటపుడు, ఆ లెక్చరర్ లేచి ఉండటాన్ని గమనించి, వారితో మీరు ఏ సబ్జెక్టును బోధిస్తారు అని అడిగారు. వారు ఫలాన సబ్జెక్టు అని చెప్పినాడు. మీరు క్లాసుకు వెళ్ళినపుడు మీ విద్యార్థులు కూడా మీకు ఇంతే మర్యాద ఇస్తారా అని అడిగారు. అప్పుడు ఆ పర్యవేక్షకుడు తాను నమస్కారం చేయలేదని గ్రహించుకొని 'సారీ సర్' అన్నారు.

ఈ యదార్థ సంఘటన ద్వారా సంస్కారాన్ని గురించి విద్యార్థులు బాగా అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాను.

అందుకే భాస్కర శతక కవి ఒక పద్యంలో **“చదువది ఎంత కల్గిన, రసజ్ఞత ఇంచుక చాలకున్న ఆ చదువు నిరర్ధకంబు”** అన్నాడు. చదువుతోపాటు ప్రతివారికి సంస్కారమబ్బాలి. సంస్కారము లేని చదువు గుణహీనునిగా తయారు చేస్తుంది. గుణహీనులను సంఘం మెచ్చదు. వారి వలన సంఘానికి ఉపకారం జరుగదు. అపకారం మాత్రం తప్పకుండా జరుగుతుంది.



# 3. ధర్మము - అధర్మము

భారతదేశాన్ని వేదభూమి అంటారు. వేదాలు మానవాళికి మంచిగా ఎలా జీవించాలి అనే ఉద్బోధ చేసే ప్రామాణిక గ్రంథాలు. ధర్మాధర్మాల వివరణ కూడా అందులో నిక్షిప్తమై ఉన్నది. వేదార్థం ప్రకారం 'ధర్మము' అనే మాట చాలా పెద్ద మాట. దీనిని వివరించాలంటే కనీసం వంద పేజీలన్నా వ్రాయాలి. ఇక్కడ విద్యార్థులకు ఇది విసుగ్గా ఉంటుంది. కనుక సాధారణంగా ప్రస్తుత మానవ జీవితంలో మానవులుగా జీవించడానికి, విచక్షణ జ్ఞానాన్ని కలిగియుండటానికి అవసరమైన రీతిలో చెప్పుకుందాం. 'ధర్మము' అనే పదానికి అనేక అర్థాలున్నాయి. అనేక ధర్మాలు కూడా ఉన్నాయి.

ధర్మము అనగా ఇతరుల ఆస్తులనుగాని, ధనాన్నిగాని బలవంతంగా గాని, అధికార బలం ఉపయోగించిగాని, అరాచక పద్ధతులను అవలంబించి గాని, మోసగించిగాని లాక్కోకుండా ఉండటం. అన్నదమ్ముల ఆస్తి భాగ పంపిణీల దగ్గర, వారసుల ఆస్తి తగాదాల దగ్గర ఈ పదాన్ని ఎక్కువ ప్రయోగిస్తారు. తమ్ముడు తనవాడైనా ధర్మం చెప్పమంటారు. అంటే దీని అర్థం నిష్పక్షపాతంగా వ్యవహరించమని. కురుపాండవ యుద్ధం ధర్మం లోపించినందు వల్లే జరిగింది. ధర్మము ఎన్నటికీ మారదు. కాలం మారినా, పరిస్థితులు మారినా ధర్మానికి స్థిరత్వముంటుంది. మానవ చరిత్రలో ధర్మము తప్పి చరిత్ర హీనులైనవారున్నారు. ధర్మాన్ని పాటించి చరిత్రలో చిరంజీవులైన వారున్నారు.

ఉదాహరణకు ఇద్దరు మిత్రులు కలిసి ఒక స్థలాన్ని కొన్నారు. ఎవరికెంతనే వివరాలు వ్రాసుకోలేదు గనుక చెరి సగమవుతుంది. కాని ఒకరు నా భాగమెక్కువ, నీది తక్కువని లేక నాకు తూర్పువైపు కావాలి, నీకు పడమరవైపు తీసుకోవాలని పేచీ పెడితే వారిరువురు పెద్దమనుషుల పంచాయితిని కోరారనుకుందాం. పెద్దమనుషులు ధర్మంగా మాట్లాడి ఇద్దరికీ న్యాయం చేయాలి కానీ, అనేక కారణాలతో ఒకరికి పూర్తి మద్దతు తెలిపి మరొకరికి అన్యాయం చేయకూడదు. ఇద్దరి భాగస్థులకు సమన్యాయం చేయడమే ధర్మం.

అదే విధంగా ఇద్దరు అన్నదమ్ములకు ఆస్థి పంపిణీ దగ్గర తగాదా వచ్చిందనుకొందాం. వారిరువురు కూర్చొని మాట్లాడుకొని ఆ వ్యవహారాన్ని సరి చేసుకునే పరిస్థితి లేదు. అప్పుడు వారిరువురికి సమ్మతమైన వ్యక్తిని లేక వ్యక్తులను పెద్దమనుషులుగా అంగీకరించి వారి ద్వారా ఆస్తి పంపకానికి ఒప్పుకొన్నపుడు ఆ పెద్దమనుషులు నిష్పక్షపాతంగా వ్యవహరించి ఇద్దరికి సమన్యాయం చేసి ఆ తగాదాని పరిష్కరించాలి. ఆ విధంగా చేసి ఇరువురు తృప్తి చెందే విధంగా చేయుట వారి ధర్మం. వారి పేచీలను పెద్దమనుషులు ఇంకా పెంచితే అది అన్యాయం, అధర్మమగును.

మరొక ఉదాహరణను చూద్దాం. ఒక బలవంతుని పొలము పక్కనే బలహీనుడి పొలము ఉందనుకొందాం. ఆ బలవంతుడు ప్రతి సంవత్సరము కొంత దున్ని బలహీనుడి పొలాన్ని కొంత ఆక్రమిస్తే అది అధర్మం. బలహీనుడు న్యాయాన్ని కోరి కొంతమంది వద్దకు వెళితే వారు బలవంతునికి మేం చెప్పం అని అంటే ఆ బలవంతునికి పరోక్షంగా వారి మద్దతు లభించినట్లే. అట్టి పరిస్థితుల్లో ఆ బలహీనుడు న్యాయస్థానాన్ని ఆశ్రయించినా, ఆ సివిల్ కేసు కొన్ని సంవత్సరాల కాలం పట్టవచ్చు. ధర్మానికి సత్వర న్యాయం జరగనందున ఆ బలహీనుడు నిరుత్సాహం, నిస్సంతోషంగా బ్రతకక తప్పదు. ఒక కళాశాలలో తనకంటె జూనియర్‌కి ప్రమోషన్ ఇచ్చి 30 సంవత్సరాల అనుభవం ఉన్న అధ్యాపకుడిని అదే స్థానంలో ఉంచి యాజమాన్యం అన్యాయం చేస్తే అది అధర్మం.

ఒక తండ్రికి నలుగురు కుమారులుంటే, అందరూ తల్లిదండ్రులకు సమానమే. వారి ఆస్థిని అందరకు సమానంగా పంచి ఇవ్వాల్సిన ధర్మం తల్లిదండ్రులదే. అట్లుగాక వారిష్టమొచ్చినవారికి ఎక్కువ ఇచ్చి, మిగతావారికి తక్కువ ఇస్తే అది అధర్మం. అందరికి సమానంగా పంచటం ధర్మం.

కొన్ని కళాశాలల్లో ప్రాక్టికల్ మార్కులు వేసేటప్పుడు కొందరు అధ్యాపకుల మీద కొన్ని ఆరోపణలు వస్తుంటాయి. వారి కులము వారికో, వారి ట్యూషన్ వారికో, వారి ఊరి వారికో, సిఫార్సులు తెచ్చినవారికో –

మెరిట్ విద్యార్థులకంటె ఎక్కువ మార్కులు వేస్తే అది అధర్మం. మెరిట్ విద్యార్థులకు వారి అర్హత అనగా ప్రతిభను బట్టి మార్కులు వేస్తే అది ధర్మం.

ఒక అధ్యాపకుడు పబ్లిక్ పరీక్షల పర్యవేక్షకునిగా నియమించినపుడు ఒక రూములో ఉన్న విద్యార్థులందరిని ఒకే విధంగా చూడాలి. అట్లుగాక కొందరి పట్ల చూసిచూడనట్లు, మరికొందరి పట్ల కఠినంగా వ్యవహరిస్తే అది అధర్మం. అందరికి ఒకే విధానమవలంబిస్తే అది ధర్మం. విద్యార్థులను కొందర్ని ఎక్కువగా మరికొందరిని తక్కువగా చూడటం అధర్మం, అన్యాయం.

భారత ఫెడరల్ వ్యవస్థలో 29 రాష్ట్రములు సమానమే. కేంద్రంలో ఏ ప్రభుత్వము అధికారంలో ఉన్నా అన్ని రాష్ట్రములకు సమానంగా చూడటం కేంద్ర ప్రభుత్వ ధర్మం. అట్లుగాకుండా రాష్ట్రముల మధ్య వివక్ష చూపించటం అధర్మం.

అసమానతలు పాటించకుండా ఉండటం, అన్యాయాన్ని చేయకుండ ఉండటం, అన్యాయాన్ని ఖండిచంటం ధర్మానికి లక్షణాలు.

ధర్మం అన్ని యుగాల్లో ఒకే విధంగా ఉండదని భగవద్గీత, మహాభారతం చెబుతున్నాయి. కలియుగంలో ఒక పాదం మాత్రమే ఉన్నదని, అన్యాయానికి, అధర్మానికి ఈ కలియుగం పెద్ద పీట వేస్తుందని ఆ గ్రంథాల సారాంశం.

భారతదేశం ఎన్నో యుగాలనుండి ధర్మబద్ధమైన దేశం. ధర్మానికి కట్టుబడి ఉన్న దేశం. భారతదేశపు పునాదులు 'ధర్మము' మీదనే నిర్మించబడ్డాయి. భారతీయ సంస్కృతిలోనే ఈ ధర్మబీజాలున్నాయి. అందుకనే ఈ దేశం పుట్టింది మొదలు నేటివరకు ఏ దేశంమీద కూడా దురాక్రమణకు పాల్పడలేదు. విదేశీయులు భారతదేశం మీద దాడి చేసిన సంఘటనలే గాని, భారతదేశం విదేశాల మీద దాడి చేసిన సంఘటన, సందర్భము ఒక్కటిగూడ నేటి వరకు లేదు. అది భారతదేశ విశిష్టత. ధర్మము యొక్క విశిష్టత.

అందుకే భారతదేశ మోటో – **"సత్యమేవజయతే, ధర్మమేవజయతే"**గా ఉన్నది. అంటే సత్యమే జయిస్తుంది, ధర్మమే జయిస్తుందని దీని భావన.

మహాభారతం – 'ఉద్యోగపర్వం'లో విదురుడు ధృతరాష్ట్రునకు కొన్ని నీతి వాక్యములు చెప్పాడు. వాటినే 'విదురనీతి' అంటారు. ధర్మమును గూర్చి ధృతరాష్ట్రునితో విదురుడు ఈ విధముగా చెప్పాడు. "ధర్మమును విడువక, అధర్మపరులగు నీ కొడుకుల పట్ల పక్షపాతమును వీడి, తగినట్లు వర్ధిల్లుము. అట్లు చేసినచో నీ పుత్రులు సుఖముగా బ్రతుకుదురు. నీవు శోక విముక్తుడవగుదువు. ధర్మసముచితముగా పలుకనివారు పెద్దలా?" అని ప్రశ్నించెను.



# 4. స్వార్థము - నిస్వార్థము

[Selfishness - Selflessness]

స్వార్థమనేది రాక్షస గుణము. నిస్వార్థమనేది దైవగుణముగా లేదా గొప్ప గుణంగా చెప్పుకోవచ్చును. స్వార్థములో కూడా తారతమ్యాలున్నాయి. అసలు స్వార్థం లేని మానవులు అతి తక్కువగానే ఉంటారు. మితిమీరిన స్వార్థం లేక పూర్ణస్వార్థం మనిషి స్వభావాన్ని దుష్టస్వభావంగా మార్చును. దుష్టులెప్పుడూ వారి స్వార్థంతో మంచివారినిగాని, సంఘంలో ఇతరులనుగాని నానా ఇబ్బందులకు గురిచేస్తారు. వారి ధనాన్ని, ఆస్తిని అపహరించుటకుగాని, బలవంతంగా తీసుకోవడానికి గాని నిరంతరం ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. ఇన్నిటికి అసలు స్వార్థగుణమంటే ఏమిటి? స్వార్థపరులెవ్వరు? వారి చర్యలేమిటి? ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను చూద్దాం.

స్వార్థగుణానికి కచ్చితమైన నిర్వచనం చెప్పటం అంత సులభం కాదు. స్వార్థగుణమనగా మితిమీరిన ఆశ, తపనగా చెప్పవచ్చును. మనిషి ఆశాజీవి. మితిమీరిన ఆశని దురాశగా కూడా పిలుస్తారు. మితిమీరిన ఆశ లేక దురాశకు ఉచితానుచితాలుండవు (రీజన్ ఉండదు). నేను ఎక్కువ ధనాన్ని సంపాదించాలి, ఎక్కువ పదవులు చేయాలి అనే మితిమీరిన కాంక్షని ఎవరు అడ్డుకున్నా వారిని హతమారుస్తారు. ప్రతి వ్యక్తి తన వనరులని, తన సామర్థ్యాన్ని ముందు అంచనా వేసుకొని ఏ పనైనా చేయాలి. న్యాయాన్ని, ధర్మాన్ని తప్పి వ్యవహరించిన వ్యక్తిని స్వార్థపరుడంటారు. ఉదాహరణకు ఇతరుల ఆస్తిని దౌర్జన్యంగా లాక్కొనుట, ఇతరుల భూమిని గాని, స్థలాలనుగాని దురాక్రమణ చేయుట, ప్రభుత్వ భూముల్ని ఆక్రమించటం, బీదల గుడిశెలను దౌర్జన్యంగా లేపి ఆ స్థలాన్ని ఆక్రమించడం – ఇటువంటి చర్యలన్నీ స్వార్థపూరితమైనవి. స్వార్థపరులు చేసేవే. స్వార్థపరులకు న్యాయాన్యాయాలతో, ధర్మాధర్మాలతో పనిలేదు. వాటిని గురించి వారు అసలు ఆలోచన చేయరు. దౌర్జన్యం, రౌడీయిజమే ముఖ్యం. స్వార్థపరుల చర్యలెప్పుడూ ఇతరులను ఇబ్బందులకు, అశాంతికి గురిజేసేవిగా ఉంటాయి.

మరొక రకంగా చెప్పాలంటే స్వార్ధపరులంతా సంఘానికి చీడపురుగుల్లాంటివారు. చీడపురుగులు మొక్కలను, చెట్లను తినేసినట్లుగా వారు సంఘాన్ని తినేస్తారు. అందుకనే రాయప్రోలు సుబ్బారావుగారు "దేశ సేవకంటే దేవతార్చన లేదు, స్వార్ధపరత కంటె చావు లేదు" అన్నాడు. స్వార్ధపరుల వలలో చిక్కినవారు విలవిల లాడిపోతారు. వారి వలనుండి బయటకు రావటం దుర్లభం.

స్వార్ధానికి ప్రతీకగా మహాభారతంలోని 'ఆదిపర్వము'లో ఏకలవ్యుని వృత్తాంతాన్ని ఉదహరించవచ్చును. ఏకలవ్యుడు క్షత్రియుడు కాడు. ఎరుకల కులానికి చెందిన వ్యక్తి. కానీ ధనుర్విద్య నభ్యసించాలనే కోరిక బలంగా యున్నందున ద్రోణాచార్యులవారి వద్దకు రాగా, ద్రోణుడు ఏకలవ్యుడిని 'నిషాద పుత్రుడ'ని శిష్యునిగా చేర్చుకొనుటకు నిరాకరించగా ద్రోణుని అనుమతి పొంది, అతని ప్రతిమను మట్టితో చేసి, ఆ బొమ్మకు ప్రదక్షిణము చేసి మ్రొక్కుచు అభ్యాసముచే అస్త్ర విద్యా రహస్యములను పొంది విలువిద్యలో ద్రోణుని శిష్యులందరినీ మించిపోగా, అర్జునుడు ద్రోణునితో 'ధనుర్విద్యలో నాకంటెను, మీకంటెను, అందరికంటెను మించిన వ్యక్తి ఒకడు నీ శిష్యుడనని చెప్పుకొనుచున్నాడు. కాని నాకంటె మించిన వ్యక్తి ధనుర్విద్యలో ఎవరూ లేకుండా చేస్తానని నాకు మాట ఇచ్చిన విషయము ఏమైందని అడుగగా అప్పుడు ద్రోణుడు అర్జునుడు వెంబడింపగా ఏకలవ్యుడిని కలిశాడు. ఏకలవ్యుడు ద్రోణునికి నమస్కరించి నేను మీ శిష్యుడను, మిమ్మారాధించి ధనుర్విద్యా పారంగతుడనయ్యానని తెలుపగా ద్రోణుడు నీ కుడిచేతి బ్రొటనవేలుని గురుదక్షిణగానిమ్మని అడుగగా, అతడు వెంటనే తన కుడి చేతి బ్రొటనవేలును తెగనరికి గురుదక్షిణగా ద్రోణాచార్యునకు సమర్పించెను.

ఇది ద్రోణాచార్యులవారి స్వార్ధానికి పరాకాష్టగా పేర్కొనవచ్చును. విద్య నేర్పే గురువుకి శిష్యులందరూ సమానమే. కులాన్నిబట్టి ప్రాధాన్యతనివ్వ గూడదనేది ఆధునిక సిద్ధాంతం. తన శిష్యుడైన అర్జునునికి ధనుర్విద్యలో సాటి లేకుండా చేయటానికి, అతనికిచ్చిన మాట నిలబెట్టుకోవడానికి ఈ చర్యకు ద్రోణుడు పాల్పడ్డప్పటికీ ఇది స్వార్ధ పూరిత చర్యగా భావించాలి.

స్వార్థానికి పరాకాష్టగా ప్రపంచ ప్రఖ్యాత నాటక రచయిత విలియం షేక్స్పియర్ వ్రాసిన “మర్చంట్ ఆఫ్ వెనిస్” అనే నాటకంలో షైలాక్ పాత్రను పేర్కొనాలి. షైలాక్ అనే వ్యక్తి మనీలెండర్ (ధనాన్ని ఇతరులకు వడ్డీకి ఇచ్చేవాడు). బసానియో అనే వ్యక్తికి ధనాన్ని ఇచ్చి కొన్ని షరతులు విధిస్తాడు. బసానియో తిరిగి చెల్లించటానికి మరికొన్ని రోజులు గడువు కోరగా అందుకు నిరాకరించి షైలాక్ అంగీకార పత్రం ప్రకారం తన శరీరంలో ఒక పౌండు ఫ్లెష్ (మాంసము) ఇవ్వమంటాడు. షైలాక్ గనుక బసానియో శరీరంనుండి ఒక పౌండు మాంసం తీస్తే రక్తము కారి అతను చనిపోయే ప్రమాదమున్నది. కానీ అతడు చనిపోతే నాకేం నాకు కావలసినది 'పౌండ్ ఆఫ్ ఫ్లెష్' అని పట్టుబట్టడాన్ని పరిశీలిస్తే షైలాక్ స్వార్థం, మానవత్వం కొరవడటం, స్వార్థానికి విచక్షణా జ్ఞానం ఉండదు అనే విషయాలు స్పష్టమవుతున్నాయి.

స్వార్థపరులెప్పుడు వారిని గూర్చి మాత్రమే ఆలోచిస్తారు. వారి సమయాన్ని గాని, ధనాన్నిగాని ఇతరుల కోసం ఎన్నటికీ కేటాయించరు. వారి కోసం మాత్రమే కేటాయించుకుంటారు.

సమాజంలో కొన్ని వృత్తులవారికి స్వార్థముంటే సమాజ జీవనం సాఫీగా సాగదు. అధ్యాపకులు, డాక్టర్లు, నర్సులు, మెడికల్ వ్యాపారస్తులు, మెడిసిన్స్ తయారుచేసే పారిశ్రామికవేత్తలు, ఆహార పదార్థాలు అమ్మేవారు, పోలీసులు, దేశరక్షణ సిబ్బంది తదితరులు, స్వార్థ స్వభావం ఎవరికున్నా, ఎవరైన తమ స్వార్థాన్ని సమాజంలో ప్రదర్శించినా వారిని ఖండించాలి, విమర్శించాలి. వారిని వెలివేయాలి. వారి స్వార్థానికి బలిగాకుండా జాగ్రత్తపడాలి.

## నిస్వార్థం :

ఇది స్వార్థగుణానికి వ్యతిరేక పదం. నిస్వార్థపరులు వారిని గూర్చిగాని, వారి కోసంగాని ఎక్కువగా ఆలోచించరు. వారి సమయాన్ని, ధనాన్ని ఇతరుల కోసం, సమాజం కోసం, దేశం కోసం, పెద్ద పెద్ద ప్రయోజనాల కోసం వెచ్చిస్తారు. సంపాదన కోసం, పేరుకోసం వెంపర్లాడరు. అన్యాయాలు, మోసాలు

చేయరు. ఇతరుల సొమ్ముకోసం ఎన్నడూ ప్రయత్నించరు. మంచి పనులు చేయుటకు సమాజంలో ముందుంటారు. వారిలో కుట్రలు, కుతంత్రాలుండవు. నిస్వార్థం వారి మాటల్లో చేతల్లో తొణికిసలాడుతుంది. మరో రకంగా చెప్పాలంటే వారు సమాజహితులు, దేశభక్తులు, అందరి మంచిని కోరేవారు.

నిస్వార్థగుణం మనిషిని దైవసమానులుగా, గొప్ప వ్యక్తులుగా చేస్తుంది. ప్రపంచంలో అనేకమంది గొప్పవారు నిస్వార్థపరులే. మహాత్మాగాంధి, లాల్‌బహదూర్ శాస్త్రి, డా॥ బి.ఆర్. అంబేద్కర్, మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్, డా॥ అనిబిసెంట్, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణగోఖలే, శ్రీమతి సరోజినీ నాయుడు, అబ్రహాం లింకన్, సురేంద్రనాథ్ బెనర్జీ, రవీంద్రనాథ్ టాగూర్, నేతాజి, డా॥ అబ్దుల్‌కలామ్ మొదలయినవారు.

స్వార్థానికి, నిస్వార్థానికి తేడా ఇది. స్వార్థపరులెప్పుడూ వారి స్వప్రయోజ నాలను గురించే ఆలోచిస్తారు. వారి స్వప్రయోజనాల సాధనకే కృషి చేస్తారు. వారి స్వప్రయోజనాలకే వారి ధనాన్ని, సమయాన్ని పూర్తిగా వెచ్చిస్తారు. ఇతరుల గురించిగాని, తన చుట్టూ ఉన్న సమాజాన్ని గురించిగాని ఏ మాత్రమూ ఆలోచించరు. ఇతరులకు సహాయ, సహకారములు చేయరు. నిస్వార్థపరులు వారి స్వప్రయోజనాలగురించి పెద్దగా ఆలోచించరు. వారు ఇతరులను గురించి, సమాజాన్ని గురించి ఎక్కువగా ఆలోచిస్తారు. వారి సమయాన్ని, ధనాన్ని సైతం ఇతరుల కోసం ఖర్చు చేస్తారు. అపద సమయాల్లో ఇతరులను ఆదుకుంటారు. వారికి స్వప్రయోజనాలకంటె సంఘ ప్రయోజనాలు, ఆపదలో ఉన్నవారి ప్రయోజనాలే ముఖ్యం. స్వప్రయోజనాల, స్వార్థప్రయోజనాల లక్ష్యసిద్ధి వారి కుండదు. వారు పరోపకారానికే అధిక ప్రాధాన్యతనిస్తారు.

కొందరు నిస్వార్థపరుల చరిత్రను పరిశీలిద్దాం.

### 1. మహాత్మాగాంధి :

గాంధిగారిని గొప్ప వ్యక్తిగా తీర్చిదిద్దిన కొన్ని గుణాలలో ముఖ్యమైనది ఆయన నిస్వార్థగుణము. తన జీవితంలో తనకంటు ఏవిధమైన విలువైన ఆస్తులను, ధనాన్ని సంపాదించుకొనలేదు. ఆయనకున్న ఆస్తల్లా ఒక జత

ముతక ఖద్దరు బట్టలు. స్వాతంత్రోద్యమంలో అనేకసార్లు జైలుకి వెళ్ళి ఉద్యమ నాయకుడిగా, నిస్వార్ధంగా ఉద్యమాన్ని ముందుకు నడిపించారు. హిందూ ముస్లిం ఐక్యత కొరకు పాటుబడ్డారు. తన సమయాన్నంతా దేశానికే వెచ్చించారు. ఇతరుల కష్టాలలో నిత్యము పాలుపంచుకొని ప్రజా శ్రేయస్సు కోసం అనునిత్యము కృషి చేశారు. ప్రపంచం ఆయనను గొప్ప వ్యక్తిగా, 'మహాత్ముడి'గా గుర్తించింది.

సాధారణంగా ఎవరి జన్మదినాన్ని వారు పండుగగా జరుపుకుంటారు. కాని గాంధిగారి జన్మదినాన్ని భారతజాతే గాకుండా, విదేశాల్లో కూడా జరుపుకుంటున్నారంటే ఆయన నిస్వార్ధానికిదే నిదర్శనం. వేల కోట్లు సంపాదించినవారిని కూడా వారి మరణానంతరం మరచిపోతున్నారు. కానీ గాంధీగారు ఒక పైసా సంపాదించకపోయినా ప్రపంచం ఆయనను గుర్తు పెట్టుకుంది. ఆదర్శంగా తీసుకొని ఆరాధిస్తుందంటే ఆయన నిస్వార్ధమే అందుకు కారణం. నిస్వార్ధానికి ఎల్లలుండవు కదా!

**2. లాల్‌బహదూర్ శాస్త్రి :**

జవహర్‌లాల్ నెహ్రూ తరువాత దేశ ప్రధాని పదవినలంకరించారు. ఈయన గాంధీగారి శిష్యుడు. నిస్వార్ధానికి నిలువెత్తు ఉదాహరణ ఈ మహా వ్యక్తి. చిన్నతనంలోనే తండ్రి చనిపోయాడు. గాంధీగారు కాశీ విశ్వవిద్యాలయ శంకుస్థాపనకొచ్చి ప్రసంగించగా ఆ ప్రసంగం విని ప్రేరేపితుడై ఐదవ తరగతి చదువుతూ దేశ సేవకై చదువుమాని స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. వారి ఉపాధ్యాయులు వద్దని వారించినా "నా దేశం కంటె నా కుటుంబం నాకు ముఖ్యం కాదన్నాడు". ఇది ఆయన నిస్వార్ధమునకు నిలువెత్తు ఉదాహరణ.

**3. శ్రీమతి సరోజినీనాయుడు :**

ఈమెను భారత కోకిల అంటారు. కవయిత్రి, మంచి ఉపన్యాసకురాలు. త్యాగశీలి, స్వాతంత్రోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత హైదరాబాద్ అబిడ్స్ సెంటర్ దగ్గర ఉన్న తన ఇల్లు "గోల్డెన్ త్రెషోల్డ్"ని జాతికి అంకితమిచ్చారు. దాని విలువ ఈ రోజు వంద

కోట్లకు పైనే ఉంటుంది. ప్రభుత్వ భూములు కబ్జా చేసే ఈ రోజుల్లో ఆమె నిస్వార్థాన్ని, దేశ భక్తిని మనం గమనించాలి, శ్లాఘించాలి.

**4. అబ్రహాం లింకన్ :**

ఇప్పటికీ అమెరికా అధ్యక్షులలో గొప్ప వ్యక్తిగా అమెరికన్లు పరిగణిస్తారు. దశలవారీగా బానిస వ్యవస్థను నిర్మూలించారు. అమెరికాకు ఎవరు అధ్యక్షులైనా వారు ఉండే నివాస గృహము పేరు 'వైట్ హౌస్'. దానిని అప్పుడప్పుడూ రిపెయిర్స్ చేయిస్తుంటారు. ఆయన టైంలో 'వైట్ హౌస్' రిపెయిర్‌కు 25వేల డాలర్ల ఖర్చు అవుతుందని ఇంజనీర్లు, అధికారులు అంచనాలు తయారుచేసి ఇచ్చారు. ఆయన భార్య శారా రిపెయిర్స్ చేయించాలని పట్టుబట్టింది. అబ్రహాం లింకన్ ఆ సందర్భములో అందుకు నిరాకరించి ఈ విధంగా అన్నాడు. "అమెరికన్ సైన్యానికి చలికాలంలో కప్పుకోవడానికి సరిగా దుప్పట్లు లేవు. నాకు నా సైన్యం కంటె వైట్ హౌస్ రిపెయిర్స్ ముఖ్యం కాదని చేయించలేదు". ఇది ఆయన నిస్వార్థానికి తిరుగులేని ఉదాహరణ.

**5. నెల్సన్ మండేలా :**

సౌత్ ఆఫ్రికా దేశానికి చెందిన ఈయనను "నల్లసూర్యుడు" అంటారు. తన దేశం కోసం దశాబ్దాల తరబడి జైలుకెళ్ళిన వ్యక్తి. తన జాతి కోసం, వారి హక్కుల కోసం అలుపెరుగని పోరాటం చేసి విజయాన్ని సాధించిన వ్యక్తి. చివరకు ఆ దేశ పాలనా పగ్గాలను చేతబట్టాడు. ఇటీవలే కొన్ని సంవత్సరాల క్రితం మరణించాడు ఈ నిస్వార్ధ జీవి.

ఇంకా ఎందరో దేశవ్యాప్తంగా, ప్రపంచవ్యాప్తంగా నిస్వార్ధపరులు గలరు. 21వ శతాబ్దంలో భారత దేశాధ్యక్షుడిగా పనిచేసిన **డా॥ ఎ.పి.జె. అబ్దుల్ కలాం** గూడా గొప్ప నిస్వార్ధపరుడు. తన జీతాన్ని, పెన్షన్‌ను కూడా బీదవారి కోసం ఖర్చు చేసిన గొప్ప వ్యక్తి. ఇతరుల సంక్షేమమే తన సంక్షేమంగా భావించిన మహానీయుడు. ఆయన రాష్ట్రపతిగా ఉండగా తన అన్నగారు, వారి బంధువులు ఢిల్లీ వెళ్ళినపుడు వారికి రాష్ట్రపతి భవన్‌లో విందు, నివాసము ఏర్పాటు చేయకుండా, బయట ఏర్పాట్లు చేసి ఆ బిల్లులు ఆయనే చెల్లించిన గొప్ప వ్యక్తి.

# 5. సత్యం - అసత్యం

[Truth - Falsehood]

సత్యం – అసత్యం – ఈ రెండు పదాలు ఒకదానికొకటి వ్యతిరేక పదాలు.

**సత్యగుణము :** ఈ గుణానికి ఏ కాలంలోనైనా మరణం లేదు. కాలమాన పరిస్థితులనుబట్టి సత్యస్వరూపంగాని, స్వభావంగాని ఎన్నటికీ మారదు. సత్యమనగా నిజాన్ని మాట్లాడటం, నిజాయితీగా వ్యవహరించటం, మోసానికి, అన్యాయానికి దూరంగా ఉండటం. సత్యాన్ని భగవత్ స్వరూపమంటారు. ప్రముఖ ఆంగ్లకవి జాన్‌కీట్స్ తాను వ్రాసిన ఒక పద్యంలో "సత్యం, శివం, సుందరం" అన్నాడు. అంటే సత్యమంటే భగవత్ స్వరూపమని అర్థం. భారతదేశ మోటో కూడా ఈవిధంగా ఉన్నది – **"సత్యమేవ జయతే, ధర్మ ఏవ జయతే"**. దీని భావము సత్యధర్మాలు విజయం పొందుతాయని, సత్యమే జయిస్తుందని, ధర్మమే జయిస్తుందని. భారతదేశాన్ని వేదభూమి అంటారు. వేదాలు ఈ దేశంలోనే పుట్టాయి. పంచమ వేదమైన 'మహాభారతం' కూడా ఈ దేశంలోనే పుట్టింది. వేదాలు మానవాళికి సత్యధర్మాలు, సత్యధర్మాలతో కూడిన ప్రవర్తనను గురించి బోధిస్తున్నాయి.

హరిశ్చంద్ర మహారాజు వృత్తాంతము కూడా ఈ దేశంలో బహుళ ప్రచారము, ప్రసిద్ధి పొందినది. సత్యవాక్కుకు కట్టుబడి రాజ్యాన్ని, భార్యాబిడ్డలను కూడా పోగొట్టుకొని చరిత్రలో చిరంజీవిగా మిగిలారు.

20వ శతాబ్దంలో మహాత్మాగాంధిగారు సత్యం, అహింస సిద్ధాంతాన్ని బోధించారు. గాంధీగారిని గొప్ప వ్యక్తిగా, మహాత్మునిగా తీర్చిదిద్దిన గుణాలలో 'సత్యం' ఒకటి. ఆయన జీవితమంతా సత్యాన్ని అభ్యాసము చేసి మాట్లాడారు. అందుకే ఆయన కూడా ప్రపంచ చరిత్రలో మహాత్ముడిగా మిగిలిపోయారు. ఆయన ఉదాహరణ ప్రపంచంలో కొన్ని కోట్లమంది ప్రజలను ప్రభావితం చేసిందంటే అది సత్యానికున్న గొప్పతనం, మహిమ.

సత్యం మాట్లాడేవారు నిర్భయంగా ఉంటారు. "సత్యం మిమ్ములను స్వతంత్రులుగా చేయును"ని బైబిల్ గ్రంథం కూడా చెబుతుంది.

సత్యాన్ని మాట్లాడేవారి సంఖ్య నానాటికి తగ్గిపోతుంది. బ్రతుకుదెరువు తెలివితేటలు ప్రదర్శించేవారికి, మనిషి ముందు మనిషి మాట మాట్లాడేవారికి, వాస్తవాలు దాచి ఇతరులను వారి అవసరార్థం స్తుతించేవారికి అసలు సత్యంతో పనిలేదు. అసత్యమే వారిని ఆదరించును. వారి ఆత్మబంధువు. సత్యం మాట్లాడేవారు జీవితంలో అనేక ఇబ్బందులు, కష్టాలు, దుఃఖాలు ఎదుర్కొనవలసి వస్తుంది. సత్యానికి కట్టుబడిన వ్యక్తికి, సత్యాన్ని మాట్లాడే వ్యక్తికి మిత్రులు, శ్రేయోభిలాషులు ఎక్కువగా ఉండరు. అసత్యం మాట్లాడేవారికే సంఘం విలువనిస్తుంది. వారికి సన్నిహితులు, శ్రేయోభిలాషులు ఎక్కువగా ఉంటారు. అసత్యం మాట్లాడేవారికి ఆదరణ ఎక్కువగా ఉండవచ్చుగాని, వారికి నిజమైన గౌరవం, అభిమానం సంఘంలో కొరవడతాయి.

అసలు అసత్యం అంటే ఏమిటి? అసత్యాన్ని ఎక్కువమంది ఎందుకు పోషిస్తున్నారు? అసత్యం మాట్లాడినందువలన లాభాలేంటి? ఇత్యాది ప్రశ్నలకు సమాధానం చూద్దాం. చీటికిమాటికి అబద్ధాలు చెప్పటం, నిజాలు దాచిపెట్టటం, నిజాలు మాట్లాడకుండా ఉండటం, నిజాలు మరుగున పడేటట్లు మాట్లాడటం, తాత్కాలిక లాభం కోసం, అవసరం తీర్చుకోవటం కోసం, వాస్తవాలను వక్రీకరించటం, తమ అవసరార్థం ఇతరులను అనవసరంగా, అనుచితంగా పొగడటం – ఇవన్నీ అసత్యాలే, అసత్యాల్లో భాగమే. అసత్యాలు మాట్లాడేవారికి వారు అసత్యాలు మాట్లాడుతున్నారనే విషయం వారి మనస్సుకు తెలుసు. కాని అసత్యాలు మాట్లాడితే తాత్కాలిక లాభాలున్నపుడు, తాత్కాలిక లాభం పొందే భాగంలో ఒక చర్యగా వారు ఈ పద్ధతిని ఎంచుకొంటారు. దానివల్ల లాభిస్తారు. మరొక ఉదాహరణను పరిశీలిద్దాం. మన న్యాయస్థానాల్లో సాక్షులను జడ్జీగారు పిలిచినపుడు ఆ సాక్షులు పవిత్ర గ్రంథాలమీద ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను, అబద్ధాలు చెప్పను అంటారు. కాని సాక్షులు అబద్ధాలు చెప్పినందువల్ల కొన్ని సందర్భాలలో నిజాయితీ గల కేసులు ఓడిపోయి, అసత్య

కేసులు గెలుస్తాయి. ఇది మన న్యాయస్థానాల్లో మనం చూసే, నిజానికి జరిగే వాస్తవాలు.

సత్యం అంత తొందరగా జనాన్ని ఆకర్షించదు. అసత్యానికి జనాకర్షణ ఎక్కువ. కాని తుదకు సత్యము జయించి అసత్యం అపజయం పాలవుతుంది. సత్యాన్ని, సత్యం మాట్లాడేవారికి ఆదరణ తక్కువగా ఉన్నా వారికి శాశ్వతమైన విలువ, గౌరవం ఉంటుంది.

ఈ సత్యాసత్యాల వివరణను మరికొన్ని ఉదాహరణలతో పరిశీలిద్దాం. అబ్రహాం లింకన్‌గారు అమెరికా దేశాధ్యక్షులలో ఒక గొప్ప అధ్యక్షుడే గాకుండా ఒక గొప్ప న్యాయవాది కూడా. ఒక పర్యాయము అమెరికాలో లింకన్‌కు బాగా తెలిసిన వ్యక్తి మీద ఒక హత్యానేరం మోపబడి ఆయనమీద కోర్టులో కేసు వేశారు. లింకన్‌కు ఆ వ్యక్తి స్వభావము బాగా తెలుసు గనుక ఆ ఆరోపణ అబద్ధమని మనస్ఫూర్తిగా నమ్మి ఆ కేసుని ఫీజు తీసుకోకుండా కోర్టులో వాదించాడు. ప్రత్యర్ధి లాయర్ కొందరు సాక్షులను ప్రవేశపెట్టుటకు న్యాయమూర్తి అనుమతి పొంది వారిని సాక్ష్యం చెప్పటానికి ప్రవేశపెట్టగా వారిలో ఒకరు ఇతడు హత్య చేయడం నేను కళ్ళారా చూశాను అని చెప్పాడు. పైగా ఆ రోజు అమావాస్య అని అబద్ధ సాక్ష్యం చెప్పగా, లింకన్ అతన్ని క్రాస్ ఎగ్జామిన్ చేసి అమావాస్య రోజు అయితే నీకు ఎలా కనిపించింది అని ప్రశ్నించాడు. కేలండర్ తెప్పించి ఆ తేదిని చూడగా ఆ రోజు అమావాస్య కాదు, పౌర్ణిమ అని ఉండటాన్ని గమనించి, జడ్జీగారికి ఆ కేలండర్‌ను చూపించగా, ఆ సాక్ష్యం అబద్ధమని నమ్మిన ఆ న్యాయమూర్తి ఆ కేసును కొట్టివేసి అతనిని నిర్దోషి అని ప్రకటించారు. ఇది సత్యానికున్న బలం, శక్తి. వెలుతురు ముందు చీకటి నిలువనట్లుగా సత్యం ముందు అసత్యం నిలువజాలదు, నిలువలేదు.

మరొక ఉదాహరణను చూద్దాం. ఒక అబ్బాయి ఒక అమ్మాయికి పరిచయమయ్యాడు. అమ్మాయికి మాయమాటలు చెప్పి తనను వివాహం చేసుకుంటానని నమ్మించి, ఆ అమ్మాయిని మోసం చేశాడు. ఆ అమ్మాయి అతనిని వివాహం చేసుకోమ్మని నిలదీయగా, అతను నిరాకరించాడు. ఆ

అమ్మాయి అబ్బాయి ఇంటి ముందు ఆమరణ నిరాహారదీక్ష చేయగా చివరకు ఆ అబ్బాయి ఆమెను వివాహమాడటానికి నిశ్చయించి, తరువాత పోలీసుల జోక్యంతో వివాహమాడాడు. ఇటువంటి సంఘటనలు టి.వి. ఛానెళ్ళలో, వార్తల్లో నిత్యం మనం చూసేవే, వినేవే. అమ్మాయిలకు అసత్యాలు చెప్పి, మోసాలు చేసి చివరకు కటకటాల పాలై నిజాన్ని, సత్యాన్ని అంగీకరించిన సందర్భాలు అనేకం. ఇది సత్యానికున్న బలం, శక్తి, వెలుగు.

విద్యార్థులు చిన్న, చిన్న అబద్ధాలు చెప్పే సందర్భాలను చూద్దాం. ఒక విద్యార్థి పాఠశాలకు ఆలస్యంగా వచ్చాడు. ఆ టీచరుగాని, హెడ్‌మాస్టరు గాని ఆ విద్యార్థిని ఎందుకు పాఠశాలకు ఆలస్యంగా వచ్చావని ప్రశ్నిస్తే, ఆ విద్యార్థి వెంటనే సైకిల్ పంక్చరు పడ్డదనో లేక ఈ రోజు బస్సు ఆలస్యంగా వచ్చిందనో సమాధానమిస్తే వారు ఏమీ అనలేని పరిస్థితి.

మరొక విద్యార్థి ఒకటి రెండు పరీక్షలకు చదవక గైరుహాజరయ్యాడు. టీచర్లుగాని, హెడ్‌మాస్టరుగాని ఎందుకు పరీక్షకు రాలేదని అడిగిన వెంటనే నాకు జ్వరం వచ్చిందని అబద్ధం చెబుతాడు.

క్లాసురూములో ఇద్దరు అమ్మాయిలు టీచరు చెప్పే పాఠం వినకుండా గుసగుసలాడుకుంటున్నారు. వారిని గమనించిన టీచరు వారిని లేపి ఎందుకు మాట్లాడుతున్నారని అడిగితే వారు వెంటనే మేము మాట్లాడటం లేదని సమాధానమిస్తారు.

మరొక విద్యార్థి క్లాసుకు రాకుండా సినిమాకు వెళ్ళాడు. మరుసటి రోజు ఆ టీచరు అడిగితే నిన్న మా అమ్మ, నాన్న వివాహానికి వెళుతూ నన్ను కూడా తీసుకొని వెళ్ళారని సమాధానమిస్తాడు. ఇవన్నీ చిన్న చిన్న ఆడగూడని అబద్ధాలు. ఇటువంటి అసత్యాల వల్ల చివరకు నష్టపోయేది విద్యార్థులే అని వారెరుగరు.

కనుక చిన్నతనం నుండే విద్యార్థులు నిజాలు మాట్లాడటానికి, సత్యాన్ని ఆదరించడాన్ని అలవాటు చేసుకుంటే వారికి భవిష్యత్తులో నిజాయితీతో గూడిన

ప్రవర్తన అలవడగలదు.

మహాభారతం – 'ఉద్యోగపర్వం'లో విదురుడు దృతరాష్ట్రునికి కొన్ని నీతి వాక్యములు చెప్పెను. దానినే 'విదురనీతి' అందురు.

విదురనీతిలో విదురుడు సత్యాన్ని గూర్చి ఈ విధముగా వచించెను. "సముద్రమును దాటుటకు ఓడవోలే జీవితయాత్రకు సత్యమే సాధనము. కావున సత్యమును మించిన గుణము మరియొకటి లేదు. సత్యము లేకుండా ధర్మము లేదనె"ను.



# 6. పట్టుదల

[Determination of mind]

పట్టుదల మానవ జీవిత సుగుణాలలో అతి ముఖ్యమైనది. ప్రపంచంలో గొప్ప గొప్ప విజయాలు సాధించిన వారందరూ వారి పట్టుదల, శ్రమతోనే సాధించారు. పట్టుదల లేని వ్యక్తులు విజయాలను సాధించలేరు. గొప్ప కార్యాలను సాధించలేరు.

అసలు పట్టుదల అంటే ఏమిటి? పట్టుదల వలన కలిగే ప్రయోజనాలు ఏమిటి? పట్టుదల లేని వ్యక్తులు ఎలా ఉన్నారు? ఏమి సాధించగలిగారు? పట్టుదల లేకుండా కేవలం అదృష్టం మీద ఆధారపడి ఏమి సాధింపవచ్చు? ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను చూద్దాం.

ప్రతి వ్యక్తి జీవితంలో కొన్ని ఆశలు, ఆశయాలు, కలలు ఉంటాయి. వ్యక్తి తనకున్న ఆశలను, ఆశయాలను, కలలను సాకారం చేసుకునే భాగంలో నిరంతరం ఆసక్తి, శ్రమ ఉన్నచో వాటిని అతను సాకారం చేసుకోగలడు. విజయం సాధించగలడు. ఆశయ సాధనకు వ్యక్తికున్న నిరంతర ఆసక్తి, ప్రయత్నమునే పట్టుదల అంటారు.

పట్టుదల గలిగిన వ్యక్తి/వ్యక్తులు దేనికైనా అనగా వారు అనుకున్న పనిని సాధించటంలో విజయం సాధిస్తారు. ప్రపంచంలో సాధింపబడ్డ గొప్ప కార్యాలన్నీ పట్టుదలవలనే సాధించబడ్డాయి. ఒక పనిని సాధించాలనుకున్నపుడు ఆ పని సాధన క్రమంలో కొన్ని అవరోధాలు ఏర్పడవచ్చు. కాని నిరంతరం ఆసక్తి, ప్రయత్నము వలన చివరకు ఆ పనిని సాధించవచ్చును. ఒక చిన్న ఉదాహరణను పరిశీలిద్దాం. ఎఱ్ఱచీమ అతి చిన్న జీవులలో ఒకటి. ఒక కంది గింజ పరిమాణంలో దాని శరీరము కనీసం పదోవంతు కూడా ఉండదు. కానీ అది కందిగింజను దొర్లించుటకు నిరంతరము ప్రయత్నించి సాగించి చివరకు తన రంధ్రములోకి లాగటంతో విజయవంతమవుతుంది. ఈ నిరంతర ప్రయత్నం, శ్రమను పట్టుదల అంటారు. కందిగింజ చాలా పెద్దది. నావల్ల

కాదని ఆ ఎఱ్ఱచీమ అనుకుంటే, ప్రయత్న విరమణగావించితే, ఆ గింజ తన నివాసానికి చేరే అవకాశమే లేదు.

పట్టుదలకు పెట్టింది పేరుగా ఏకలవ్యుని వృత్తాంతాన్ని చూద్దాం. నన్నయ మహాభారతంలోని ఆదిపర్వంలో ఏకలవ్యుని వృత్తాంతము కలదు. ద్రోణాచార్యులవారు కౌరవ, పాండవుల అస్త్ర విద్యా గురువు. వారిలో అర్జునుడు ఆయనకు ప్రియ శిష్యుడు. అస్త్ర విద్యలో అర్జునుని మించిన వ్యక్తి లేకుండా అతనిని తీర్చిదిద్దుతానని మాట ఇచ్చాడు. ఒక రోజున ఏకలవ్యుడు అను ఎరుకరాజు కుమారుడు అస్త్ర విద్యనభ్యసింపదలచి ద్రోణాచార్యుని చెంతకేగి తనకు కూడా అస్త్రవిద్యను నేర్పవలసిందిగా కోరాడు. అందుకు ద్రోణుడు అతని కులము కారణంగా, తన శిష్యుడుగా అంగీకరించలేదు. రాజ కుమారులతో పాటు విద్యనేర్చుటకు నిరాకరించెను. ఏకలవ్యుడు ద్రోణుని అనుమతి కోరి, ద్రోణుని ప్రతిమను మట్టితో తయారుచేసి అరణ్యమైదానములో ఉంచి ఆ బొమ్మ చుట్టూ ప్రదక్షిణము చేసి నమస్కరిస్తూ అస్త్ర విద్యాభ్యాసమును ఆరంభించి, నిరంతర కృషి, పట్టుదల వల్ల అస్త్రవిద్యా పారంగతుడాయెను. ఒక రోజు ఒక కుక్క అతడు సాధన చేయుచుండగా మొరగగా, అది అరవకుండా నోటిలో ఏడు బాణాలను సంధించెను. ఆ కుక్క పరుగెత్తి అర్జునుని కడకేగెను. ఈ కుక్కని ఈ విధంగా బాణాలతో సంధించిన విలువిద్యా నేర్పరి ఎవరని ఆలోచించి, ద్రోణాచార్యుని వద్దకేగి “నాకంటె విలువిద్యలో మించిన వాడు లేనట్లుగా నన్ను తయారు చేస్తానన్నావు. కానీ నన్ను మించిన వ్యక్తే కాదు. త్రిలోకములలో సాటిలేని వ్యక్తి ఒకడు ఉన్నాడనెను. వారిరువురు ఏకలవ్యుని కడకేగగా అల్లంత దూరమునుండే ద్రోణాచార్యులవారిని చూచిన ఏకలవ్యుడు వినయముతో ద్రోణునికి నమస్కరించి సాదరముగా ఆహ్వానించెను. నేను మీ శిష్యుడనని చెప్పెను. అందుకు ద్రోణుడు అతనిని గురుదక్షిణగా ఏకలవ్యుని కుడిచేతి బ్రొటనవేలినిమ్మనగా వెంటనే అతడు కుడిచేతి బ్రొటనవ్రేలుని తెగనరికి ద్రోణాచార్యునకు సమర్పించి, గురుభక్తిని ప్రదర్శించెను. కుడిచేయి బ్రొటనవ్రేలు లేనందున అస్త్రవిద్యలో నారి సంధించుటకు వీలుపడదు. ఈ విధంగా

అర్జునునికి అస్త్రవిద్యలో ఎదురులేకుండా చేశాడు ద్రోణుడు.

ఇక్కడ మనం గమనించవలసిన అంశమేమనగా ఏకలవ్యుడు అస్త్రవిద్యలో అంత ప్రావీణ్యం గురువు ద్వారా కాకుండా స్వయంకృషి, నిరంతర ప్రయత్నం, పట్టుదల ద్వారా సాధించెను. చూసితిరా! పట్టుదల వ్యక్తులను ఎంత నైపుణ్యంగల వారిగా తీర్చిదిద్దుతుందో!

ఏకలవ్యుని పట్టుదలను విద్యార్థులు అలవరచుకుంటే జీవితంలో వారికి అపజయం ఎదురుకాదు.

అనేకమంది వ్యక్తులు జీవితంలో వారి కృషి, పట్టుదల వలనే అనేక ప్రజోపయోగ కార్యాలను సాధించగలిగారు. ఉదాహరణకు ప్రస్తుత మన రాష్ట్ర అసెంబ్లీ స్పీకరుగారైన కోడెల శివప్రసాదరావుగారు ఒక సామాన్య రైతు కుటుంబంలో, ఒక గ్రామంలో జన్మించినప్పటికీ నిరంతర పట్టుదల, శ్రమ వలన డాక్టరు కోర్సులో పి.జి. డిగ్రీ పొంది మంచి డాక్టరుగా రోగులకు కొంతకాలం సేవలందించారు. ఆ తరువాత రాజకీయ రంగప్రవేశం చేసి యం.యల్.ఏ.గా, మంత్రిగా, స్పీకర్‌గా విశిష్ట సేవలందించి, నరసరావుపేట నియోజకవర్గాన్ని అనితర సాధ్యంగా వసతులతో తీర్చిదిద్దారు. తాను అనుకున్న పనిని నిరంతరం ఆలోచించి, పట్టుదలగా శ్రమించి సాధించగల దిట్టగా రూపుదిద్దుకోవడానికి ప్రథమ కారణం ఆయన పట్టుదలే!

ఒక్క చదువే కాదు, పట్టుదల గల వ్యక్తులు ఏ రంగంలో అయినా రాణిస్తారు.

అనేకమంది ఉద్యోగాల్లో చేరి తరువాత పట్టుదలతో గ్రూపు పరీక్షలు వ్రాసి ఐ.ఏ.యస్, ఐ.పి.యస్., ఇంకా ఉన్నత పదవులనధిష్టించారు. దీనికి కారణం వారి నిరంతర శ్రమ, పట్టుదల. ఇటువంటి వారిని పట్టువదలని విక్రమార్కులంటారు. నాలుగైదుసార్లు గ్రూపు వన్ పరీక్షలకు హాజరై విజయం సాధించినవారు అనేకమంది ఉన్నారు. ఇది కేవలము వారి పట్టుదల ద్వారానే సాధ్యమైంది.

మన అందరికీ కుందేలు, తాబేలు కథ తెలుసు. ఈ రెండూ కూడా దేనిలోనూ సమానమైన జంతువులు కాదు. కుందేలు పరుగెత్తడంలో దిట్ట. తాబేలు చాలా నెమ్మదిగా కదులుతుంది. పరుగెత్తటం రాదు. ఒకసారి ఈ రెండింటికి పరుగు పందెం జరిగింది. కుందేలు ముందుగా కొంత దూరం పరుగెత్తి వెనుదిరిగి చూడగా తాబేలు కనుచూపుమేరలో కనబడలేదు. కుందేలు కళ్ళు మూసుకొని కొంతసేపు విశ్రాంతి తీసుకుంది. తాబేలు మాత్రం తాను పందెంలో ఉన్నానే విషయాన్ని మరువలేదు. నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళి పరుగు పందెంలో చివరకి నెగ్గింది. కుందేలు కళ్ళు తెరచి చూచి మధ్యలోనే ఉన్నట్లు గమనించి వెళ్ళగా తాబేలు పందెంలో నెగ్గినట్లుగా, తనకంటె ముందే లక్ష్యాన్ని చేరినట్లుగా గమనించింది.

చూచితిరా! గెలువవలసిన కుందేలు పట్టుదల లోపించినందువలన అపజయం పాలైంది. ఓడిపోవలసిన తాబేలు పట్టుదల వల్ల విజయం సాధించింది. గెలుపు ఓటములకు మూలకారణం పట్టుదల.

విద్యార్థులారా! మీరు మీ చదువులో, మీ జీవితంలో నిరంతర పట్టుదల ప్రదర్శించినచో అపజయము మీ చెంతకు రాదు.

మరొక చిన్న ఉదాహరణ. నాకు తెలిసిన ముగ్గురు వ్యక్తులు ఉపాధ్యాయ వృత్తిలో చేరారు. ఆ తరువాత రోజుకి 10 నుండి 15 గంటలు నిరంతర పట్టుదలతో శ్రమించి గ్రూపు పరీక్షలు వ్రాసి మునిసిపల్ కమీషనర్లయ్యారు. వారిలో ఒకరు గుంటూరు మునిసిపల్ రీజనల్ డైరెక్టర్‌గా పదవీ విరమణ చేశారు. ప్రస్తుత మన నరసరావుపేట మునిసిపల్ కమీషనర్‌గారైన శ్రీ అన్నాప్రగడ భానుప్రతాప్‌గారు ఆ ముగ్గురిలో ఒకరే. ఇది కేవలం పట్టుదల ఫలితమే అని విద్యార్థులు గమనించాలి.

దేశంలో, వివిధ దేశాల్లో అనేకమంది వ్యక్తులు మానవ సమాజంలో మహత్తర ఘనకార్యాలు సాధించారు. వారికి ఉన్న ఆయుధములు కృషి, పట్టుదలలే.

ఇటీవలి కాలంలో మరణించిన మాజీ భారత రాష్ట్రపతిగారైన ఎ.పి.జె. అబ్దుల్‌కలామ్‌గారు అతి బీద కుటుంబంలో, తమిళనాడులోని రామేశ్వరంలో జన్మించారు. న్యూస్‌పేపర్ బాయ్‌గా పనిచేస్తూ విద్యాభ్యాసాన్ని కొనసాగించారు. నిరంతర పట్టుదల, శ్రమతో జీవితంలో గొప్ప శాస్త్రవేత్తగా రూపొందారు. చివరకు భారతదేశం గర్వించదగ్గ గొప్ప వ్యక్తిగా తీర్చిదిద్దబడ్డారు. అందుకు కారణం ఆయన నిరాడంబరత, కృషి, నిరంతర పట్టుదల. పట్టుదల ఉత్తమోత్తమ గుణం మానవాళికి. పట్టుదల లేని ఏ కార్యము సఫలము కాదు.

పట్టుదల లేని జీవితం పస లేని జీవితంగా మారుతుంది. పట్టుదల కొరవడిన వ్యక్తులు వారికి వారు మేలు చేసుకోలేరు. వారికివారు ఉపయోగపడరు. సమాజానికి, కుటుంబానికి కూడా ఉపయోగపడలేరు.

చివరిగా పట్టుదలను మరొక ఉదాహరణతో ముగిద్దాం. మనం ఈ రోజు ఐదు కిలోమీటర్లు నడవాలి అనుకున్నాం. పట్టుదల ఉంటే కనీసం నాలుగు కిలోమీటర్లైనా నడుస్తాము. పట్టుదల లేకపోతే అసలు నడువలేము. ఆ ప్రయత్నమే చేయము. విద్యార్థులు ఈ రోజు ఒక పాఠాన్ని చదవాలను కుంటారు. వారికా పట్టుదల బలంగా ఉంటే ఎన్ని అవరోధాలొచ్చినా ఆ పాఠాన్ని పూర్తి చేస్తారు. పట్టుదల సన్నగిల్లితే ఆ పాఠం జోలికి పోరు.



# 7. కృషి

[Hardwork]

ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకొని దాన్ని సాధించటం కొరకు మనం నిరంతరం చేసే ప్రయత్నమే కృషి. 'కృషి'కి మరొక పేరు శ్రమ, పరిశ్రమ. కృషి ద్వారా మానవులు సాధించలేనిది లేదు. అందుకనే "కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు, మహా పురుషులౌతారు" అన్నారు. కృషికి పట్టుదల తోడైతే మనిషి ఉన్నత శిఖరాలకు చేరతాడు. ప్రపంచంలో గొప్ప విజయాలు సాధించిన వారందరూ కృషి లేకుండా ఆ విజయాలు సాధించలేదు. కృషి సోమరిపోతులకు, పిరికివారికి గూడా ఆయుధంలాంటిది. ఫలానా వ్యక్తి 'జీనియస్' అంటాము. ఒకాయనంటాడు జీనియస్ అంటే 90 శాతము శ్రమ, పది శాతము ప్రేరణ అంటారు. అందుకే "శ్రమ ఏవ జయతే" అంటారు. ప్రపంచంలో అందరూ ధనవంతులుండరు. వారు కొద్దిమందే. శ్రమ మీద బ్రతికేవారు అధికశాతం.

ఇక 'కృషి'ని గురించి విద్యార్థులకు పరిమితం చేసి మాట్లాడుకుందాం. "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు. కృషి ఉంటే సాధించలేనిది ఏమీ లేదు. మన రాష్ట్రంలో, మన దేశంలో, ప్రపంచంలో అనేకమంది బీదవారైనప్పటికీ కృషి ద్వారా ఉన్నత స్థితికి ఎదిగారు. కృషికి నిజాయితీతోడైతే సానబెట్టిన వజ్రంలా రాణిస్తారు. ధనవంతుడైన సోమరిపోతుకంటె బీదవాడైన కృషిచేసే వ్యక్తి రాణిస్తాడు. **స్వర్గీయ యన్టీ. రామారావు, నారాచంద్రబాబునాయుడు, టంగుటూరి అంజయ్య, అబ్రహాం లింకన్,** ఇంకా అనేకమంది వారి కృషి ద్వారా పైకొచ్చినవారే.

అసలు కృషి అంటే ఏమిటి? కృషి వలన కలిగే ఫలితాలేమిటి? కృషి ఎందుకు చేయాలి? కృషి కొరవడితే ఏమవుతుంది? కృషి విద్యార్థులు మాత్రమే చేయాలా? ఎంతకాలం కృషి చేయాలి? – ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను పరిశీలిద్దాం.

చదువుకునే విద్యార్థులనుండి అనేకమంది వ్యక్తుల వరకు ఎవరు, ఏ రంగాన్ని ఎంచుకొని జీవనం సాగిస్తే, ఆ రంగంలో నిరంతర కృషి కొనసాగిస్తే

వారు తరువాత ఏ రంగంలో స్థిరపడ్డా అదే అలవాటు కొనసాగుతుంది. కృషి ఒక బలమైన, శక్తివంతమైన అలవాటుగా వ్యక్తిని తీర్చిదిద్దుతుంది. ఒక విద్యార్థి రోజు తెల్లవారుఝామున నాలుగు గంటలకు లేచి చదివే అలవాటు చేసుకుంటే కొన్ని రోజుల తరువాత ఆ విద్యార్థికి నాలుగు గంటలకు తప్పనిసరిగా మెలకువ వస్తుంది. అలా ఎందుకు జరుగుతుందంటే, ఇది కేవలము ఆ విద్యార్థి చేసుకున్న అలవాటు ద్వారా జరుగుతుంది. ఇది మనందరికి అనుభవమే. కష్టపడి చదవటం కూడా అంతే. కష్టపడి చదివే విద్యార్థి సోమరిగా ఉండలేడు. కష్టపడే విద్యార్థి సోమరితనమునూ ఒక శిక్షగా భావిస్తాడు. **"ధనముగాని, కీర్తి ప్రతిష్ఠలు గాని కష్టపడకుండా, ఊరక వాటంతటవే ఏ వ్యక్తిని వరించవు".**

మానవుడు 1970 జులై 21న మొదటగా చంద్రమండలం మీద పాదం మోపాడు. ఏకంగా చంద్రమండలానికి మనం రైలు, బస్సు, లేక విమానంలో పోయినంత తేలిక గాదు. ఎందరో శాస్త్రవేత్తలు కృషిద్వారా ఆ ప్రయోగం విజయవంతమైంది. ఒక విద్యార్థి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత కావాలనుకుంటే, మనసులో కోరిక ఉన్నంత మాత్రాన ఆ కోరిక నెరవేరదు. ఆ కోరికకు కఠోరశ్రమ, కృషి తోడైననాడే ఆ కోరిక నెరవేరగలదు. విద్యలో విద్యార్థులు రాణించాలనుకుంటే క్రమం తప్పకుండా పాఠశాలకు, కళాశాలకు హాజరు కావాలి. పాఠాలు శ్రద్ధగా వినాలి. ఒక్కసారి శ్రద్ధతో విన్న పాఠం, ఐదారుసార్లు చదివినదానితో సమానం. విద్యార్థుల పరీక్షల సమయంలో మాత్రమే గాకుండా సంవత్సరమంతా రోజుకి 3 నుండి 5 గంటలు క్రమం తప్పకుండా చదవాలి. చదువుతోపాటు జనరల్‌నాలెడ్జికి సంబంధించిన విషయాలు నేర్చుకోవాలి. వార్తాపత్రికలు కనీసం హెడ్‌లైన్స్ చూడాలి. జిల్లాలో, రాష్ట్రంలో, దేశంలో ఏమి జరుగుతుందో తెలుసుకోవాలి. కృషిలేని విద్య రాణించదు. ప్రస్తుత విద్యార్థుల్లో తెలివితేటలు బాగానే ఉన్నాయి. కొంచెం కృషి లోపించిందనే చెప్పాలి. తెలివికి తోడు కృషిని జోడిస్తే వారు తప్పక రాణిస్తారు. కృషి లేని తెలివి రాణించదు.

మనం ఏ పని చేసినా ఆ పనిని క్రమం తప్పకుండా చేస్తే ఫలితము

బాగా ఉంటుంది. ఒక ఆట ఆడినా, పాట పాడినా క్రమం తప్పకుండా ప్రాక్టీసు చేయాలి. ప్రస్తుతమున్న పెద్ద పారిశ్రామికవేత్తల్లో కొందరు కృషిని నమ్ముకొని పైకి వచ్చినవారే. అదృష్టం స్థిరంగాదు. కృషి మాత్రమే స్థిరమైంది. కనుక అదృష్టాన్ని నమ్మటం కంటె కృషిని నమ్మటం వలన విద్యార్థినుండి పారిశ్రామిక వేత్త వరకు ఎవరికైనా ప్రయోజనం చేకూరగలదు. కృషి చేసే వ్యక్తులు అధికశాతం ఉన్న జిల్లాగాని, రాష్ట్రంగాని, దేశంగాని చాలా గొప్పదవుతుంది. జపాన్ దేశం రెండవ ప్రపంచయుద్ధ కాలంలో బాగా దెబ్బతిన్నది. కాని అక్కడ ప్రజలు రోజుకి 18 గంటలు పనిచేసి ఆ దేశాన్ని ప్రపంచ దేశాలలో ముందంజలో నిలిపారు. ఇది కేవలం ప్రజల కృషి, శ్రమ ద్వారానే సాధ్యమైంది.

కృషి, కర్తవ్యం చాలా గొప్పవి. ప్రతి వ్యక్తి తన కర్తవ్యాన్ని గుర్తెరిగి తగిన కృషి చేయాలి. విద్యార్థుల కర్తవ్యం చదువుకోవడం. భవిష్యత్తులో మంచి ఉద్యోగం సంపాదించాలి, మంచి జీవనం సాగించాలి అన్న దృక్పథముతో విద్యార్థి దశనుండే కష్టించి పనిచేసే అలవాటు చేసుకోవాలి. కష్టపడి చదివిన వాళ్ళందరికీ ఉద్యోగాలు వస్తాయని చెప్పలేని స్థితి. కాని కష్టపడేవారు ఏ రంగాన్ని ఎంచుకొన్నా ఆ రంగంలో తప్పక రాణిస్తారు. వ్యక్తి మనుగడకు, మంచి సామాజిక జీవనానికి చదువుకొనుట, కృషిచేయుట చాలా అవసరము.

మేము బీదవారిమని, బీద విద్యార్థులమని ఎవరూ చింతించవలసిన అవసరం లేదు, వాపోవలసిన పనీ లేదు. ప్రస్తుతం బీదవారిని ప్రభుత్వాలు అనేక విధాలుగా ఆదుకుంటున్నాయి. వారి బిడ్డలకు విద్యాసౌకర్యములు కల్పిస్తున్నాయి. బీదతనంలో కూడా ఆనందమున్నది. కొంతమంది బీదవారిని ఆదర్శంగా తీసుకొని బీద విద్యార్థులు వారి చదువులను కొనసాగించి ఉన్నత శిఖరాలకు చేరాలి. బీదతనము చదువుకు ఆటంకము కానే కాదు. కావలసిందల్లా కృషి, పట్టుదల మాత్రమే. ఉదాహరణకు **లాల్‌బహదూర్ శాస్త్రి, డా॥ బి.ఆర్. అంబేద్కర్, ఎ.పి.జె. అబ్దుల్‌కలామ్, అబ్రహాం లింకన్, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్** – వీరందరూ బీదవారే. కష్టాలు భరించి, కష్టాలకోర్చి, కష్టపడి చదువుకొని జీవితంలో స్థిరపడటమే కాకుండా, జాతికి, సమాజానికి

మేలు చేశారు. కృషికి లోకంలో ఎదురులేదని, కృషి బీదవారికైనా ఎదురులేని ఆయుధమని నిరూపించారు.

నల్లజాతీయుడైన "నెల్సన్ మండేలా" ఈ విధంగా అన్నారు. "విద్య శక్తివంతమైన ఆయుధం. దానిని ప్రపంచాన్ని మార్చటానికి ఉపయోగించాలి". అనేక కష్టాలను తన చిన్నతనంలో అనుభవించాడు. ఆయన తండ్రికి నలుగురు భార్యలు, నలుగురు కుమారులు, తొమ్మిదిమంది ఆడపిల్లలు. మండేలాకు తొమ్మిది సంవత్సరాల వయస్సులో తండ్రి క్యాన్సర్ జబ్బుతో మరణించినా, కష్టాలకోర్చి, కృషి చేసి విద్యాభ్యాసాన్ని కొనసాగించాడు.

మనరాష్ట్రంలో స్వర్గీయ నందమూరి తారకరామారావుగారు, అక్కినేని నాగేశ్వరరావుగారు బీదవాళ్ళే. రామారావుగారు పాల క్యానులను సైకిల్‌కి కట్టుకొని సైకిల్ తొక్కుతూ నిమ్మకూరు నుండి విజయవాడ వచ్చి పాలు పోసి, తిరిగి వెళ్ళి చదువుకొని, ఆ తరువాత డిగ్రీ పాసై, సబ్ రిజిస్ట్రార్‌గా ఉద్యోగాన్ని పొందారు. ఆ తరువాత సినీరంగంలో తన స్వయంకృషి ద్వారా అంచలంచెలుగా ఎదిగారు. నాగేశ్వరరావుగారు పెద్దగా చదువుకోలేదు. ఆయన చదివింది కేవలం ఐదవ తరగతి మాత్రమే. తాను చెప్పులు లేకుండా మద్రాసులో తిరిగానని చెప్పారు. అయినప్పటికీ ఆయన ఎంచుకున్న నటనారంగంలో తన కృషి ద్వారా అందనంత ఎత్తుకు ఎదిగి, తెలుగు ప్రేక్షకుల గుండెల్లో పదిలంగా ఉన్నాడు. ఇవన్నీ "కృషి"కి గొప్ప ఉదాహరణలు. ఒక్క విద్యారంగంలోనే కాదు మనం ఏ రంగాన్ని ఎంచుకున్నా కృషి చేస్తే ఆ రంగంలో రాణించగలమనేది కొంతమంది జీవితాలను పరిశీలించి తెలుసుకున్న సత్యం.

కనుక విద్యార్థులారా! "కృషి" అనేది మీ చేతుల్లో ఉన్న బలమైన ఆయుధం. దాన్ని సరిగా విద్యార్థి దశనుండి ఉపయోగించి మీరు, మీ భావి జీవితంలోపైకి రావాలని ఆశిస్తున్నాను. మీ టీచర్లు పాఠశాలనుండి, కళాశాల విద్య వరకు మీకు మార్గదర్శకులేగాని మీరు చదువవలసింది వారు చదువరు. మీరు వ్రాయవలసిన పరీక్షలు వారు వ్రాయరు. మీ భవిష్యత్తు వారి చేతుల్లో లేదు. మీ చేతుల్లోనే ఉంది. దానికి మీరే కర్తలు.

# 8. క్రమశిక్షణ - క్రమశిక్షణారాహిత్యం

[Discipline - Indescipline]



క్రమశిక్షణ, క్రమశిక్షణారాహిత్యం – ఈ రెండు పదాలు ఒకదానికొకటి వ్యతిరేకపదాలు. వీటిని ఒక మాటలోగాని, ఒక పంక్తిలోగాని నిర్వచించటం సాధ్యం కాదు. ఈ క్రింది ఉదాహరణలను పరిశీలిస్తే వాటిని గురించి మనకు అర్థమవుతుంది.

**ఉదాహరణ – 1**

ఒక పాఠశాలగాని లేక ఒక కళాశాలగాని, లేక ఒక ఆఫీసుగాని ఉదయం 10 గంటలనుండి సాయంకాలం 5 గంటల వరకు పనివేళలైతే, కొందరు విద్యార్థులుగాని, అధ్యాపకులుగాని 10 గంటలలోపు పాఠశాలకు, కళాశాలకు హాజరైతే వారిని క్రమశిక్షణగల విద్యార్థులుగా, అధ్యాపకులుగా పరిగణించాలి. వారుగనుక 10 గంటల తరువాత పాఠశాలకు గాని, లేక కళాశాలకు గాని హాజరైతే వారిని క్రమశిక్షణారాహిత్యంగలవారిగా పేర్కొనాలి. కొన్ని ప్రత్యేక సందర్భాలలో, అనివార్య కారణాలుంటే వారిని అనుమతించవచ్చు. అట్లే ఒక ఆఫీసు 10 గంటలకు ప్రారంభం కావలసి వుంటే 10 గంటలకు ఆ ఆఫీసులో ఖాళీ కుర్చీలు దర్శనమిస్తే ఆ ఆఫీసులో క్రమశిక్షణ లేదని చెప్పాలి. ప్రత్యేక పరిస్థితులను పరిగణనలోకి తీసుకోవడం సాధారణాంశముగా పరిగణించాలి.

**శ్రీ యం. వెంకయ్యనాయుడుగారు** కేంద్ర పట్టణాభివృద్ధి శాఖామాత్యులుగా ఉన్నపుడు ఢిల్లీలో తన ఆఫీసుని ఆయన 10 గంటలకు ఒక పర్యాయం తనిఖీ చేయగా ఖాళీ కుర్చీలు దర్శనమిచ్చినట్లు టి.వి. ఛానళ్ళలో దేశప్రజలు చూశారు. మరొక రకంగా చెప్పాలంటే ఆ ఆఫీసు క్రమశిక్షణారాహిత్యానికి నిలయమన్న మాట. ఆ తరువాత ఆయన వారిని హెచ్చరించగా ఆ ఆఫీసు క్రమశిక్షణా రాహిత్యానికి వారు స్వస్తి పలికేటట్లు చేశారు.

## ఉదాహరణ – 2

పాఠశాల విద్యార్థులుగాని, కళాశాల విద్యార్థులుగాని ఆయా సంస్థల పనివేళలలో ఆయా సంస్థలలో తప్పక ఉండాలి. వారు హాజరు వేయించుకొని, సంతకం పెట్టి బయటకు వెళ్ళిపోతే అది క్రమశిక్షణారాహిత్యం. పనివేళల్లో ఆయా సంస్థలను వీడకుండా ఉంటే అది క్రమశిక్షణ. ఈ క్రమశిక్షణారాహిత్యాన్ని అరికట్టడానికి బయోమెట్రిక్ హాజరును ప్రభుత్వాలు ప్రవేశపెట్టాయి. దానికి గూడా తూట్లు పొడుస్తున్నారనే వార్తలు వస్తున్నాయి.

## ఉదాహరణ – 3

విద్యాసంస్థల తరగతి గదులలో అధ్యాపకుడు పాఠం చెప్పేటప్పుడు నిశ్శబ్ద వాతావరణముండి విద్యార్థులు ఆ పాఠాన్ని ఆసక్తిగా, శ్రద్ధగా వినాలి. కానీ కొంతమంది టీచర్లు క్లాసుకు వెళితే అందుకు భిన్నమైన వాతావరణాన్ని ఇతరులు గమనిస్తారు. ఈ విధమైన వాతావరణము ఆ చెప్పే టీచర్ల సామర్థ్యాన్ని బట్టి ఉంటుంది. ఇటువంటి సందర్భాలను క్రమశిక్షణారాహిత్యమైన సందర్భంగా చెప్పక తప్పదు. కొంతమంది అధ్యాపకులు తరగతి గదులలో బోధించేటపుడు నిశ్శబ్ద వాతావరణముంటుంది. విద్యార్థులు గూడా ఆసక్తిగా, శ్రద్ధగా వారి పాఠాలు వింటారు. ఈ సందర్భాన్ని గమనిస్తే విద్యార్థులు మంచి క్రమశిక్షణతో ఉన్నారని చెప్పాలి. ఇదంతా అధ్యాపకుల సామర్థ్యాన్ని బట్టి, ఆ తరగతి విద్యార్థులు ప్రవర్తిస్తూ ఉంటారు.

## ఉదాహరణ – 4

కొంతమంది విద్యార్థులు టీచర్లు ఇచ్చిన హోమ్‌వర్క్‌ని చేయరు. ఏదో సాకులు చెబుతుంటారు. పాఠశాలకు క్రమంగా హాజరుకారు. వచ్చినా మరొకరితో క్లాసురూమ్‌లోనే గుసగుసలాడుతుంటారు– ఇవన్నీ ఆ విద్యార్థుల క్రమశిక్షణారాహిత్య చర్యలే. వాటిని అరికట్టాల్సిన బాధ్యత అధ్యాపకులదే. క్రమశిక్షణ ముందు, టీచింగ్ (బోధన) తరువాత అనే విషయాన్ని ముఖ్యంగా టీచర్లు గమనించాలి.

విద్యాసంస్థల ప్రధానోపాధ్యాయులను, ప్రాచార్యులను వారి పై అధికారులు, అనేక రకాల సమాచారాన్ని గతంలో మరలా మరలా అడిగిన

సందర్భాలున్నాయి. సమాచారాన్ని వెంటనే పంపమని ఆదేశాలిచ్చినా, కొంతమంది వాటిని నిర్లక్ష్యం చేస్తారు. అధికారులు మెమోలు జారీ చేస్తారు. తగిన సమయంలో సమాచారం పంపకపోవటం గూడా క్రమశిక్షణారాహిత్యమే.

క్రమశిక్షణకు, క్రమశిక్షణారాహిత్యానికి నిర్వచనాలు సూటిగా లేనప్పటికీ కొన్ని ఉదాహరణల ద్వారా వాటిని పరిశీలించాము. అసలు క్రమశిక్షణ ఎవరికుండాలి? విద్యార్థులకేనా? అధ్యాపకులకేనా? క్రమశిక్షణ వల్ల లాభాలేంటి? క్రమశిక్షణారాహిత్యవల్ల కలిగే నష్టాలేంటి? – ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను పరిశీలిద్దాం.

క్రమశిక్షణ ఒక రాజకీయపార్టీకే కాదు, ఒక రాష్ట్రానికే కాదు, దేశం మొత్తానికి ఉండాలి. మిలటరీలో పనిచేసేవారిని క్రమశిక్షణకు మారుపేరుగా పిలుస్తాం. సమాజంలో చిన్నపిల్లల దగ్గరనుండి, పెద్దల వరకు అందరకూ క్రమశిక్షణ చాలా అవసరం. క్రమశిక్షణ లోపించినచో వ్యక్తిలోగాని, సంఘంలోగాని, రాష్ట్రంలోగాని, దేశంలోగాని, ఉద్యోగస్తులలోగాని అరాచకము పెరుగుతుంది. అశాంతి పెరుగుతుంది. శాంతియుతమైన జీవన విధానానికే భంగం కలుగుతుంది. ఉదాహరణకు నేను స్వతంత్రదేశంలో ఉన్నాను, నా ఇష్టం వచ్చినట్లు పబ్లిక్ జీవితంలో ప్రవర్తిస్తానంటే కుదరదు. నేను రోడ్డు మీద అడ్డదిడ్డంగా నడుస్తానన్నా, వెహికల్ నడుపుతానన్నా, ఆ విధంగా జరిగితే ఇతరులు ఇబ్బందులపాలు కావలసి ఉంటుంది. కనుక పబ్లిక్ జీవితంలో ప్రతి వ్యక్తికీ క్రమశిక్షణ అత్యంత అవసరము.

విద్యార్థులు వారు విద్యనభ్యసించే కాలంలో ఒక క్రమపద్ధతిలో మెలగాలి, జీవించాలి. క్రమపద్ధతిలో విద్యాభ్యాసాన్ని కొనసాగించాలి. ఒక విద్యాసంస్థలో చేరి నా యిష్టం వచ్చిన రోజు పాఠశాలకు లేక కళాశాలకు వెళ్తానంటే కుదరదు. నష్టం జరిగేది ఆ విద్యార్థి లేక విద్యార్థులకే. ప్రతివారితో మర్యాదగా నడుచుకోవటం, మర్యాదతో కూడిన ప్రవర్తనను అభివృద్ధి పరచుకోవటం – ఇవన్నీ క్రమశిక్షణలో భాగమే.

చెడు అలవాట్లకు బానిస అయితే జీవితం నాశనమవుతుంది. మంచి అలవాట్లను అభివృద్ధి చేసుకోవటం గూడా క్రమశిక్షణలో భాగమే. ఒకసారి చేసుకున్న మంచి అలవాట్లుగాని, చెడు అలవాట్లుగాని సాధారణంగా

జీవితాంతం వ్యక్తిని వెంటాడతాయి. వాటిని వదలివేయటం అంత సులభం కాదు.

యన్.సి.సి.,యన్.యస్.యస్., క్రీడల ద్వారా విద్యార్థులు ఎక్కువ క్రమశిక్షణ కలిగి ఉంటారు. ప్రతి విద్యార్థిని, ప్రతి విద్యాసంస్థను క్రమశిక్షణకు మారుపేరుగా తీర్చిదిద్దాలి. దీనికి తల్లిదండ్రులు, యాజమాన్యాలు, ప్రభుత్వాలు, అధ్యాపకులు, ప్రధానోపాధ్యాయులు పట్టుదలతో పనిచేయాలి, క్రమశిక్షణను అలవర్చాలి, సాధించాలి. ఇందుకొక ఉదాహరణను పరిశీలిద్దాం. బాగా వర్షం కురిస్తే మన ఇంట్లో ఉన్న బావిలో నీటిమట్టం పెరుగుతుంది. ఉప్పునీటి బావిలోకి ఉప్పునీటి మట్టం, మంచినీటి బావిలోకి మంచినీటి మట్టం పెరగటం మనం గమనిస్తాం. కురిసే వర్షపు నీటిలో నీరంతా ఒకటే. అయినప్పటికీ ఆయా బావుల నేల స్వభావాన్ని బట్టి ఆ నీరే ఉప్పగా, తీయగా మారుతుందని మనం గ్రహిస్తాం. అదేవిధంగా ఒక విద్యాసంస్థలో అంతకుముందు ఉన్న వాతావరణాన్ని బట్టి, ప్రస్తుత వాతావరణాన్ని బట్టి విద్యార్థుల అధ్యాపకుల ప్రవర్తన ఉంటుంది. ఒక విద్యాసంస్థలో ప్రధానోపాధ్యాయుడు, అధ్యాపకులు, యాజమాన్యాలు, ప్రభుత్వ వర్గాలు విద్య, విద్యావసతులతోపాటు క్రమశిక్షణకు అత్యంత ప్రాధాన్యతనిస్తే విద్యార్థులలో తప్పక క్రమశిక్షణ అలవడుతుంది, క్రమశిక్షణతో మెలగుతారు.

ప్రస్తుతం కొన్ని విద్యాసంస్థలలో ఈ క్రమశిక్షణ లోపించినందువల్ల, క్రమశిక్షణారాహిత్యం వల్ల ర్యాగింగ్‌లు, విద్యార్థుల మధ్య కొట్లాటలు, పోట్లాటలు, తగాదాలు, వివాదాలు తలెత్తుతున్నాయి. వీటిని అరికట్టాలంటే చట్టాలకంటే ముఖ్యమైనది క్రమశిక్షణ. క్రమశిక్షణగల విద్యార్థులున్నచోట పైన చెప్పిన సంఘటనలకు తావుండదు. విద్యార్థుల మనసులను ప్రభావితం చేసే క్రమశిక్షణగల నాయకుల, దేశాల ఉదాహరణలను అప్పుడప్పుడూ వారికి చెప్పాలి. ప్రస్తుత విద్యా వ్యవస్థలో మార్కులు, ర్యాంకులకు అధిక ప్రాధాన్యమిస్తున్నారు గనుక అధ్యాపకులకు సిలబస్ పూర్తి చేయడం, పరీక్ష నిర్వహించడం, ఆ పేపర్లు దిద్ది మార్కులు రిజిష్టర్‌లలో వేయడం – ఇత్యాది కార్యక్రమాల్లో తలమునకలైనందువల్ల తరగతి గదుల్లో వేరే విషయాలు చెప్పే అవకాశాలు చాలా తక్కువగానే ఉన్నాయి.




"పచ్చదనం – పట్టణాభివృద్ధి" (ఈనాడు చర్చావేదిక)
పాలడుగు నాగయ్య చౌదరి & కొత్త రఘురామయ్య కళాశాల
ఆడిటోరియంలో ప్రసంగిస్తున్న రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మాత్యులు
మాన్యశ్రీ **డా॥ కోడెల శివప్రసాదరావుగారు**



"పచ్చదనం – పట్టణాభివృద్ధి" (ఈనాడు చర్చావేదిక)
కొత్త రఘురామయ్య జూనియర్ కళాశాల ప్రాంగణంలో
మొక్కలు నాటుతున్న రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మాత్యులు
మాన్యశ్రీ **డా॥ కోడెల శివప్రసాదరావుగారు**

# 9. పచ్చదనం - పరిశుభ్రత

[Greenery - Cleanliness]

మానవుడు ప్రకృతిలో భాగము. తన జీవనాధారానికి మూలము ప్రకృతి. తన ఆహారం కోసం ప్రకృతి మీద ఆధారపడతాడు. మరొక రకంగా చెప్పాలంటే వృక్షాల మీద, జంతువుల మీద ఆధారపడక తప్పదు. జనాభా సంఖ్య పెరిగినందువల్లగాని, పెరుగుతున్నందువల్లగాని, మానవుల్లో స్వార్థం పెరిగి జీవనాధారమైన ప్రకృతిని నాశనం చేయటం వల్ల వాతావరణ సమస్యలు తలెత్తి, ప్రకృతి శాపానికి, కోపానికి గురి కావలసివస్తుంది.

ఒక దేశ భూభాగంలో అడవులు 33 శాతం ఉండాలి. కాని మన దేశంలోగాని, రాష్ట్రాలలోగాని 9 శాతం మాత్రమే ఉందని సర్వేలు తెలియజేస్తున్నాయి. అడవుల నరికివేత, వాయుకాలుష్యం, జలకాలుష్యం, విచ్చలవిడిగా మైనింగ్ కార్యకలాపాలు, అపార్ట్‌మెంట్స్ సంస్కృతి పెరిగి బోర్లనుండి అధిక నీటి వాడకం, ప్లాస్టిక్ వాడకం పెరగడం – ఇవన్నీ వాతావరణానికి హాని కలిగించే చర్యలే. ఓజోన్ పొర దెబ్బతిని సూర్యుని వేడి ఎక్కువగా ఉంటుంది. అది ప్రస్తుతం మనం అందరం అనుభవిస్తున్నాం.

"పచ్చదనం – పరిశుభ్రత" అనే అంశం దాదాపు రెండున్నర దశాబ్దాల నుండి ప్రచారంలోకి వచ్చింది. ఆయా ప్రభుత్వాలు దేశవ్యాప్తంగా ఈ నినాదాన్ని ప్రచారంలోకి తెచ్చి, వాటి అమలుకు చర్యలు చేపడుతున్నారు.

దానిలో భాగంగా ఆంధ్ర రాష్ట్రంలో కూడా పచ్చదనం – పరిశుభ్రత కోసం ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు, విద్యాసంస్థలు, సామాజిక కార్యకర్తలు, వివిధ సంఘాలు ఈ కార్యక్రమంలో పాలుపంచుకొంటున్నాయి.

ఈ కార్యక్రమంలో భాగంగా పచ్చదనాన్ని పెంచటానికి మొక్కలు నాటే కార్యక్రమాన్ని చేపట్టటం, పార్కులు అభివృద్ధి చేసే కార్యక్రమాన్ని చేపట్టటం, ఖాళీ ప్రదేశాల్లో, బంజరు భూముల్లో, రోడ్ల ప్రక్కన మొక్కలు నాటటం చేస్తున్నారు. ప్రజల్లో ఈ కార్యక్రమాన్ని గూర్చి ఇంకా అవగాహన పెంచే కార్యక్రమాలు

జరగాలి. ప్రభుత్వాలతోపాటు విద్యాసంస్థలు, వివిధ ప్రజాసంఘాలు, అనేకమంది భాగస్వాములు కావాలి. ప్రభుత్వంవారు మాత్రమే ఈ కార్యక్రమాన్ని చేపడితే అది పూర్తిగా విజయవంతం కాదు. ప్రజా భాగస్వామ్యం ముఖ్యం.

విద్యాసంస్థల వారు ఇప్పటికే వారి సంస్థల ఆవరణలో మొక్కలు నాటే కార్యక్రమాన్ని రాష్ట్రవ్యాప్తంగా ప్రారంభించారు. ప్రభుత్వంవారు అడవుల విస్తీర్ణాన్ని 9 శాతం నుండి కనీసం 20 శాతానికి పెంచే ప్రణాళికలు తయారు చేసి వారి యంత్రాంగం ద్వారా ఐదు సంవత్సరాల కాలపరిమితిలో అభివృద్ధి సాధించాలి.

గ్రామాల్లో, పట్టణాల్లో, నగరాల్లో మొక్కలు విరివిగా నాటాలి. కానీ మన పట్టణాల్లో, గ్రామల్లో రోడ్లు చాలా ఇరుకుగా ఉంటాయి. మొక్కలు నాటుటకు అనువుగా లేవు, ఉన్నా కరెంటు తీగలకు అడ్డంగా పెరుగుతున్నాయని సంవత్సరానికి రెండు మూడు సార్లు చెట్ల కొమ్మలను అధికభాగం నరికి వేస్తున్నారు. దీని నివారణకు ప్రభుత్వాలు అండర్‌గ్రౌండ్ ఎలక్ట్రిసిటి ఏర్పాట్లు చేయాలి. కాని వారికది ఖర్చుతో కూడుకున్న పని. నగరాల్లో, పట్టణాల్లో ప్రతి ఇంటి ముందు ఒక మొక్కను నాటి వాటి సంరక్షణ బాధ్యతను ఆ ఇంటివారే చేపడితే ఈ కార్యక్రమం విజయవంతం కాగలదు.

మొక్కలు నాటటం ఎంత ముఖ్యమో వాటి సంరక్షణ, పెంపకం కూడా అంతే ముఖ్యం. ఆ బాధ్యత ఎవరు తీసుకోవాలి? అనేది పెద్ద సమస్య. ట్రీ గార్డ్స్ అమర్చాలి. నీరుపోయాలి. ఇదంతా ఖర్చుతో కూడుకున్న పని. ట్రీగార్డ్స్ స్వచ్ఛంద సంస్థలు, ఉద్యోగస్తులు, దాతలు పెద్దమనస్సుతో విరాళాలివ్వాలి. వాటిని దుర్వినియోగం చేయకుండా ఉపయోగించాలి. మొక్కలు పెంచటానికి ఒక ఏరియాను ఒక విద్యాసంస్థకు బాధ్యతను అప్పగించి, అక్కడ కొందరు టీచర్స్‌ను, విద్యార్థులను, వాలంటీర్స్‌ను భాగస్వాములు చేసి, 20 మొక్కలు పెంచిన విద్యార్థులకు కొన్ని మార్కులు కలిపే విధానం, ఆయా టీచర్లకు 50 మొక్కలు పెంచటంలో భాగస్వామ్యమైతే ఒక ఇంక్రిమెంటు తదితర ప్రోత్సాహకాలు కొంతకాలం ఇస్తే పచ్చదనం కార్యక్రమం విజయవంతం

కాగలదు. ఇందుకు నిరుద్యోగులను కూడా ఉపయోగించి వారికి కొంత పారితోషికాన్ని ఇవ్వాలి. విద్యార్థుల్లో సేవాభావాన్ని పెంపొందించి వారిని కూడా ఈ కార్యక్రమంలో భాగస్వాములుగా చేయాలి.

పచ్చదనం ద్వారా మానసికోల్లాసం, ఉత్సాహం పెరుగుతాయి. ఆహ్లాదకరమైన వాతావారణం తయారవుతుంది. ఆహ్లాదకర వాతావరణంలో మనం ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటాము.

## చెట్లు - ప్రయోజనాలు

చెట్ల వలన కలిగే ప్రయోజనాలను పరిశీలిద్దాం. చెట్ల వలన మానవులకు బహుళ ప్రయోజనాలు కలుగుతాయి.

1. వాతావరణంలో కార్బన్‌డైయాక్సైడ్ శాతం అధికమై అనేక మార్పులు సంభవిస్తున్నాయి. అధిక వేడిగా వాతావరణముంటుంది. చెట్లు వాతావరణంలోని కార్బన్‌డైయాక్సైడ్‌ను గ్రహించి (తీసుకొని) ఆక్సిజన్‌ను వదులుతాయి. ఒక పెద్ద చెట్టు ఒక సంవత్సర కాలంలో ఒక కారు 26 వేల మైళ్ళు తిరిగితే ఎంత కార్బన్‌డైయాక్సైడ్ వదులుతుందో అంత ఆక్సిజన్‌ను వాతావరణంలోకి (గాలిలోకి) వదులుతుంది.
2. **వాతావరణంలోని గాలిని చెట్లు శుద్ధి చేస్తాయి.**
   వాతావరణంలలో ఉన్న గాలిని కలుషితం చేసే నైట్రోజన్ ఆక్సైడ్‌ని, అమ్మోనియా, సల్ఫర్‌డైయాక్సైడ్ మొదలగు వాయువులను గ్రహించి గాలిని చెట్లు వాటి ఆకులతో, బెరడుతో శుభ్రం చేసి పరిశుభ్రమైన గాలిగా లేక కాలుష్యరహితమైన గాలిగా మార్పు చేస్తాయి.
3. **ఆక్సిజన్‌ను (ప్రాణవాయువుని) అందిస్తాయి.**
   18మందికి ఒక సంవత్సరంలో కావలసిన ఆక్సిజన్‌ను ఒక ఎకరం ఏరియాలో ఉన్న చెట్లు సప్లయి చేస్తాయి.
4. నగరాలకు, పట్టణాలకు, గ్రామాలకు చల్లటి వాతావరణాన్ని అందిస్తాయి. అమెరికాలో ఉన్న లాస్‌ఏంజిలిస్ నగరంలో గత 50 సంవత్సరాల కాలంలో రోడ్లు, భవనాలు ఎక్కువగా నిర్మించినందు వలన ఉష్ణోగ్రత 6

డిగ్రీల ఫారన్‌హీటు పెరిగింది. ఆ నగరంలో మొక్కలు అధికంగా నాటి చెట్లు పెంచటం వలన ఆ నగర ఉష్ణోగ్రత 10 డిగ్రీల ఫారన్‌హీటు తగ్గినట్లు అమెరికా సర్వేలు చెబుతున్నాయి.

5. చెట్లు ఎక్కువగా ఉన్న ఇండ్ల దగ్గర వేసవిలో ఏ.సిలు ఎక్కువగా వాడనవసరం లేదుట.

6. **చెట్లు నీటిని రక్షిస్తాయి.**
ఒక ఖాళీ ప్రదేశంలో ఒక లాన్ వేసి దాని చుట్టూ చెట్లు పెంచితే ఆ లాన్ నీరు ఆవిరిగాకుండా చేస్తాయంట చెట్లు. కొత్తగా వేసిన లాన్‌కు చెట్లున్న చోట 3 గ్యాలన్ల నీరు వారానికి సరిపోతుందట. చెట్లు లేకపోతే వారానికి 15 గ్యాలన్ల నీరు కావాలంట.

7. **నీటి కాలుష్యాన్ని నివారించుటకు వృక్షాలు తోడ్పడతాయి.**
వర్షాలు కురిసినప్పుడు చెట్లు మొదలు ద్వారా, బెరడుద్వారా వర్షపు నీరు శుద్ధి చేయబడి భూమిలో ఇంకిపోతాయి. అపుడు భూమినుండి కాలుష్య రహితమైన నీరు లభిస్తుంది.

8. కొండలు, నదుల ప్రాంతంలో వర్షాలు కురిసినపుడు మట్టి కొట్టుకొని పోకుండా చెట్లు అడ్డంపడి కాపాడతాయి. ఆ విధంగా కొండల దగ్గర, నదుల దగ్గర మట్టి కాపాడబడుతుంది.

9. **అల్ట్రావైలట్ సూర్యకిరణాలనుండి చెట్లు పాఠశాల విద్యార్థులను కాపాడతాయి.**
అమెరికాలో క్యాన్సర్ వ్యాధి అతి సామాన్యమైన వ్యాధి. పాఠశాలల్లో చదివే పిల్లలు చదువుతో, ఆటలతో పగలు ఎక్కువ సమయాన్ని అక్కడ గడుపుతారు. పాఠశాల ఆవరణలో ఆటస్థలాల చుట్టూ చెట్లు ఉన్నందున 50 శాతం చర్మక్యాన్సర్ బారినుండి విద్యార్థులను చెట్లు రక్షిస్తాయి.

10. **చెట్లు ఆహారాన్నిస్తాయి.**
ఒక ఆపిల్ చెట్టు సంవత్సరానికి 1000 ఫలాలనిస్తుంది. మనుషులకే గాకుండ అడవి జంతువులకు, పక్షులకు గూడా ఆహారాన్నిస్తాయి.

11. **చెట్లు ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తాయి.**
రోగి పడుకున్న కిటికీ ప్రక్కన చెట్లు ఉంటే, ఆ కిటికి తెరచి ఆ చెట్ల గాలిని పీలిస్తే ఆ రోగి వేగంగా కోలుకుంటాడు. చెట్ల దగ్గరగాని పచ్చదనానికి దగ్గరగా ఉంటే అలసట పోతుంది.

12. ఒక ఇంటి దగ్గర చెట్లు లేకుండా ఖాళీస్థలాలు ఎక్కువగా ఉంటే అక్కడ హింస భయముంటుందని, చెట్లు అధికంగా ఉంటే ఆ భయం యొక్క తీవ్రత తగ్గుతుందంటారు.

13. చెట్లను చూసి ఋతువులను (సీజన్స్) చెప్పవచ్చు. చెట్ల ఆకులు పరిశీలించినచో అది ఏ ఋతువో చెప్పవచ్చు.

14. **చెట్లు ఆర్థిక వనరులను సృష్టిస్తాయి.**
కొన్ని రకాల చెట్ల ఫలాలకు బహిరంగ మార్కెట్‌లో బాగా ధర (రేటు) ఉంటుంది. అవి అమ్మినందువల్ల పండించిన రైతులకే గాదు అమ్మే వ్యాపారులకు గూడా లాభాలు వస్తాయి. ఉదాహరణకు మామిడి, సపోట, నిమ్మ, జామ, బత్తాయి, దానిమ్మ, బొప్పాయి, నారింజ, అరటి, ద్రాక్ష, నేరేడు ఇంకా అనేక రకాల తినే పండ్లు.

15. చెట్లు పెద్దవారికి ఆధ్యాత్మిక గురువుల్లా, పిల్లలకు ఆటలాడే స్నేహితుల్లా ఉపయోగపడతాయి. ఆధ్యాత్మిక ప్రేరణను చెట్లు కలుగజేస్తాయంటారు. పిల్లలు చెట్ల క్రింద ఆడతారు.

16. **వివిధ రకాల వ్యక్తులను, కులాలను చెట్లు ఏకం చేస్తాయి.**
మొక్కలు నాటే కార్యక్రమంలో అన్ని కులాల వ్యక్తులు ఉత్సాహంగా పాల్గొని, ఉత్సాహంగా మెలగుతారు. ఈ కార్యక్రమంలో వివిధ సంస్కృతుల భేదాలు, వయో, లింగ భేదాలుండవు.

17. **ప్రజల ఐక్యతను చెట్లు పెంచుతాయి.**
ఒక ఏరియాలో లేక పరిసర ప్రాంతానికి చెట్లు గుర్తింపు తెస్తాయి. చెట్లు ఎక్కువగా ఉన్న ప్రాంత ప్రజలు ఆ ప్రాంతాన్ని గురించి గొప్పగా చెబుతారు. గర్వంగా భావిస్తారు.

18. అనేక జంతువులకు, పక్షులకు చెట్లే నివాస స్థలము.

19. చెట్లు శబ్ద కాలుష్యాన్ని, దుమ్ము, ధూళి కాలుష్యాన్ని అరికడతాయి. ఇళ్ళకు గాని, సంస్థలకు గాని రక్షణగా నిలుస్తాయి. అవి కనబడకుండా పెరుగుతుంటాయి.

20. **చెట్లు కలపనిస్తాయి.**
మానవ అవసరాలకు కావలసిన కలపను చెట్లు ఇస్తాయి. మన దేశంలో గృహ దర్వాజాలు, తలుపులు, కిటికీలు, ఇతరత్రా సామాగ్రి పెట్టుకునే షెల్ఫ్‌లు అన్నీ కలపతోనే తయారు చేస్తారు. కుర్చీలు, బల్లలు, టేబుల్స్ – ఇవన్నీ విద్యార్థులకు అవసరమవుతాయి. వాటికి కావలసిన కలపను చెట్లే ఇస్తాయి. అమెరికా, ఐరోపా, కెనడా దేశాలలో నివాస గృహాలన్నీ కలపతో నిర్మితమైనవే.

21. చెట్లు ఆస్తి విలువను పెంచుతాయని కొన్ని సర్వేలు చెబుతున్నాయి. బాగా అందమైన చెట్లు ఉన్న ప్రాంతంలో లేక ఏరియాలో ఉన్న గృహాలు చెట్లు లేని ప్రాంతంలో ఉన్న ఇళ్ళ కంటే 15 శాతం అధిక ధరలకు అమ్ముడు పోతాయంటారు.

22. **చెట్లు వ్యాపారాభివృద్ధికి గూడా తోడ్పడతాయంటారు.**
ఎక్కువ చెట్లు, పచ్చదనం అధికంగా ఉన్న జిల్లాల్లో వ్యాపారం గూడా ఎక్కువగా సాగుతుంది. అక్కడ ప్రకృతి అందాలు జనాన్ని బాగా ఆకర్షిస్తాయి. వస్తువుల ధరలు కూడా అధికంగా ఉంటాయి. వ్యాపారులకు లాభాలు గూడా బాగా వస్తాయని, కొన్ని సర్వేలు తెలియజేస్తున్నాయి.

కనుక విద్యార్థులారా! ఇన్ని లాభాలు ఉన్న చెట్లను పెంచటానికి, మొక్కలు నాటడానికి మనం ఉన్న ప్రదేశంలో ఉత్సాహంగా ముందుకు నడుద్దాం.

పచ్చదనం ఎక్కువగా ఉన్న చోట ఆహ్లాదకరమైన వాతావరణ ముంటుంది. మానసికోల్లాసం పెరుగుతుంది. నరసరావుపేటలో, కోటప్పకొండ దగ్గర పచ్చదనాన్ని ప్రోత్సహించిన మొదటి వ్యక్తి డా|| కోడెల శివప్రసాదరావు

గారు. నరసరావుపేట పట్టణంలో 25 సం॥ క్రితమే "పచ్చదనం–పట్టణాభివృద్ధి" పేరుతో అనేక మొక్కలను వివిధ ప్రాంతాలలో డా॥ కోడెల శివప్రసాదరావు గారు నాటారు, నాటించారు.

## పరిశుభ్రత

పరిశుభ్రతను గూర్చి పరిశీలిద్దాం. పరిశుభ్రతను రెండు రకాలుగా చెప్పుకోవచ్చు. 1) పరిసరాల పరిశుభ్రత 2) వ్యక్తిగత పరిశుభ్రత.

**1) పరిసరాల పరిశుభ్రత :**

ప్రజల ఆరోగ్య పరిరక్షణకు పరిసరాల పరిశుభ్రత చాలా అవసరం. మన నివాసగృహం పరిసర ప్రాంతాలు పరిశుభ్రంగా ఉండాలి. ఖాళీస్థలముంటే పిచ్చి మొక్కలు పెరుగుతాయి. వీధిలోకి జనం కసువును, వారి ఇళ్ళలో పనికిరాని వస్తువులను పడవేస్తుంటారు. అవి నిత్యము పరిశుభ్రంగా ఉండాలి. మనం ఉంచాలి. పిచ్చిమొక్కలు, చెత్తాచెదారం ద్వారా దోమలు, ఈగలు వ్యాప్తి చెందుతాయి. మన నివాస గృహాలముందు గుంటలు ఏమైనా ఏర్పడితే వాటిని వెంటనే పూడ్చకపోతే వర్షపునీరు చేరి దోమల నిలయాలుగా మారుతాయి. దోమలున్న చోట మలేరియా వ్యాధి వ్యాపిస్తుంది. మనం ఇంట్లో వచ్చే కసువుని, ఇతర వ్యర్థాలను ఇంటి ముందు ఒక ప్లాస్టిక్ టిన్‌లో వేసినచో మునిసిపాలిటీ వారు తీసుకుపోతారు. ప్రస్తుతం నరసరావుపేటలో సహా కొన్ని పట్టణాల్లో అండర్‌గ్రౌండ్ డ్రైనేజి ఉన్నందువల్ల దోమల బెడద తగ్గింది. అది లేని పట్టణాల్లో, గ్రామాల్లో వర్షాకాలంలో దోమల బెడద అధికంగా ఉంటుంది. దోమ తెరలు వాడాలి. పరిసరాల పరిశుభ్రతకు అధిక ప్రాధాన్యాన్నివ్వాలి. పరిసరాల్లో, ఖాళీ ప్రదేశాల్లో మునిసిపాలిటీ వారు ఫాగింగ్ చేస్తుంటారు. దానివల్ల దోమల బెడద కొంతమేర తగ్గుతుంది. పరిసరాల పరిశుభ్రతకు మనం చేయవలసిన పనులు.

1. ఇంటిముందుగాని, ఇంటిముందున్న ఖాళీ స్థలంలోగాని పిచ్చిమొక్కలు లేకుండా చూచుకోవాలి.
2. వర్షపునీరు నిలువకుండా గుంటలు ఉంటే వెంటనే పూడ్చాలి. తద్వారా దోమలు చేరవు.

3. చెత్త చెదారం విచక్షణారహితంగా ఇంటిముందు వేయరాదు.

4. కొన్ని ఫంక్షన్లు జరిగిన ఇంటి మూలమీద ఎంగిలి విస్తరాకులు దర్శనమిస్తాయి. వాటి ద్వారా కుక్కలు, పందులు చేరి అనారోగ్య పరిస్థితులు ఏర్పడతాయి. ఫంక్షన్ ఎక్కడ జరిగినా ఒక డ్రమ్‌లో ఎంగిలి విస్తరాకులు వేసి మునిసిపల్ చెత్త ట్రాక్టర్‌కి అప్పజెప్పాలి.

5. ప్రతి ఇంటిముందు చెట్లుగాని, పూలమొక్కలుగాని పెంచాలి.

6. ప్లాస్టిక్ వినియోగాన్ని తగ్గించాలి. షాపులలో ప్లాస్టిక్ కవర్లను నిషేధించామని ప్రభుత్వ వర్గాలు అప్పుడప్పుడు ప్రకటనలిస్తారు. వారు చేయవలసింది షాపులవారు, వ్యాపారస్తులు ఉపయోగించకుండ నిషేధించటం గాదు. అవి తయారు చేసే కంపెనీలను నిషేధించాలి.

## వ్యక్తిగత పరిశుభ్రత

పరిసరాల పరిశుభ్రతకంటె అతి ముఖ్యమైనది వ్యక్తిగత పరిశుభ్రత. వ్యక్తిగత పరిశుభ్రత లోపిస్తే అనారోగ్యం పాలవుతాము. వ్యక్తిగత పరిశుభ్రతకు మనం చేయవలసిన పనులు.

1. పరిశుభ్రమైన ఆహారం తినాలి.
2. కుళ్ళిపోయిన, పాచిపోయిన ఆహారాన్ని తినగూడదు.
3. ప్రతిరోజు శుభ్రమైన బట్టలు ధరించాలి. అవి ఉతికినవి కావచ్చు, ఇస్త్రీ చేసినవి కావచ్చు. విడిచిన బనియన్‌లు, డ్రాయర్లు, లోదుస్తులను ధరించరాదు.
4. పరిశుభ్రమైన నీటితో స్నానం చేయాలి.
5. పరిశుభ్రమైన నీరు త్రాగాలి.
6. మరుగుదొడ్లను పరిశుభ్రంగా ఉంచుకోవాలి.
7. 2014 వరకు పట్టణాల్లో కొన్ని ప్రాంతాల్లో బీదవారి ఇళ్ళల్లో, గ్రామాల్లో మరుగుదొడ్లు అందరికీ లేవు. బహిర్భూమికి బయటకు వెళ్ళాలి. 2014 నుండి పాఠశాలల్లో, విద్యాసంస్థల్లో, గ్రామాల్లో, పట్టణాల్లో ప్రభుత్వ సహాయంతో విరివిగా మరుగుదొడ్లను నిర్మించటం జరిగింది. ముఖ్యంగా

నరసరావుపేట, సత్తెనపల్లి నియోజకవర్గాలు మరుగుదొడ్ల నిర్మాణంలో ముందంజలో ఉన్నాయి. దీనికి ప్రభుత్వం నిధులిచ్చినా కారకుడు మాత్రం డా॥ కోడెల శివప్రసాదరావుగారు.

8. మనం నివసించే ఇళ్ళల్లో ఏ మూలనైనా దుమ్ము, ధూళి, బూజు లేకుండా చూసుకోవాలి. ముఖ్యంగా పడకగదిలో దుమ్ము, బూజు లేకుండా శుభ్రం చేయాలి. ఇంట్లో ఉన్న గాలి పంకాలకు (ఫ్యాన్స్) అప్పుడప్పుడు బూజు పడుతుంటాయి. వాటిని కనీసం నెలకు, రెండునెల్లకొకసారైనా శుభ్రం చేయాలి.

9. మన ఇంట్లో ఉన్న మునిసిపల్ పంపు ద్వారా మంచినీళ్ళ ట్యాంకులోని నీరు ఎక్కిస్తుంటాము. ఆ నీటిని వాడతాము. ఆ నీటి ట్యాంకుని కనీసం నాలుగైదు నెలలకొక పర్యాయం కడిగి శుభ్రం చేయాలి. పాచిబట్టి, ట్యాంక్‌లోపలి భాగంలో సూక్ష్మ జీవులున్నా చనిపోతాయి.

10. భోజనానికి ముందు కాళ్ళు చేతులు శుభ్రంగా కడుక్కోవాలి.

11. మనం ప్రతిరోజు ఉదయాన్నే పళ్ళు తోముకుంటాము. హడావుడి లేకుండా నిదానంగ జాగ్రత్తగా తోముకోవాలి. నోటిని శుభ్రం చేసుకోవాలి.కొన్ని సందర్భాలలో కొంతమంది నోటినుండి దుర్వాసన వెలువడుతుంది. అది ప్రక్కనున్న వారికి ఇబ్బంది కలుగజేస్తుంది.

వ్యక్తిగత పరిశుభ్రతలో భాగంగా అన్నం తినే ముందు చేతులు శుభ్రం చేసుకునే (కడుక్కునే) విషయంలో సత్తెనపల్లి నియోజకవర్గం గిన్నిస్‌బుక్ రికార్డు సాధించింది. దీనికి కారకుడు యం.యల్.ఏ., అసెంబ్లీ స్పీకరుగారైన డా॥ కోడెల శివప్రసాదరావుగారు.

ఇవన్నీ వ్యక్తిగత పరిశుభ్రతకు తీసికొనవలసిన లేక పాటించవలసిన కనీస జాగ్రత్తలు.

# 10. అధ్యాపక విద్యార్థుల సంబంధాలు

ఈ అంశాన్ని ఉన్నత పాఠశాల విద్యార్థులను దృష్టిలో ఉంచుకొని, వారి కోసమే వ్రాయటమైనది.

అనాదినుండి భారతదేశం అధ్యాపకులకు ఎనలేని గౌరవాన్నిస్తుంది. "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః" అన్నది మన సాంప్రదాయం అధ్యాపక వృత్తి నిస్వార్థమైంది, దేశ భావి భారత పౌరులను తయారుచేసే, తీర్చిదిద్దే పవిత్ర కార్యక్రమంగా భావింపబడుతున్నది. అధ్యాపకుల అంకితభావం, వృత్తిపట్ల గౌరవం, సానుకూల దృక్పథం, వారి క్రమశిక్షణ, నిబద్ధత మీద, వారి ప్రతిభా పాటవాలననుసరించి వారిని ఏ విద్యాసంస్థలోనైనా విద్యార్థులు గౌరవిస్తారు, ఆరాధిస్తారు.

దేశాధ్యక్షుడు, దేశప్రధాని, ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రులు, గవర్నర్లు, ఐ.ఎ.యస్., ఐ.పి.యస్ ఆఫీసర్లు, ప్రొఫెసర్లు – వీరందరూ ఏదో ఒక అధ్యాపకుని/ అధ్యాపకుల శిష్యులే. అంతటి మహత్తరమైన, ఉన్నతమైన, గొప్ప వృత్తి అధ్యాపక వృత్తి అని అధ్యాపకులు గర్వంగా భావించాలి. వారు అధ్యాపకులమనే విషయాన్ని మరువగూడదు.

విద్యార్థులు ఒక బండరాయి అనుకుంటే అధ్యాపకులు శిల్పులు. ఒక బండరాయిని, కొండరాయిని శిల్పి తన నైపుణ్యంతో చక్కటి శిల్పంగా, దేవతా విగ్రహాలుగా జనం ఆరాధించేటట్లు తయారు చేస్తాడు. విద్యార్థులు అజ్ఞాన దశలో వారి వద్ద చేరతారు. వారిని మంచి విజ్ఞానవంతులుగా తీర్చిదిద్దే పవిత్ర కార్యక్రమమే విద్య. అందుకు ప్రముఖ పాత్ర పోషించవలసినవారు అధ్యాపకులు.

అధ్యాపకులు ఆడవారైతే (స్త్రీలైతే) విద్యార్థులతో తల్లిలాగా మెలగాలి, ప్రేమతో వారిని చూడాలి. స్నేహపూర్వక వాతావరణంలో వారికి బోధించాలి. వారి ప్రతిభా పాటవాలు బోధనలో ప్రదర్శించి వారిని చదువుపట్ల ఆకర్షితులను చేయాలి. అందరికీ అర్థమయ్యే రీతిలో బోధన సాగాలి. మంచి ఉదాహరణలతో, చిన్న చిన్న కథలతో చిరునవ్వుతో పాఠ్యాంశాల బోధన సాగాలి. విద్యార్థులకు బోరుగా ఫీలవుతున్నారని గ్రహించినపుడు వారి అటెన్షన్‌ను మరల్చటానికి

చిన్న చిన్న జోక్స్ చెప్పి సెన్స్ ఆఫ్ హ్యూమర్‌ను బోధనలో చొప్పించాలి. వారికి తరగతి గదిలో కూర్చొని పాఠాలు వినడమంటే సంతోషంగా ఉండాలి. ఇదంతా టీచర్ల సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. అధ్యాపకులు పురుషులైతే విద్యార్థులను వారి పిల్లలుగాను, తమ్ములుగాను భావించి బోధన చేయాలి. విద్యార్థులు అధ్యాపకులను నమ్మాలి. అధ్యాపకులు మనస్ఫూర్తిగా, అంకితభావంతో, శ్రద్ధతో విద్యార్థుల అభ్యున్నతికి కృషి చేస్తున్నారనే భావన వారిలో బలపడితే, వారిని నమ్ముతారు. అధ్యాపకులకు వారి సాధక బాధకాలు చెప్పడానికి, వారితో సన్నిహితంగా మెలగడానికి ప్రయత్నిస్తారు.

విద్యార్థులందరూ ఒకే విధమైన సామాజిక, ఆర్థిక, గృహ పరిస్థితులను కలిగి ఉండరు. ఉద్యోగస్తుల పిల్లలు, బీదవారు, తల్లిదండ్రులు విడిపోయినవారు, తల్లిగాని, తండ్రిగాని లేనివారు, ధనికులు, పొరుగూరునుండి ప్రతి రోజు పాఠశాలకు హాజరయ్యేవారు, రకరకాల విద్యార్థులు ఒకే తరగతిలో కూర్చొని పాఠాలు వినాలి, నేర్చుకోవాలి. అంతేగాకుండ ఒక తరగతి గదిలో ఉండే విద్యార్థులందరికీ ఒకే విధమైన తెలివితేటలు గూడా ఉండవు. కొందరు డల్‌గాను, కొందరు తెలివిగలవారిగాను, కొందరు యావరేజిగాను ఉంటారు. వీరందరికి ఒక తరగతి గదిలో ఒక అధ్యాపకుడు ఒక పాఠ్యాంశాన్ని బోధించినపుడు కొంతమందికి అర్ధమవుతుంది, కొందరికి అర్ధం కాదు, మరి కొందరికి సరిగా అర్ధం కాదు. అందుకే టీచర్లు చెప్పేటపుడు ఒకే విషయాన్ని మరలా మరలా చెబుతుంటారు. చురుకైన అధ్యాపకుడు తాను చెప్పే పాఠం ఎవరికి అర్ధమవుతుందో, ఎవరికి అర్ధం కావటం లేదో గ్రహించగలడు. తరగతి గదిలో విద్యార్థులెవరైనా సందేహాలు అడిగితే వారి మీద కోపం లేకుండా, చిరునవ్వుతో వారి సందేహాలకు వివరణలిచ్చి వారి చేతనే అర్ధమయిందని చెప్పించాలి. భయపెట్టగూడదు. కొందరు విద్యార్థులు భయపడిగూడా అర్ధమయిందంటారు.

అధ్యాపకులు వృత్తిని నిబద్ధతతో నిర్వహించాలి. కేవలము జీతము కోసమే పని చేయకూడదు. కొందరు అవసరమున్నా, లేకపోయినా ఉన్న

శెలవులను లెక్కవేసుకొని వాడుకొనేవారు గూడా లేకపోలేదు. ఈ మాట వ్రాసినందుకు క్షమార్హుడిని. ఎందుకంటే నేను నా అనుభవంతో ఈ మాటలు వ్రాస్తున్నాను. నేను నా సర్వీసులో అన్ని శెలవులను ఏనాడు వాడలేదు. అధ్యాపకులు విద్యార్థులను చదువుపట్ల మోటివేట్ చేయాలి, వారిలో ఉత్సాహాన్ని నింపాలి. వారిని ప్రోత్సహించాలి. అప్పుడే వారు మనకు దగ్గరవుతారు. ఒకసారి దగ్గరైన తరువాత వారి సాధకబాధకాలు, వారి వ్యక్తిగత సమస్యలు, ఇబ్బందులను గూడా మనతో పంచుకుంటారు. వాటికి మన సలహాలు, సహాయ సహకారాలు అందించే అవకాశం లభిస్తుంది.

విద్యార్థులను బానిసలుగా భావించకూడదు. విద్యార్థులను స్నేహితుల్లాగా పరిగణించాలి. విద్యార్థుల ప్రతిభను కనిపెట్టి వారు ఏ రంగంలో రాణిస్తారో, వారికున్న టాలెంట్స్ అభివృద్ధికి కృషి చేసేటట్లు ప్రోత్సహించాలి. కొందరు ఆటల్లో రాణించగలరు, కొందరు పెయింటింగ్‌లో రాణించగలరు, కొందరు నటన, పాటల విభాగంలో రాణించే ప్రతిభా, పాటవాలు కలిగి ఉంటారు. ఆయా టాలెంట్స్‌ని ప్రోత్సహించవలసింది పాఠశాల స్థాయినుండే! కొందరికి తర్ఫీదిస్తే వారు మంచి ఉపన్యాసకులుగా తయారు కాగలరు. వాటన్నిటికి పునాదులు పాఠశాల విద్యలోనే పడాలి. వారికి నాయకత్వ లక్షణాలు గూడా ఈ దశనుండే అలవాటు చేయాలి, అబ్బాలి.

విద్యార్థుల అభ్యున్నతికి ప్రతి ఒక్క ఉపాధ్యాయుడు కంకణం కట్టుకోవాలి. నిత్యం పాటుబడాలి. చదువులో వెనకబడిన విద్యార్థులను తాను బోధించే పాఠ్యాంశాలలో ప్రత్యేక తరగతులు ఓపికతో నిర్వహించి వారు ఆయా పాఠ్యాంశాలలో మిగతా విద్యార్థులతో సమానస్థాయికి చేరే కృషి చేయాలి. ఏ రోజు ఏమి బోధించాలో ప్రణాళికను తయారు చేసుకొని ఆ ప్రణాళికాబద్ధంగా నడచుకోవాలి. ప్రస్తుతం ప్రభుత్వం వారు పాఠశాల విద్యపై ఎక్కువ శ్రద్ధ పెట్టి వసతులు సమకూరుస్తున్నారు. మార్కులు, ర్యాంకులు సాధన దిశగా విద్యార్థులను తయారు చేయటానికి తగు సూచనలు, పర్యవేక్షణలు, అధ్యాపకులకు శిక్షణా తరగతులు నిర్వహించడమే గాకుండా, అదనపు క్లాసుల

నిర్వహణకు అదనపు పారితోషికాన్నిస్తున్నారని విన్నాను. విద్యార్థులకు తరగతి గదుల్లో పాఠ్యాంశాల బోధనకు సమయం చాలటం లేదు. అదనపు సమాచారాన్ని, కొన్ని జనరల్ నాలెడ్జికి సంబంధించిన, వ్యక్తిత్వ అభివృద్ధికి సంబంధించిన విషయాలు చెప్పే అవకాశం లేకుండా పోయింది. విద్యార్థులు ఫ్యాక్టరీలో తయారు చేసిన వస్తువుల్లా ఉండకూడదు. కేవలము మార్కులు, ర్యాంకులే ప్రధానంగా విద్యాభ్యాసం సాగితే తరువాత జీవితంలో వారు చాలా పోగొట్టుకుంటారు. జనరల్‌నాలెడ్జ్ అంశాలు, ఇతరత్రా పరీక్ష అంశాలు – ఇంకా అనేక అంశాలు మిస్ అవుతారు.

విద్యార్థులకు మంచి అలవాట్లు, మర్యాదతో గూడిన ప్రవర్తనను పాఠశాల స్థాయినుండే అధ్యాపకులు అలవాటు చేయాలి. అధ్యాపకులకు, పెద్దవారికి నమస్కారం చేయటం, తల్లిదండ్రులను గౌరవించటం, తోటి విద్యార్థులను గౌరవించటం, ప్రతివారితో మర్యాదగా ప్రవర్తించటం, పాఠశాలకు సకాలంలో హాజరుకావటం, గైరుహాజరు కాకుండా ఉండటం, తదితర అంశాలలో పాఠశాల స్థాయినుండే మంచి అలవాట్లను విద్యార్థులు అలవాటు చేసుకునే విధంగా వారిని తయారు చేసే బాధ్యతను తల్లిదండ్రులతోపాటు అధ్యాపకుడు చేపట్టాలి. తల్లిదండ్రులలో నిరక్షరాస్యులు ఉండవచ్చు, వారికి కొన్ని విషయాలు, మర్యాదలు తెలియకపోవచ్చు, వారి పిల్లలకు తెలియకపోవచ్చు, కాని అధ్యాపకులు గమనించి విద్యార్థులకు విద్యతోపాటు మంచి అలవాట్లు, మర్యాద నేర్పాలి. ఇది చదువులో భాగమే. దీనినే సంస్కారం అంటారు.

విద్యార్థులను సోషల్ సర్వీస్ (సంఘసేవ) కార్యక్రమాల్లో భాగం చేసే బాధ్యతను గూడా అధ్యాపకులు చేపట్టాలి. ఇటువంటి కార్యక్రమాల ద్వారా అధ్యాపకులకు, విద్యార్థులకు సన్నిహిత సంబంధాలు పెరుగుతాయి, బలపడతాయి. పాఠశాల ఆవరణలో మొక్కలు నాటే కార్యక్రమం, కొన్ని సందర్భాలలో పట్టణంలో విద్యార్థులతో ర్యాలీలు నిర్వహిస్తుంటారు ప్రభుత్వం వారు. చదువుతో పాటు సాంఘిక సమస్యలపై అవగాహన పెంచే కార్యక్రమాలు

ఉంటాయి. వాటిలో విద్యార్థులు భాగస్వాములయ్యేట్లు అధ్యాపకులు చూడాలి. విద్యార్థులతో పాటు వారూ భాగస్వాములు కావాలి.

పాఠశాల విద్యాభ్యాసం కూడా ఒక సంఘజీవనం లాంటిదే. కొన్ని వందలమంది విద్యార్థులు అనేక ప్రాంతాలనుండి, వివిధ రకాల కుటుంబ నేపథ్యంనుండి వచ్చి ఒక చోట గుమిగూడి చదువుకోవటం నిజంగా సంఘజీవనంలో భాగమే! ఇందులో అనేక పండుగలు జరుపుకుంటాం. ప్రతిరోజు పాఠశాల అసెంబ్లీ, జాతీయ పండుగలైన స్వాతంత్ర్య దినోత్సవం, రిపబ్లిక్ డే, జాతీయ నాయకుల జయంతి, వర్ధంతులు, పాఠశాల వార్షికోత్సవము ఇంకా ఎన్నెన్నో. ఇవన్నీ అధ్యాపక – విద్యార్థుల భాగస్వామ్యంతో నిర్వహించే కార్యక్రమాలే. సాంస్కృతిక ప్రదర్శనలకు కొందరు విద్యార్థులను కొందరు టీచర్లు శ్రద్ధ తీసుకొని తయారు చేస్తారు. ఆటల టీచర్లు ఆటల పోటీలను నిర్వహిస్తారు. వార్షికోత్సవం వివిధ రకాలు పోటీలను విద్యార్థులకు నిర్వహిస్తారు. వార్షికోత్సవం రోజున విజేతలకు బహుమతులిస్తారు. ఈ అంశాలన్నీ అధ్యాపక, విద్యార్థులకేగాకుండా విద్యార్థుల తల్లిదండ్రులకు గూడా సంతోషాన్ని కలిగించే అంశాలే, విద్యార్థుల అధ్యాపకుల మధ్య స్నేహపూర్వక మంచి వాతావరణాన్ని ప్రోత్సహించే అంశాలే.

విద్యార్థులకు మార్గదర్శకులుగా, సలహాదారులుగా, వారి భవిష్యత్తుకు భరోసానిచ్చి, ధైర్యంగలవారిగా వారిని తయారు చేయాలి. వృత్తిమీద శ్రద్ధలేని అధ్యాపకులను విద్యార్థులు గుర్తిస్తారనే విషయాన్ని అధ్యాపకులు గమనించాలి. వారికున్న శ్రద్ధ, అంకితభావాన్ని బట్టి వారిని గౌరవిస్తారని కూడా అధ్యాపకులు గమనించాలి. తరగతి గదుల్లో పొరపాటున కాలక్షేపం చేసే అధ్యాపకులుంటే వారి క్లాసుల్లో గోల చేస్తారని కూడా వారు గమనించే ఉంటారు. కొంతమంది విద్యార్థులు చదువుతున్నట్లు నటిస్తారు. వాస్తవానికి శ్రద్ధగా చదువరు. అటువంటి విద్యార్థులను అధ్యాపకులు ఒక కంట కనిపెట్టాలి.

విద్యార్థులు పాఠశాల ఆవరణలోనే గాదు బయట ప్రపంచంలో గూడ అధ్యాపకులను గౌరవించే విధంగా వారి ప్రవర్తన ఉండాలి. మంచి అధ్యాపకుడ్ని

విద్యార్థి లోకం ఎన్నటికి మరువదు. బాగా పాఠాలు చెప్పేవారిని, విద్యార్థులు బాగుపడాలని నిరంతరం తపన ఉన్న అధ్యాపకులను వారు ఎల్లప్పుడూ గౌరవిస్తారు, అభిమానిస్తారు. వారు జీవితాంతం గుర్తుపెట్టుకుంటారు. అధ్యాపక వృత్తిలో రాణించినవారికి విద్యార్థుల్లోనేగాదు, సంఘంలో గూడ మంచి గౌరవం లభిస్తుంది.

నేను యస్.యస్.యల్.సి. చదివే రోజుల్లో లెక్కల్లో జనరల్, కాంపోటిట్ అని రెండు విభాగాలు ఉండేవి. 9,10,11 తరగతుల్లో ఇవి తీసుకొని చదవాలి. నేను కాంపోజిట్ లెక్కలు ఎంచుకొన్నాను. అందులో బీజగణితముంటుంది. ఒక పబ్లిక్ పేపర్‌లో ఒక లెక్క నాకు రాలేదు. ఆ పేపరు మా లెక్కల మాస్టారుకిచ్చి సాల్వ్ చేయమన్నాను. ఆయన ఆ లెక్కను తరగతి గదిలో బోర్డు మీద వేసి ప్రయత్నించారు. ఆయనకు గూడా అప్పుడు ఆ లెక్క రాలేదు. నేను ఆ మాస్టారి ఇంటి ప్రక్కన గదిలో ఉండేవాడిని. ఆ రోజు అర్ధరాత్రి 2 గంటలకు నా రూము తలుపు తట్టి నన్ను లేపి నా నోట్సు తీసుకొని ఆ లెక్కను సాల్వ్ చేసి వెళ్ళాడు. చూచితిరా ఆయన శ్రద్ధ, అంకితభావం! నేను ఈ రోజుకి ఆయనను మరువలేదు. ఇది అధ్యాపక వృత్తి గొప్పతనం. ఒక అధ్యాపకునికి వృత్తి మీద ఉన్న శ్రద్ధ.

ప్రస్తుతం గతం మాదిరిగా అధ్యాపక విద్యార్థుల సంబంధాలు అంత బలంగా లేవని నా భావన. గతం కంటె ప్రస్తుతమున్న విద్యార్థులు తెలివైనవారు. కాని గతంలో ఉన్న విద్యార్థుల్లాగా శ్రమ చేయుటలేదు. తెలివికి శ్రమతోడైతేనే విద్యలో రాణించేది. ప్రస్తుతం టెక్నాలజీ బాగా పెరిగింది. కంప్యూటర్ ఎడ్యుకేషన్ వచ్చింది. విద్యార్థులు టెక్నికల్ నాలెడ్జి పట్ల ఎక్కువ ఆకర్షితులవుతున్నారు. అది అవసరం గూడా.

## పాఠశాల విద్య ద్వారా విద్యార్థులు నేర్చుకోవలసిన అంశాలు

1. **నమ్మకం :** వారి మీద, వారి భావాల మీద వారికి నమ్మకం పెరగాలి. కొన్ని విషయాల మీద వారికి ఖచ్చితమైన అభిప్రాయాలుండాలి. వాటిని నమ్మాలి.

2. **మంచి అలవాట్లు, క్రమశిక్షణ :**

i) ఉదయాన్నే, పెందలకడ లేవాలి. యోగాలాంటి కార్యక్రమాలు నిర్వహించి అభ్యాసము చేయాలి. బాగా చదవాలి.

ii) క్రమశిక్షణ అలవర్చుకోవాలి, సమయపాలన పాటించాలి. క్రమం తప్పకుండా పాఠశాలకు హాజరు కావాలి.

iii) మంచి, మర్యాద నేర్చుకోవాలి.

అధ్యాపకులకు, పెద్దవారికి నమస్కరించటం, గౌరవించటం, తల్లిదండ్రుల పట్ల గౌరవం కలిగి ఉండటం, వారి సూచనలను నిర్లక్ష్యం చేయకుండ ఉండటం. ఇతరులెవరైనా మనకు చిన్న సహాయం చేసినా వారికి కృతజ్ఞతలు, ధన్యవాదాలు తెలపాలి.

iv) ధైర్యగుణం కలిగి ఉండటం : ధైర్యగుణం చాలా అవసరము. జీవితంలో రాణించాలంటే ధైర్యగుణం అవసరం.

v) వివిధ రంగాలలో వారికున్న ప్రతిభను అధ్యాపకుల సహాయంతో అభివృద్ధి పరచుకోవాలి.

vi) సత్యాన్ని మాట్లాడటం. నిజాయితీగా మెలగటం, తోటి విద్యార్థులతో కలహాలు లేకుండా ఉండటం, ఈర్ష్యా ద్వేషాలు దరిచేరనీయకుండ ఉండటం.

(ఇవన్నీ పాఠశాల విద్య ద్వారా చిన్నతనం నుండే రావాలి. అలవాటు చేసుకొని, వాటిని అభివృద్ధి పరచుకోవాలి).

vii) కష్టపడి పనిచేయటం.

అధ్యాపకులు వారి విద్యార్థులతో మమేకమై వారికి చదువుతోపాటు వారి భావిజీవితానికి పనికివచ్చే, ఉపయోగపడే జాగ్రత్తలు, సూచనలను తెలియజేయాలి. కేవలం సిలబస్ పూర్తి చేయటం, పాఠాలు చదివించటం, పరీక్షలు నిర్వహించటం, మార్కులు వేయటంతో వారి బాధ్యత తీరిపోయిందని భావించరాదు. జాతి నిర్మాణంలో భాగస్వాములు కానున్న విద్యార్థులను తయారు చేస్తున్నామని సదా గుర్తుంచుకోవాలి. దేశభవిష్యత్తు చదువుమీద, నిజాయితీగల్గిన వ్యక్తులమీద, కష్టించి పనిచేసేవారిమీద

ఆధారపడి ఉంటుందని అధ్యాపక వర్గం ఎన్నడూ మరువరాదు.

viii) కష్టపడి పనిచేయటం, నిజాయితీగా బ్రతకటం పాఠశాల స్థాయినుండే రావాలి.

ix) అధ్యాపకులు, ఎడ్యుకేషన్ టూర్స్ నిర్వహించి విద్యార్థులకు రెండు రకాల ప్రదేశాలను చూపించాలి.

1. ప్రకృతి అందాలను తిలకించే ప్రదేశాలు
2. పరిశ్రమల వద్దకు

ఎలక్ట్రిక్ బల్బులు ఎలా తయారు చేస్తారు? ఎలక్ట్రిసిటీ ఎలా జనరేట్ అవుతుంది? స్టీల్ ఎలా తయారుచేస్తారు? కాగితపు పరిశ్రమలో పేపర్ని ఎలా తయారు చేస్తారు? గాజుగ్లాసులు, కప్పులు, ప్లాస్టిక్ వస్తువులు ఎలా తయారుచేస్తారు ? మొదలయినవి విద్యార్థులు చూస్తే వారికి ప్రాక్టికల్ నాలెడ్జి ఉంటుంది. కనీసం కొవ్వొత్తులు తయారీ విధానాన్నైనా విద్యార్థులకు నేర్పాలి. కుట్టు మిషన్లు, కంప్యూటర్ ఆపరేషను, టైపు చేయటం, ప్రింటు తీయటం తదితర విషయాలను నేర్పాలి. ఈ టూర్స్ ద్వారా అధ్యాపకులు విద్యార్థుల మధ్య స్నేహబంధం పెంపొందగలదు.

## అబ్రహాం లింకన్

అమెరికా గొప్ప అధ్యక్షులలో ఒకరైన అబ్రహాం లింకన్ తన కుమారుడిని పాఠశాలలో చేర్చిన తరువాత ఆ పాఠశాల అధ్యాపకునికి తన కుమారునికి పాఠశాలలో ఏమేమి బోధించాలో ఒక లేఖ వ్రాశారు. ఆ లేఖ అబ్రహాం లింకన్ తన కుమారుడిని గురించి వ్రాసినా అది విశ్వవ్యాప్తంగా పాఠశాలల్లో చదివే విద్యార్థులకు వారి అధ్యాపకులు నేర్పవలసిన అంశాలు నిక్షిప్తమయినాయి.

లింకన్ ఈ విధంగా వ్రాశారు. తన కుమారుడు పాఠశాల వాతావరణానికి క్రొత్త గనుక అతనిని బెదరగొట్టవద్దు. ప్రేమతో పాఠాలు నేర్పండి. ఈ జీవితాన్ని జీవించటానికి నమ్మకము, ప్రేమ, ధైర్యము కావాలి. విద్యార్థులకు అవి నేర్పండి. విద్యార్థులకు నేర్పవలసిన అంశాలను

బోధించేటప్పుడు అధ్యాపకులు తమ కోపాన్ని ప్రదర్శింపకూడదు. ప్రేమతో నేర్పండి. పాఠశాలలో అందరూ మంచి విద్యార్థులే ఉండరు. మంచి విద్యార్థులతో మంచిగాను, శత్రువులుగా ఉండేవారితో శత్రువుగా ఉండే విధంగానే నేర్పండి. మానవులందరూ మంచిగా ఉండరనే విషయాన్ని వాడికి తెలియజేయండి. ఒక డాలరు ఉచితంగా పొందే బదులు కష్టపడి అంతకంటె తక్కువే సంపాదించమని బోధించండి. ఒక విద్యార్థి అక్రమ పద్ధతుల ద్వారా ఉత్తీర్ణుడయ్యేకంటె నిజాయితీగా చదివి పరీక్ష తప్పినా గౌరవంగా ఉంటుంది. మంచివారితో మర్యాదగాను, చెడ్డవ్యక్తులతో మంచిగా ప్రవర్తించకుండ నేర్పండి. ప్రశాంతంగా తనకు తాను నవ్వుకునేటట్లు నేర్పండి. తాను విచారంగా ఉన్నపుడు ఎలా నవ్వుకోవాలో నేర్పండి. కళ్ళనీళ్ళు పెట్టుకుంటే అవమానం కాదని అందులో గూడ గొప్పతనం ఉందని నేర్పండి. అపజయములో గొప్పతనం ఉందని, విజయంలో విచారముందని నేర్పండి. పుస్తకాల గొప్పతనాన్ని చెప్పండి. ఆకాశంలో విహరించే పక్షుల గురించి వాటి రహస్యాల గురించి చెప్పండి. తేనెటీగలు, పచ్చికబయళ్ళలో ఉండే పుష్పాలను గురించి చెప్పండి. ఎవరు ఏం చెప్పినా వినమని చెప్పండి. కానీ అందులోని నిజాలను, సత్యాలను గమనించమని చెప్పండి. అతని తెలివితేటలను, ప్రతిభను అమ్మవచ్చుగాని, హృదయాన్ని, అత్మను అమ్మవద్దని నేర్పండి. అసహనంగా ఉంటే ధైర్యాన్ని, సహనంగా ఉండే ధైర్యాన్ని నేర్పండి. చివరిగా తనమీద తనకు పూర్తి నమ్మకం ఉండేటట్లు నేర్పండి. తద్వారా అతడు మానవులమీద, భగవంతుని మీద పూర్తి నమ్మకాన్ని కలిగి ఉంటాడు.

అబ్రహాం లింకన్ చెప్పినా, ఎవరు చెప్పినా పాఠశాల విద్య ద్వారా విద్యార్థులు ఈ క్రింది అంశాలను అభివృద్ధి చేసుకోవాలి, అధ్యాపకులు వారికి నేర్పాలి.

1. మంచి అలవాట్లు, క్రమశిక్షణ, సమయపాలన.
2. మంచి మేనర్స్ – తోటి విద్యార్థులను, వారి అధ్యాపకులను, పెద్దలను, తల్లిదండ్రులను గౌరవించుట.

3. కష్టపడుట – కష్టపడి చదవటం.
4. ఎవర్నీ మోసగించకుండా ఉండటం, సత్యాన్ని మాట్లాడే అలవాటు చేసుకోవటం.
5. క్రీడలందు శ్రద్ధ కలిగి ఆరోగ్యాన్ని అభివృద్ధి పరచుకోవటం.
6. నిజాయితీని ప్రేమించి, నిజాయితీ గల వ్యక్తులుగా తీర్చిదిద్దబడటానికి తగిన సాధన చేయటం.
7. చదువులందు శ్రద్ధ కలిగి ఉండటం.
8. వారిమీద వారికి నమ్మకం కలిగి ఉండటం, ఇతరులను విచక్షణా జ్ఞానంతో నమ్మటం.
9. విద్యార్థులు వారి ఆలోచనాశక్తిని, తార్కికశక్తిని అభివృద్ధి పరచుకోవటం.
10. వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకోవటం, స్వతంత్ర భావాలను కలిగి ఉండటం. వివిధ అంశాల మీద వారి అభిప్రాయాలు తెలిపే జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవటం.

చదువుకున్న వారందరికీ ప్రభుత్వ ఉద్యోగాలు రాకపోవచ్చును. చదువు ద్వారా నిజాయితీగ బ్రతకటం, కష్టించి పని చేయటం, మంచి–మర్యాద కలిగి ఉండటం, ఇతరులను గౌరవించటం రావాలి.



# 11. మంచి అలవాట్లు - ఆవశ్యకత

అసలు అలవాటు అంటే ఏమిటి? మంచి అలవాట్లు ఏవి? వాటి ఆవశ్యకత ఏంటి? ఈ అలవాట్లు ఎవరు చేసుకోవాలి? వాటిని ఎవరు నేర్పాలి? మంచి అలవాట్ల ఫలితాలు ఏమిటి? మంచికి చెడుకి తేడా ఏమిటి? చెడు అలవాట్లు అంటే ఏమిటి ? వాటి ఫలితాలు ఏమిటి? వాటిని ఎందుకు విడనాడాలి? చెడు అలవాట్లను విడనాడటం సులభమా? – ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను పరిశీలిద్దాం.

"మొక్కై వంగనిది మానై వంగునా" అనేది ఒక సామెత. దీని అర్థం చిన్నతనంలోనే పిల్లలు తప్పులు చేస్తే తల్లిదండ్రులు వారిని దండించాలి. దండించకుండ వదలివేస్తే వారు పెద్దయిన తరువాత సమాజానికి హానికరంగా మారగలరు. చిన్నతనం నుండే పిల్లలు మంచి అలవాట్లు నేర్చుకోవాలి. పెరిగి పెద్దయిన తరువాత మంచి అలవాట్లు అబ్బవు.

ప్రతి దినము మనం చేసే పనులలో సగభాగము అలవాట్లే. మన అలవాట్ల మీద మనకు నియంత్రణ ఉంటే మంచి అలవాట్లు ఏవో, చెడు అలవాట్లు ఏవో మన మనస్సే తెలుపుతుంది. అలవాట్లు మన స్వభావంలో భాగమవుతాయి. మంచి అలవాట్లు మనలని మంచి వ్యక్తులుగా, చెడు అలవాట్లు చెడ్డ వ్యక్తులుగా మారుస్తాయి. మంచి అలవాట్లను పాఠశాలలో అధ్యాపకులు, ఇంటి దగ్గర తల్లిదండ్రులు పిల్లలకు నేర్పాలి.

## మంచి అలవాట్లు

ఈ అలవాట్లను పాఠశాల విద్యార్థులను దృష్టిలో ఉంచుకొని వ్రాసినవి.

1. ఉదయాన్నే పెందలకడ నిద్ర లేచే అలవాటు.
2. లేచిన వెంటనే కాలకృత్యాలు తీర్చుకొని, వాటిలో భాగంగా పళ్ళు శుభ్రంగా తోముకొని, శుభ్రమైన నీటితో స్నానం చేయాలి.
3. ఆ తరువాత భగవంతునికి ప్రార్థన చేసి, యోగా పది నిముషాలు చేయాలి.
4. ఆ తరువాత ఒక గంట, గంటన్నర పుస్తక పఠనం గావించాలి.
5. తరువాత పాఠశాలలో ఇచ్చిన హోంవర్క్ ఏదైనా ఉంటే శ్రద్ధగా చేయాలి.

6. ఆ తరువాత ఆరోగ్యకరమైన అల్పాహారం తినాలి.
7. ఆ తరువాత పాఠశాలకు సకాలంలో వెళ్ళి పాఠశాల అసెంబ్లీకి హాజరు కావాలి.
8. పాఠశాల తరగతి గదులలోకి వెళ్ళి టీచర్లు బోధించే పాఠాలను శ్రద్ధగా వినాలి.
9. పాఠశాల తరగతులకు అవసరమైన టెక్ట్స్‌బుక్స్, నోట్‌బుక్స్, పెన్, పెన్సిల్, రబ్బర్ తదితర వస్తువులు తీసుకుపోవాలి. కొన్ని సమయాల్లో వారి పెన్నులో రీఫిల్ అయిపోతే తోటి విద్యార్థులను మర్యాదగా పెన్ను అడిగి తీసుకొని తరువాత వారి పెన్ను వారికిచ్చి వారికి ధన్యవాదాలు తెల్పాలి.
10. పాఠశాలలో అధ్యాపకులకు, ప్రధానోపాధ్యాయులకు, క్లాసులకు ఎవరైనా అధికారులు వచ్చినా లేచి నిల్చొని వారికి నమస్కారం చేయాలి.
11. మీ తల్లిదండ్రులను, మీకంటే సీనియర్స్‌ని, పెద్దవారిని గౌరవించాలి. ఎవరితోను అమర్యాదగా ప్రవర్తించరాదు.
12. తరగతి గదిలోగాని, పాఠశాలలోగాని తోటి విద్యార్థులతో తగాదాలు, వివాదాలకు దిగరాదు. మంచి–మర్యాద–మన్నన గల విద్యార్థులుగా మెలగాలి. మీ ప్రవర్తన ద్వారా అందరూ సంతృప్తి చెందాలి. మా విద్యార్థులు చాలా మంచివారని అధ్యాపక బృందంచే అనిపించుకోవాలి.
13. తరగతులకు ఆలస్యంగా రావటంగాని, మధ్యలో పాఠశాల ఎగగొట్టి వెళ్ళటంగాని చేయటం – మంచి అలవాటు కాదు. దీనిని విడనాడాలి.
14. పాఠశాలకు హాజరైనపుడు నీట్‌గా రావాలి. మురికిబట్టలతో, తల దువ్వుకోకుండ రాకూడదు.
15. అధ్యాపకులు పరీక్షలు నిర్వహించినప్పుడు తప్పకుండా అవి వ్రాయాలి. బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోవటంలో ఒకరితో ఒకరు పోటీబడాలి.
16. ఈర్ష్య, అసూయలు ఉండరాదు. పాఠశాలమీద, అధ్యాపకుల మీద సానుకూల దృక్పథాన్ని ఏర్పరచుకోవాలి. వ్యతిరేక దృక్పథముండరాదు.

17. చక్కని దస్తూరిని అలవాటు చేసుకోవాలి. మీ దస్తూరి మీ అధ్యాపకులను ఆకర్షించాలి. ఇది అభ్యాసము ద్వారా సాధ్యమగును. అందుకు తగిన శ్రమ చేయాలి.
18. పాఠశాల అయిన తరువాత ఆట స్థలానికి వెళ్ళి ఏదో ఒక ఆట మీద మీ ఆసక్తిని, అభిరుచిని పెంచుకొని ప్రతి రోజు కనీసం అరగంట ప్రాక్టీస్ చేయాలి. కొంత కాలం తరువాత ఆ ఆటలో మీరు ప్రావీణ్యతను సంపాదిస్తారు. చదివే టైంలో చదవాలి, ఆడే టైంలో ఆడాలి.
19. పాఠశాల ఆవరణలో మొక్కలు నాటే కార్యక్రమంలో, సాంస్కృతిక కార్యక్రమాలలో, పాటల పోటీలలో, వక్తృత్వ పోటీలలో చురుకుగా పాల్గొని మీకున్న ప్రతిభను అభివృద్ధి చేసుకోవాలి.
20. ఇంటికి వెళ్ళిన తరువాత సాయంత్రం స్నానం చేసి ఏమైన అల్పాహారం తిని ఒకటి రెండు గంటలు చదవటమో, ఇచ్చిన హోంవర్క్ చేయటమో చేయాలి.
21. విద్యార్థి దశలోనే కాదు. జీవితంలో గూడ సమయపాలన అతి ముఖ్యమైంది. అది పాటించాలి. పెందలకడ నిద్రపోయి వేకువనే లేవాలి.
22. మీరు ధనవంతుల బిడ్డలైతే బీదవారికి సహాయం చేసే అలవాటు చేసుకోండి.
23. మీరు మీ దినచర్య చార్టుని తయారు చేసుకొని దాన్ని అనుసరించండి.

ఈ విధమైన దినచర్యను మీరు అలవాటు చేసుకొని క్రమం తప్పకుండా పాటిస్తే అంతకంటే మంచి అలవాట్లు లేనే లేవు. మంచి అలవాట్లు మన స్వభావంలో భాగంగా మారి మనం మంచి వ్యక్తులుగా తయారవుతాము.

లోకంలో ద్వంద్వ స్వభావాలు, గుణాలు ఉన్నాయి. మంచి–చెడు, కష్టము–సుఖము, పగలు–రాత్రి, సంతోషము–దుఃఖము, ఎండలు–వానలు, ధనికులు–పేదవారు, నల్లవారు–తెల్లవారు మొదలగునవి. చెడు లేకపోతే మంచి విలువ తెలియదు. పగలు లేకపోతే రాత్రి విలువ తెలియదు, దుఃఖము లేకపోతే సంతోషం విలువ తెలియదు. మనందరికి తెలిసిన రామాయణంలో రావణుడు

పాత్ర లేకపోతే రాముని విలువ తెలియదు. మహాభారతంలో కౌరవులు లేకపోతే పాండవుల విలువ తెలియదు. కనుక మంచి చెడ్డలు పక్కపక్కనే ఉంటాయి.

**చెడు అలవాట్లను పరిశీలిద్దాం**

1. ఆలస్యంగా నిద్రలేవటం.
2. పాఠశాలకు ఆలస్యంగా హాజరుకావటం.
3. పాఠాలు మీద, చదువు మీద శ్రద్ధ లేకపోవటం.
4. పాఠశాలకు అవసరమైన పుస్తకాలను తీసుకురాకపోవటం.
5. అధ్యాపకులంటె గౌరవం లేకపోవటం, పాఠశాల మీద సదభిప్రాయం లేకపోవటం.
6. తోటి విద్యార్థులతో కలహించటం.
7. తల్లిదండ్రులన్నా, పెద్దలన్నా గౌరవం లేకపోవటం.
8. మంచి, మర్యాద లేకుండ ప్రవర్తించటం.
9. మురికి బట్టలతో పాఠశాలకు రావటం.
10. పాఠశాలలో నిర్వహించే పరీక్షలకు గైరు హాజరు కావటం.
11. పాఠశాలకు గైరు హాజరు కావటం.
12. బీడీలు, సిగరెట్లు తాగటం.

మంచి అలవాట్లు ఉన్నవారు సామాజిక అభివృద్ధి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటారు, ముందుంటారు. వారు జీవితంలో పట్టుదలతో స్థిరపడతారు. తల్లిదండ్రులకు, అధ్యాపకులకు, సమాజానికి గర్వకారణంగా నిలుస్తారు. రాష్ట్రం, దేశం అటువంటివారిని చూచి గర్వపడుతుంది. ఇవన్నీ మంచి అలవాట్ల ఫలితాలే.

చెడు అలవాట్లకు లోనైన వారు తల్లిదండ్రులకు, సమాజానికి భారమవుతారు. వారు పనికిమాలిన జీవితాన్ని గడుపవలసి వస్తుంది.

ఇవన్నీ అవలక్షణాలే. వీటినే చెడు అలవాట్లు అంటారు. చెడు అలవాట్లు చేసుకుంటే వాటిని వీడటం దుర్లభమే.

ప్రస్తుతం మనం కంప్యూటర్, టెక్నాలజీ కాలంలో ఉన్నాము. విద్యార్థులు అందరు కంప్యూటర్ నేర్చుకోవాలి, స్మార్ట్ ఫోను ద్వారా విద్యార్థులకు ఉపయోగపడే అనేక సమాచారాలు వస్తున్నాయి. వాటిని అంది పుచ్చుకొని మీ జ్ఞానాన్ని పెంచుకోవాలి. ఇది గూడా మీ పాఠశాల విద్యలో భాగం కావాలి. ఇంకొక విషయాన్ని గుర్తుంచుకోండి, స్మార్ట్‌ఫోనుని మంచికి మాత్రమే వాడటం మంచి అలవాటులో భాగమే!

కనుక విద్యార్థులారా మీకు ఎటువంటి భవిష్యత్తు కావాలో, మంచి అలవాట్లతో మంచి జీవితమా, చెడు అలవాట్లతో చెడ్డ జీవితమా, మీరే చిన్నతనంలోనే నిర్ణయించుకోవాలి. పెద్దయిన తరువాత మంచి అలవాట్లు అబ్బవు. చెడు అలవాట్లను మానలేరు.



# 12. విద్యార్థులు - టెలివిజన్ - లాభనష్టాలు

ఈ అంశంలో ముఖ్యంగా ఉన్నత పాఠశాల విద్యార్థులు టి.వి. చూడటం వలన కలిగే లాభనష్టాలను పరిశీలిద్దాం.

ఒకప్పుడు టెలివిజన్, ఏ.సి., ఫ్రిజ్, కారు – ఇవన్నీ విలాసవంతమైన వస్తువులుగా పరిగణించేవారు. ప్రస్తుతం అవి అవసరమైన వస్తువులుగా మారాయి.

టెలివిజన్ ప్రస్తుతము కమ్యూనికేషన్ సాధనంగా మారింది. ఉదయం నుండి అర్ధరాత్రి వరకు అనేక కార్యక్రమాలను చూడటానికి ప్రజలు అలవాటు పడ్డారు. ఈ టెలివిజన్‌లో పిల్లలకు, పెద్దవారికి, విద్యార్థులకు, స్త్రీలకు, వ్యాపారస్తులకు, వృద్ధులకు ఇంకా వివిధ కేటగిరీల ప్రజలు చూసే అనేక కార్యక్రమాలు ప్రసారమవుతున్నాయి.

**టెలివిజన్ ప్రసారం చేసే ముఖ్య కార్యక్రమాలు సంక్షిప్తంగా ఇవి –**

1. చిన్నపిల్లల కార్యక్రమాలు.
2. విద్యార్థులకు ఉన్నత పాఠశాలనుండి కళాశాల విద్యార్థుల వరకు అనేక విద్యా కార్యక్రమాలు. వివిధ కోర్సులు – ఉద్యోగావకాశాలు, వివిధ సంస్థలో ప్రవేశ కార్యక్రమాలు.
3. సీరియల్స్, సినిమాలు. సినిమాల్లో అనేక రకాలు. అశ్లీల చిత్రాలు, హారర్ చిత్రాలు, సాహసకృత్యాల సినిమాలు, సాంఘిక, పౌరాణిక, చారిత్రక సినిమాలు మొదలగునవి.
4. అన్ని వయసులవారికి సుందరమైన, మనోహరమైన, ప్రకృతి అందాలను తిలకించే దృశ్యాలు. ప్రపంచ జలపాతాలు, అడవులు, నదులు, సముద్రాలు మొదలయినవి.
5. తీర్థయాత్రలు–దేవాలయాలు, పుణ్యక్షేత్రాల దర్శనం మొదలైనవి.
6. వార్తలు, రీజనల్, దేశవిదేశ వార్తలు తెలుగు, హిందీ, ఇంగ్లీష్ – ఇంకా అనేక రాష్ట్ర భాషలలో.
7. డిస్కవరీ ఛానల్స్ – వివధ రకాల నదులు, అడవులు, జంతువులు.

8. దేశంలో అనేక విషయాల మీద చర్చా కార్యక్రమాలు, రాజకీయ చర్చలు, స్త్రీల సమస్యల మీద చర్చలు, మూఢనమ్మకాల మీద చర్చలు – ఇంకా అనేక విషయాల మీద చర్చా కార్యక్రమాలు.
9. వివిధ రకాల క్రీడా పోటీలు – క్రీడారంగ వార్తలు, ఫుట్‌బాల్, బ్యాడ్మింటన్, వాలీబాల్, క్రికెట్, కబడ్డీ – ఇంకా అనేక రకాల పోటీల వివరాలు.
10. వివిధ రకాల వ్యాపార ప్రకటనలు – స్టాక్ మార్కెట్ వివరాలు.
11. సినిమాలు గాకుండ వివిధ రకాల వినోదకార్యక్రమాలు, సంగీత కార్యక్రమాలు, పాటల కార్యక్రమాలు మొదలయినవి.
12. అనేక రకాల చిన్న పిల్లల కార్యక్రమాలు.

## టెలివిజన్ చూడటం వలన ఉన్నత పాఠశాల విద్యార్థులకు కలిగే లాభనష్టాలను చూద్దాం.

**టెలివిజన్ చూడటం వలన విద్యార్థులకు కలిగే లాభాలు :**

1. వార్తలు తెలిసికోవడం : వివిధ రకాల రాష్ట్రాల, జిల్లాల, దేశ, అంతర్జాతీయ వార్తలను వార్తాపత్రికల ద్వారాగాకుండా టెలివిజన్ ద్వారా తెలుసుకోవచ్చును. దేశంలో అనేక రీజనల్, నేషనల్ న్యూస్ ఛానళ్ళు ఉన్నాయి.
2. అనేక రకాల వినోద కార్యక్రమాలను టి.వి. ఛానళ్ళ ద్వారా చూస్తాము. పాటల కార్యక్రమాలు, పాటల పోటీలు, సంగీత కార్యక్రమాలు, తమాషాగా ఉండే నాటికలు, అనేక కార్యక్రమాలు.
3. క్రీడావార్తలు వింటాము. వివిధ రాష్ట్రాలలో, జిల్లాల్లో, దేశ, అంతర్జాతీయంగా జరిగే అనేక రకాల ఆటల పోటీలను టి.వి.ఛానళ్ళ ద్వారా చూస్తాం. ప్రపంచ ఫుట్‌బాల్, క్రికెట్, బాల్‌బాడ్మింటన్, టెన్నిస్, కబడ్డీ, వాలీబాల్, అథ్లెటిక్స్ పోటీలు – విజేత దేశాలు, వ్యక్తుల పేర్లు, తదితర విషయాలను టెలివిజన్ ద్వారా అన్ని దేశాల ప్రజలు చూస్తారు.
4. విద్యార్థులకు వివిధ రకాల విద్యా కార్యక్రమాలు ప్రచారం చేస్తాయి. పాఠశాల నుండి ఉన్నత విద్య వరకు విద్యార్థులకు సంబంధించి

కార్యక్రమాలను చూడవచ్చును. విద్యార్థులకు సంబంధించి వివిధ సంస్థల్లో ప్రవేశ కార్యక్రమాలు, వివిధ కోర్సులు, వాటి ప్రాముఖ్యత, ఉద్యోగావకాశాలు, వివిధ వివరాలతో గూడిక కార్యక్రమాలను వీక్షించవచ్చు.

5. ప్రస్తుత దేశ, రాష్ట్రాల, ప్రపంచ సామాజిక-ఆర్థిక పరిస్థితులకు సంబంధించిన కార్యక్రమాలు చూడవచ్చు. వాటిని గురించిన సమాచారాన్ని తెలుసుకోవచ్చు.

6. వ్యవసాయ సంబంధ వార్తలను తెలిసికోవచ్చును. వివిధ రకాల పంటలను, వాటి కాల పరిమితిని, ధరలను, మార్కెట్ డిమాండ్‌ను, అనేక రకాల పండ్ల తోటల సమాచారాన్ని వాటి తెగుళ్ళ నివారణోపాయాన్ని తెలుసుకోవచ్చు.

7. టి.వి.ఛానళ్ళ ద్వారా కొన్ని వ్యాపార ప్రకటనలు చూడవచ్చు. మనకు నచ్చిన, అవసరమున్న వస్తువులను ఈ ప్రకటనల ద్వారా కొనుక్కోవచ్చును. ఇళ్ళ స్థలాలు, ఇళ్ళు, పొలాల, వివాహాలకు సంబంధించి ప్రకటనలను చూడవచ్చు.

8. ప్రస్తుతం మనం ఫ్యాషన్ ప్రపంచంలో బ్రతుకుతున్నాం. డ్రస్సులు, నగలు మొదలగు వాటిలో కొత్తగా వచ్చిన మోడళ్ళను చూడవచ్చును. అవి చూసి మనకు నచ్చితే ఆయా షాపులకు వెళ్ళి కొనవచ్చును.

9. కొన్ని భక్తిఛానళ్ళు ఆధ్యాత్మిక కార్యక్రమాలను ప్రచారం చేస్తాయి. తీర్థయాత్రల కార్యక్రమంలో ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రాలు, దేవాలయాలు అవి ఏయే ప్రదేశాల్లో ఉన్నాయో, వాటికి ఎలా వెళ్ళాలో మనం తెలిసికోవచ్చు. ఈ కార్యక్రమాలు మన ఆధ్యాత్మిక నడవడికను అభివృద్ధి చేస్తాయి.

10. పిల్లలు కార్యక్రమాలు ప్రసారం చేసే ఛానళ్ళ ద్వారా పిల్లలు ఆనందాన్ని, వినోదాన్ని పొందుతారు. నీతి కథలు, లిటిల్‌కృష్ణ లీలలు, సాహసకథలు చూస్తారు.

11. డిస్కవరీ ఛానల్ ద్వారా వివిధ రకాల జంతువులను, పక్షులను చూడవచ్చును.
12. విద్యార్థుల విజ్ఞానాభివృద్ధికి టెలివిజన్ తోడ్పడుతుంది.

వాస్తవ ప్రపంచంలోగాని, మనం ఉండే ప్రదేశాల్లోగాని కొన్ని జంతువులను మనం, ముఖ్యంగా పిల్లలు విద్యార్థులు చూడటం సాధ్యం కాకపోవచ్చు.

ఉదాహరణకు – సింహాలు, పెద్దపులులు, జిరాఫీలు, అడవి దున్నలు, గేదెలు, నక్కలు, తోడేళ్ళు, నెమళ్ళు, కంగారులు – ఇంకా అనేక రకాల జంతువులు, పక్షులు. ఇవన్నీ మనం డిస్కవరీ ఛానల్ ద్వారా వీక్షించవచ్చును.

ఈ విధంగా చెప్పుకుంటే ఇంకా చాలా పేజీలు వ్రాయాలి. ఈ అంశము చివరికి చదవాలంటే విసుగు వచ్చే అవకాశమున్నది. కనుక క్లుప్తంగా చూద్దాం.

## టెలివిజన్ చూడటం వలన కలిగే నష్టాలు

ఇంతవరకు మనం టెలివిజన్ చూడటం వలన కలిగే లాభాలను పరిశీలించాము. నష్టాలను పరిశీలిద్దాము.

1. టెలివిజన్ ఎక్కువ సమయం చూస్తే, కళ్ళు దెబ్బతినే అవకాశం ఉంది. రాత్రి సమయంలో విద్యార్థులకు వారు చదువుకునే సమయం వృధా అవుతుంది. చదువు మీద శ్రద్ధ, ఏకాగ్రత తగ్గుతుంది. ఇది విద్యార్థులకు వాటిల్లే నష్టం.
2. కొందరు విద్యార్థులకు ఆ వయస్సులో విచక్షణాజ్ఞానం తక్కువ.ఏది మంచో, ఏది చెడో వారి విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించి నిర్ణయించుకోలేరు. మంచి చెడులకు తేడా తెలియదు. టి.వి.ఛానళ్ళలో చూసే చెడు దృశ్యాల ప్రభావం వారి మీద పడే అవకాశముంది.
3. సినిమా ప్రదర్శనలు, సినిమాలు చాలా వాస్తవానికి దూరంగా ఉంటాయి. అవి ఎక్కువగా చూసే విద్యార్థులకు చెడు ప్రభావం పడే అవకాశమున్నది. సినిమాలు చూసి సిగరెట్లు, బీడీలు, మద్యం సేవించాలనే కోరికలు వారిలో కలుగవచ్చు. ధనమున్నవారు వాటిని అనుసరించవచ్చు. ఇటీవల కొన్ని

నగరాల్లో పాఠశాల విద్యార్థులు కొకైన్ లాంటి మత్తుపదార్థాలకు అలవాటు పడుతున్నారనే వార్తలు వింటున్నాము. ఇవన్నీ సినిమాలు చెడు ప్రభావమే. మానభంగాలు, మర్డర్లు, మోసాలు, నేరాలు, ఘోరాలు. ఇవన్నీ కొంతమేర సినిమాల చెడు ప్రభావంగా చెప్పవచ్చు. తెలుగు సినిమాల్లో ఒక హీరో పది పన్నెండుమంది రౌడీలతో తలపడి తుదకు విజయం సాధిస్తాడు. ఇవన్నీ వాస్తవ విరుద్ధాలు. అయినప్పటికీ వాటి ప్రభావము చిన్న వయస్సులో విద్యార్థుల మీద చెడు ప్రభావాన్ని కలుగజేస్తాయి.

4. అశ్లీల, హింసతో గూడిన సీరియల్స్, సినిమాల చెడు ప్రభావం తప్పకపడే అవకాశముంది.
5. పరీక్షల సమయంలో టెలివిజన్ చూస్తే విద్యార్థుల విలువైన సమయం వృధా కావటమే గాకుండ వారు చదువవలసిన అంశాలమీద పూర్తిగా శ్రద్ధ పెట్టలేరు.
6. ప్రస్తుతం చదువుకున్న పట్టభద్రులు కొన్ని దొంగతనాలకు పాల్పడుతున్నారని వారిని అరెస్ట్ చేసి టి.వి. ఛానళ్ళలో పోలీసులు చూపిస్తున్నారు. ఇవన్నీ సీరియల్స్, సినిమాల చెడు ప్రభావంగా ప్రజలు భావిస్తున్నారు.
7. మానవ స్వభావంలో మంచి కంటె చెడుకు ఆకర్షణ ఎక్కువ, చెడు చేయాలనే కుతూహలం, ఉత్సాహం అధికము. ఎందుకంటే చెడు ద్వారా వ్యక్తుల అక్రమ కోరికలు తీరుతాయి.

టెలివిజన్ అవసరమైన వస్తువయినా దానిని పిల్లల విషయంలో తల్లిదండ్రులు ఏ మేరకు ఉపయోగించాలో, ఏయే కార్యక్రమాలు పిల్లలు చూడాలో నియంత్రణ చేయాలి.



# 13. ధైర్యగుణం - పిరికితనం

[Bravery - Timidity]

ధైర్యగుణమనేది జీవితంలో మెచ్చుకోతగ్గ గుణాలలో ఒకటి. ధైర్యమనేది పుట్టుకతో వచ్చే గుణం. అభ్యాసం ద్వారా వచ్చే గుణం కాదు. ధైర్యగుణం రెండు రకాలుగా ఉంటుంది. భౌతిక ధైర్యం, ఆత్మస్థైర్యం. భౌతికమైన ధైర్యమున్నవారు కొన్నిపనులు మాత్రమే చేయగలుగుతారు. ఆత్మస్థైర్యమున్నవారు జీవితంలో చాలా సాధించగలరు. ధైర్యమున్నవారు (ఆత్మస్థైర్యం) ఇతరులను ప్రభావితం చేయగలరు.

ప్రతివ్యక్తికి జీవించటానికి గూడా ధైర్యం కావాలి. ధైర్యం లేనివారు ఇతరుల మీద ఆధారపడతారు. ఒక నాయకుడికి, ఒక పరిపాలకునికి, ఒక ఆఫీసర్‌కి, పోలీస్‌వారికి, చివరకు ఒక సంస్థ వాచ్‌మాన్‌కి (కాపలాదారుడు) గూడా ఆ సంస్థ ఆస్తులను కాపాడటానికి ధైర్యం కావాలి. అందుకనే విలియం షేక్స్పియర్ అనే ప్రపంచ ప్రఖ్యాత ఆంగ్ల నాటక రచయిత ఇలా అంటాడు – **"ధైర్యవంతులు జీవితంలో ఒకేసారి మరణిస్తారు. పిరికివాడు ప్రతిరోజూ మరణిస్తాడు".**

పాఠశాల విద్యార్థులు చిన్నతనం నుండే సాహస గాథలు, ధైర్యవంతుల చర్యలను తెలుసుకోవాలి. ధైర్యగుణం యొక్క ప్రాముఖ్యతను గమనించాలి.

చరిత్రలో కొందరి ధైర్యసాహసాలను పరిశీలిద్దాం. మనం అనేక కార్యక్రమాల్లో విద్యాసంస్థల్లో 'వందేమాతరం' అనే గీతాన్ని ఆలపిస్తాం. ఆ గీత రచయిత బంకించంద్ర చటోపాధ్యాయ, బెంగాల్ రాష్ట్రానికి చెందిన వ్యక్తి. ఆయన చిన్నతనం నుండే మంచి ధైర్యసాహసాలుగల వ్యక్తిగా పేరొందాడు.

1. అది బ్రిటీషు ప్రభుత్వ పాలన. బ్రిటీషు ప్రభుత్వాధికారులు, వారి మద్దతుదారులు వస్తున్నారంటె గ్రామాల్లో జనం భయంతో వణికేవాళ్ళు. బ్రిటీష్ ప్రభుత్వాధికారులు, వారి మద్దతుదారులు రాత్రి వేళల్లో గంగానది మీదుగా పడవల్లో వెళ్ళి గ్రామాలను దోచుకునేవారు. ఎదురు తిరిగిన వారిని చంపేసేవారు. బంకించంద్ర చటోపాధ్యాయ నివసించే గ్రామం పేరు

"కాంతల్‌పర". ఆ గ్రామం గంగానది తీరానే ఉండేది. అందువల్ల ఆ గ్రామం ఈ సమస్యను ఎక్కువగా ఎదుర్కొనేది. అటువంటి రోజుల్లో ఒక రోజున 10 సంవత్సరాల వయస్సున్న బంకిమ్, టీచర్‌గారి చేతుల్లో ఉన్న బెత్తాన్ని గబాలున తీసుకొని రోడ్డుమీదకు వచ్చాడు. "ఘోరాసాహెబ్" వచ్చే ఆ త్రోవలో ధైర్యంగా నిలబడ్డాడు. బ్రిటీష్ అధికారులు రానేవచ్చారు. బంకిమ్ ఆ బెత్తాన్ని ఝుళిపిస్తూ వారినెదుర్కొన్నాడు. అతని ధాటికి తట్టుకోలేక వారందరూ వెనుదిరిగిపోయారు. బంకిమ్‌చంద్ర చటర్జీ ధైర్యసాహసాలకు మచ్చుతునకగా ఈ సంఘటనను చెప్పుకోవచ్చు.

2. బ్రిటీష్‌వారు భారతీయుల చేత నీలిమందుని పండించి పన్నులు కట్టించుకొని వారి ఆదాయాన్ని పెంచుకున్నారు. నీలిమందుని రంగుల పరిశ్రమలో వాడేవారు. "మోరెల్" అనే బ్రిటీష్ అధికారి మూడువందలమంది కండబలం కలిగిన వ్యక్తులతో, తుపాకులు, గుణ్ణాలు మొదలగు యుద్ధసామాగ్రితో నియంతగా పరిపాలన సాగిస్తున్నాడు. అతని అనుచరగణం గ్రామాలు మీద పడి దోపిడీలు చేసేవారు. అడ్డువచ్చినవారిని చంపి, పోలీసులకు లంచాలు యిచ్చి కేసులు మాఫీ చేయించుకుని, ప్రజలను భయభ్రాంతులకు గురి చేసేవారు. ఈ విధంగా "మోరెల్" ప్రజాకంటకుడిగా తయారయ్యాడు. ఆయన పాలించే ప్రాంతానికి "మోరెల్‌గంజి" అనే నామకరణం కూడా చేశాడు. 20 సంవత్సరాల వయస్సులో డిప్యూటి మేజిస్ట్రేట్‌గా వచ్చిన బంకిమ్‌ను చూసి "మోరెల్" ఎగతాళిగా నవ్వాడు.

ఆ ప్రాంతంలో "బార్దాలి" అనే గ్రామం ఉంది. ఆ గ్రామస్తులు ఏకతాటిపై ఉండి మోరెల్ ఆదేశాలను ఖాతరు చేసేవారు కాదు. వారందరిది ఒకే మాట, ఒకే బాట. ఒక రాత్రి "బార్దాలి" గ్రామాన్ని నాశనం చేయవలసిందిగా తన అనుచరులను ఆదేశించాడు మోరెల్. వారు ఆ గ్రామాన్ని దోచుకొని అర్ధరాత్రి తగులబెట్టారు. మోరెల్ మిత్రులైన లాంగ్‌ఫుట్, హిల్లరీ ఈ కేసుని సమీక్షించారు. ఈ విషయం తెలుసుకున్న బంకిమ్ మోరెల్‌కి ఒక వారెంటు జారీ చేశాడు. మోరెల్ బంకిమ్‌కి లంచమివ్వజూపాడు, భయపెట్టాడు.

కానీ బంకిమ్ లంచానికి లొంగలేదు, భయపడలేదు. మోరెల్ మిత్రులైన లాంగ్‌ఫుట్, హిల్లరీ బొంబాయినుండి పడవలో ఇంగ్లండు పారిపోవటానికి ప్రయత్నించగా వారిని మారువేషంలో ఉన్న బంకిమ్ పోలీసులకి పట్టించి అరెస్టు చేయించాడు. బ్రిటీషు వారికి భయపడి ఈ కేసులో సాక్ష్యం చెప్పడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. ఈ కేసుని మరొక మేజిస్ట్రేట్‌కి అప్పజెప్పి బంకిమ్ సాక్ష్యం చెప్పి వారికి శిక్షపడేటట్టు చేశారు. బ్రిటీష్ ప్రభుత్వ పాలనలో వారి అనుచరులకు శిక్షపడినందులకు దేశం ఆశ్చర్యపడ్డది. బంకిమ్ ధైర్యసాహసాలను దేశప్రజలు అభినందించారు.

3. భారతీయులు కల్నల్ ఉన్న బజారుగుండా వెళ్ళగూడదు. నిషేధమున్నది. ఒక రోజు మేజిస్ట్రేట్ అయిన బంకిమ్ ఆ వీధిన పల్లకిలో వెళ్ళుచుండగా కల్నల్ పల్లకి డోర్ మీద గట్టిగా కొట్టగా, వెంటనే బంకిమ్ పల్లకీ దిగి నీవెవరివని కల్నల్‌ను ప్రశ్నించారు. ఆయన బంకిమ్‌ను లాగి రోడ్డు ప్రక్కన పడవేశారు. బంకిమ్ అతనిమీద కేసు పెట్టాడు. ఒక బ్రిటీష్ వ్యక్తిమీద ఒక భారతీయుడు కేసు పెట్టడమంటే ఆ రోజుల్లో సామాన్యమైన విషయం కాదు. బంకిమ్‌చంద్ర ధైర్యసాహసాలకు దేశం ఆశ్చర్యపోయింది. ఈ కేసుని వినటానికి దూర ప్రాంతాలనుండి జనం వచ్చేవారు. క్షమాపణ చెప్పవలసిందిగా కోర్టు కల్నల్‌ను ఆదేశించింది. తరువాత ఆ వీధిని పబ్లిక్ రహదారిగా మార్చారు. ఇది కేవలము బంకిమ్ ధైర్య సాహసాల మూలంగా జరిగింది.

భారత స్వాతంత్రోద్యమ చరిత్ర ప్రపంచ చరిత్రలోనే ఒక అపూర్వమైన ఘట్టం. ఇది సుదీర్ఘకాలం సాగింది. భారతదేశం నలుమూలల నుండి దేశభక్తిని చాటి అనేకమంది నాయకులు వారి ధైర్యసాహసాలను ప్రదర్శించారు. వారందరిని గురించి వ్రాయాలంటే వందపేజీలు కూడా చాలవు. అది ఈ అంశములో సాధ్యం గాదు. గనుక కొన్ని ఉదాహరణలను మాత్రమే చెప్పుకోవాలి. అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, సుభాష్‌చంద్రబోస్ ఎంతో ధైర్యసాహసాలను ప్రదర్శించారు. బ్రిటీష్‌వారి మీద ధైర్యంతో పోరాడారు.

గుజరాత్ రాష్ట్రంలోని రైతు కుటుంబంలో జన్మించిన సర్దార్ వల్లభాయి పటేల్ మంచి నాయకత్వపు లక్షణాలు, ధైర్యసాహసాలున్న వ్యక్తి. బ్రిటీష్ ప్రభుత్వం మీద పన్నుల నిరాకరణోద్యమాన్ని విద్యార్థి దశలోనే నడిపారు. జైలుకెళ్ళారు. కాని భయపడలేదు. తల్లి, సోదరి మరణించేనాటికి జైలులో ఉన్నారు. బ్రిటీష్‌వారు విధించిన షరతులకు అంగీకరించక వారి దహన కార్యక్రమాలకు గూడా హాజరుగాని ధైర్యశాలి. తాను వృత్తిరీత్యా న్యాయవాది. ఒక పర్యాయము కోర్టులో ఒక కేసు వాదిస్తుండగా ఒక టెలిగ్రాం వచ్చింది. అందులో తన భార్య మరణవార్త ఉంది. ఆ టెలిగ్రామ్‌ను తన కోటులో పెట్టుకొని కేసు వాదనను పూర్తి చేశాడు. అ తరువాత సన్నిహితులు టెలిగ్రాంను గురించి అడుగగా అందులో నా భార్య మరణవార్త ఉందని నెమ్మదిగా, కంగారు పడకుండా చెప్పాడు. అంతటి ధైర్యవంతుడు పటేల్. సంస్థానాల విలీనీకరణ, ఐ.ఏ.యస్., ఐ.పి.యస్. ఎకాడమీ ఆయన ధైర్యంగా చేసిన పనులే.

జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశం ప్రథమ ప్రధాని. ఆయన గూడా స్వాతంత్రోద్యమంలో 12 సంవత్సరాలు తీహార్ జైల్లో ధైర్యంగా గడిపి కొన్ని పుస్తకాలను వ్రాసి బ్రిటీష్ ప్రభుత్వానికి ధన్యవాదాలు తెల్పిన వ్యక్తి.

మన దేశ ప్రథమ విద్యాశాఖ మంత్రిగా పనిచేసిన 'మౌలానా అబుల్ కలామ్ అజాద్' గారు గూడా జైలులో ఉండగా తన భార్య చనిపోతే బ్రిటీష్ ప్రభుత్వాన్ని శెలవు అడగటానికి నిరాకరించి, ఆమెను స్వర్గంలో కలుస్తానన్న ధైర్యవంతుడు. సంగీత, సాహిత్య ఎకాడమీలు ఆయన పెట్టినవే.

మహాత్మాగాంధీగారిని జాతిపిత అంటాము. ఆయన చాలా బక్కగా ఉండేవారు. కానీ గొప్ప ధైర్యశాలి. ఆత్మధైర్యము మెండుగా, దండిగా ఉన్న వ్యక్తి అయినందువల్లే అనేక ఉద్యమాలకు, దేశ స్వాతంత్ర్య సమరంలో ముందుండి నడిపారు.

ధైర్యగుణమున్నవారికి అది వారికేగాదు, సంఘానికి, దేశానికి ఉపయోగపడుతుంది. ధైర్యగుణమున్నవారు ఎటువంటి కష్టాలనైనా ఎదుర్కొని విజయాలు సాధిస్తారు. ధైర్యగుణం విజయానికి సంకేతం. ధైర్యగుణమున్నవారికి

శత్రువులు గూడా భయపడతారు. శత్రుభయముండదు.

కనుక విద్యార్థులారా! మీరు మీ భావి జీవితంలో అనేక కష్టసుఖాల నెదుర్కోవాలి. కష్టాలను ధైర్యంగా ఎదుర్కోవడానికి మానసికంగా సిద్ధంగా ఉండండి.

ఈ అంశము 'ధైర్యము–పిరికితనం'. ఈ రెండు గుణాలు ఒకదానికొకటి వ్యతిరేక గుణాలు. మనం ఇంతవరకు ధైర్యాన్ని గురించి వివిధ ఉదాహరణలతో పరిశీలించాము. ఇప్పుడు పిరికితనాన్ని గూర్చి పరిశీలిద్దాం.

పిరికితనమనే లక్షణము భయము, ధైర్యం లేకపోవుట. పిరికివారిని ఎవ్వరూ ఇష్టపడరు. సమాజము మెచ్చుకోదు, ఆదరించదు. పిరికితనాన్ని మనం విడనాడాలి. అందుకే ఆంగ్ల నాటక రచయిత పిరికివాళ్ళు రోజూ మరణిస్తారన్నాడు. పిరికివారు జీవితంలో ఏమీ సాధించలేరు. ధైర్యముగల వ్యక్తులే కార్యసాధకులుగా చరిత్రలో మిగులుతారు. ఒక పిరికివాడు తన చుట్టూ ఉన్నవారిని కూడా పిరిగివారిగానే తయారు చేసే అవకాశమున్నది. కానీ ధైర్యవంతుని చూచి తన చుట్టూ ఉన్నవారు కూడా ధైర్యంగా ఉంటారు, ధైర్యంగా బ్రతుకగలరు.

**ఒక చిన్న ఉదాహరణను పరిశీలిద్దాం.** జొన్న కర్ర ఎండిన ఆకుని వగుడాకంటారు. చీకటిలో కొంతమంది నడిచేటపుడు వగుడాకుని చూసినా, తాడునిగాని, గుడ్డపీలకనుగాని చూసినా సర్పమని భ్రమించి భయపడతారు. అక్కడ ఆగి నిశితంగా పరిశీలిస్తే అది చలనం లేకుండా పడి ఉంటే అది ఒగుడాకో, తాడో, గుడ్డపీలికో అయి వుంటుంది. అది నిజంగా సర్పమైతే మన అడుగుల శబ్దం వింటే అది అక్కడ ఉండదు. ఎందుకంటే పాముకి గ్రహణ శక్తి అధికము. తాడుని పాము అని భ్రమించటమే మన పిరికితనం, పిరికితనానికి నిదర్శనం. అట్లే ఒక తెల్లటి ఖాళీ మందుగోతం చీకటిలో మనిషిలలాగా కనిపించవచ్చు. మనం దొంగ అనుకొని భయపడతాం. దొంగవాడైతే మరొక మనిషిని చూస్తే అక్కడ నుండి పారిపోతాడుగాని, నిశ్చలంగా ఉండలేదు. ఇదిగూడ మన భ్రాంతి, భయమే, పిరికితనమే.

అనేక రకాల వ్యక్తులకు లోకంలో అనేక రకాల భయాలుంటాయి. అవన్నీ పిరికితనం యొక్క రూపాలే. కొందరికి శత్రుభయం. వారికి శత్రువులను ఎదుర్కొనే ధైర్యం ఉండదు. శత్రువులు గూడా పిరికివారినే భయపెట్టగలిగేది. ధైర్యవంతులనేమి చేయలేరు.

మరికొందరికి దొంగల భయం. నగదు, బంగారాన్ని ఎక్కువగా ఇంట్లో పెట్టుకొని రాత్రులందు దొంగలొస్తారేమో అని భయపడుతుంటారు. అది గూడా వారి భ్రమే. ఆ భ్రమే పిరికితనం.

ఇంకా దొంగతనం చేసినవారు, అన్యాయం చేసినవారు, కాని పనులు చేసినవారు సాధారణంగా భయపడుతుంటారు. ఈ భయం గూడా వారి చర్యల వల్లే. ఇవి గూడా పిరికి చర్యలే. అందుకే వారు భయపడతారు.

ఒక పబ్లిక్ పరీక్షలో ఒక విద్యార్థి కాపీ తెస్తే దాన్ని ధైర్యంగా వ్రాయలేడు. బిక్కుబిక్కుమంటూ, భయపడుతూ ఉంటాడు. నిశితంగా విద్యార్థులను పరిశీలించే పర్యవేక్షకుడు ఎవరి దగ్గర కాపీ ఉందో తెలుసుకుంటాడు, కనిపెడతాడు. కాని ఈ విషయం పట్టుబడ్డాక మాత్రమే విద్యార్థికి తెలుస్తుంది.

ఈ విధంగా లోకంలో అనేక రకాల పిరికివారుంటారు. కనుక విద్యార్థులారా మీరు మాత్రం పిరికితనాన్ని వీడి కాని పనులకు దూరంగా ఉండి కష్టపడి ధైర్యంగా బ్రతకటానికి బాటలు వేసుకోవాలని ఆశిస్తున్నాను.



**బంకిమ్‌చంద్ర చటర్జీ**

# 14. త్యాగము - స్వార్థము

[Sacrifice - Selfishness]

"త్యాగము" అనే గుణము మూడక్షరాలైనా చాలా పెద్ద గొప్ప మాటగా చెప్పవచ్చు. "స్వార్థము" అనే పదం గూడా మూడక్షరాలే. కాని అది స్థాయిని బట్టి చెడ్డగుణంగాను, అతి దుర్మార్గమైన, నీచమైన గుణంగాను అభివర్ణిస్తారు.

అసలు "త్యాగము" అంటే ఏమిటి? ఎవరు త్యాగ గుణాన్ని కలిగి ఉంటారు? త్యాగం వల్ల ఎవరికి లాభం, ప్రయోజనం చేకూరుతుంది? త్యాగం చేసేవారిని చరిత్ర ఏవిధంగా చూస్తుంది? – ఇత్యాది అంశాలను పరిశీలిద్దాం.

ఒక వ్యక్తి తన కుటుంబం కోసం, ఒక కుటుంబం దేశం కోసం త్యాగం చేయాలంటారు. "త్యాగ"మనగా ఒక వ్యక్తి తన సమయాన్ని, ధనాన్ని, ఆస్తిని, అవసరమైతే ప్రాణాన్ని సైతం లెక్క చేయకుండ తన గ్రామం కోసం, తన రాష్ట్రం కోసం, తన దేశం కోసం అర్పిస్తే దానిని త్యాగమంటారు. అలా చేసిన వ్యక్తిని లేక వ్యక్తులను త్యాగశీలి, త్యాగశీలులంటారు. ఏ గ్రామంలోనైనా, రాష్ట్రంలోనైనా, దేశంలోనైనా త్యాగశీలురు తక్కువ సంఖ్యలో ఉంటారు. కానీ భారతదేశ అదృష్టమేమిటంటే ఇది త్యాగధనుల దేశం. త్యాగశీలురకు, త్యాగమూర్తులకు, త్యాగధనులకు ఈ దేశంలో కొదువలేదు. ఇది భారతదేశ ప్రత్యేకత.

భారతదేశం అనాదినుండి త్యాగానికి పెట్టింది పేరు. బ్రిటీష్ పాలన సుదీర్ఘ కాలం భారతదేశంలో కొనసాగింది. భారత స్వాతంత్రోద్యమ చరిత్ర దేశ చరిత్రలో మహోన్నతమైన, అపూర్వమైన ఘట్టం. ఎందరో మహానుభావులు దేశ స్వాతంత్ర్యం కోసం త్యాగాలు చేశారు. దానికి పూర్వం దేశంలో జాతీయోద్యమం జరిగింది. జాతీయోద్యమం అనగా ఈ దేశం నాది, మాది అని దేశ ప్రజలలో పూర్తి అవగాహనను కలిగించటం. దేశం కోసం పరాయి పాలన మీద పోరాటం చేయటం కోసం దేశ ప్రజలను సమాయత్తం చేయటం, వారిలో దేశభక్తి భావాలను పెంపొందించటం.

భారతదేశానికి స్వాతంత్ర్యం రావటానికి నాంది జాతీయోద్యమం. దాని పితామహుడు, యుగకర్త సురేంద్రనాథ్ బెనర్జీ. ఆయన ఆ రోజుల్లో బ్రిటీష్ వారు ఇంగ్లండు దేశంలో నిర్వహించే ఐ.సి.యస్. (ఇండియన్ సివిల్ సర్వీస్) పరీక్ష ఉత్తీర్ణుడైనప్పటికి బ్రిటీషు ప్రభుత్వం వారు ఆయన వయస్సును సాకుగా చూపి ఆయన పేరును ఉత్తీర్ణుల జాబితానుండి తొలగించి ఆయన వివరణకు గూడా తొలుత అవకాశమివ్వలేదు. ఆ వివాదం సద్దుమణిగిన తర్వాత ప్రొబేషనర్‌గా చేరటానికి అనుమతిచ్చి రెండు సంవత్సరాలలో పూర్తి చేయమనగా ఆయన ఒక్క సంవత్సరంలోనే పూర్తి చేయగా "సదర్‌లాండ్" జిల్లా మేజిస్ట్రేట్ క్రింది అసిస్టెంట్ మేజిస్ట్రేటుగా నియమించారు. స్వల్ప కారణం చేత ఆయనను ఉద్యోగం నుండి తొలగించారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌గారు ఉద్యోగం ఇచ్చి కళాశాలలో ఆయనకు ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా నియమించి నెలకు రూ. 200ల జీతం ఇచ్చారు. ఆయన మంచి వక్త, అనర్గళంగా మాట్లాడగలరు.

దేశభక్తి భావంగల యువతను తయారుచేసి బ్రిటీష్ ప్రభుత్వం యొక్క దుశ్చర్యలను ప్రజలకు తెలియజేయాలని దేశంలోని అన్ని ముఖ్య నగరాలలో తిరిగి తన ఉద్వేగపూరితమైన ప్రసంగాలతో ప్రజలను, ముఖ్యంగా యువతను బాగా ఆకర్షించి జాతీయ ఐక్యతను సాధించారు. తన జీవితాన్ని జాతి ఐక్యత సాధన కోసం, జాతీయోద్యమం కోసం త్యాగం చేసిన ఫలితంగా స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైనది.

భారత స్వాతంత్రోద్యమం ప్రపంచ చరిత్రలోనే విలక్షణమైంది. అహింసా మార్గం ద్వారా భారత స్వాతంత్ర్యం సిద్ధించింది. ఈ ఉద్యమంలో అనేకమంది భారతీయులు త్యాగం చేశారు. వారి త్యాగ ఫలితమే నేడు మనం అనుభవిస్తున్న స్వాతంత్ర్యం.

**కొందరు మహా నాయకుల త్యాగాలను పరిశీలిద్దాం :**

**1. జవహర్‌లాల్ నెహ్రూ :** భారత మొదటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ. ఈయన తన జీవితంలో దేశ స్వాతంత్ర్యం కోసం 12 సంవత్సరాలు తీహార్ జైలులో జీవితం గడిపాడు.

**2. మహాత్మాగాంధి :** అహింసా మార్గాన్ని ఎంచుకొని, రక్తపాత రహితంగా ఉద్యమాలు నడిపి, తన అహింస అనే ఆయుధంతో దేశ స్వాతంత్ర్యానికై బ్రిటీష్ ప్రభుత్వం మీద ఉద్యమాలను నడిపి జైలుపాలయ్యారు.

**3. సరోజినీనాయుడు :** కవయిత్రి, అద్భుతమైన స్పీకరు. తన ప్రసంగాలతో దేశాన్ని ఉద్రూతలూగించి ప్రజల హృదయాలను ఆకర్షించి వారిని స్వాతంత్రోద్యమ కార్యోన్ముఖులను గావించారు. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత హైదరాబాద్ అబిడ్స్ సమీపంలో ఉన్న తన నివాసగృహమైన "గోల్డెన్ త్రెషోల్డ్" ను జాతికి అంకితమిచ్చారు. అది ఒక ఎకరం స్థలంలో ఉన్నది. దాని విలువ ఈ రోజుల్లో వంద కోట్ల రూపాయలకు పైనే ఉంటుంది.

**4. డా॥ అనీబిసెంట్ :** ఈమె జన్మస్థలం ఐర్లండు. కానీ భారతదేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన వ్యక్తి. భారతదేశాన్ని తన దేశంగా చెప్పుకొని, ఈ దేశంలో నివశించి కాశీ నగరంలో ఒక బాలికల పాఠశాలను స్థాపించి, చివరకు దానిని కాశీ విశ్వవిద్యాలయంగా మార్చి, మహాత్మాగాంధిగారిచేత శంకుస్థాపన చేయించి, పండిట్ మదనమోహన మాలవీయగారికి అప్పగించింది. వారు ఆ విశ్వవిద్యాలయ అభివృద్ధికి విశేష కృషి సల్పారు. ప్రస్తుతం భారతదేశంలో పేరెన్నికగన్న విశ్వవిద్యాలయాలలో అది ఒకటి. డా॥ అనీబిసెంట్‌గారు ఈ దేశానికి చేసిన సేవలు, త్యాగాలు మరువలేనివి.

లోకమాన్య బాలగంగాధర్ తిలక్, లాలా లజపతిరాయ్, గోపాలకృష్ణ గోఖలే, సర్దార్ వల్లభాయిపటేల్, మౌలానా అబుల్‌కలామ్ అజాద్, లాల్‌బహదూర్ శాస్త్రి, ఇంకా అనేకమంది ఈ దేశం కోసం త్యాగాలు చేశారు.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఒకప్పుడు మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఉండేది (1953 వరకు). ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం అమరజీవి పొట్టిశ్రీరాములు (నెల్లూరు జిల్లా) ఆత్మత్యాగం చేశారు. వారి త్యాగ ఫలితంగా ఆనాడు ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది.

మనందరికి గుంటూరు జిల్లా, మాచర్ల పట్టణానికి సమీపంలో ఉన్న నాగార్జునసాగర్ ప్రాజెక్టుని గురించి తెలుసు. ఈ ప్రాజెక్టు కొరకు త్యాగం

చేసిన వ్యక్తి "ముక్త్యాలరాజా"గారు, జగ్గయ్యపేట. ప్రాజెక్టు స్థల విషయమై చూడటానికి కేంద్ర కమిటీవారు రావడానికి రోడ్డు లేదని విముఖత చూపగా తన సొంత డబ్బు వెచ్చించి రోడ్డు వేయించి కమిటీని తెచ్చారు. ఆ తరువాత కూడా ఆ రిపోర్టు బుట్టదాఖలు కాగా, బయటకు తీయించి, దానికోసమై విశేష కృషి చేయగా, చివరకు ఆనాటి భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు శంకుస్థాపన చేశారు. ఆ ప్రాజెక్టు ద్వారా లాభం పొందే ప్రాంత ప్రజలు మొదటగా ఆయనకు రుణపడి ఉండాలి. అంతటి త్యాగధనుడు ముక్త్యాలరాజాగారు.

ఈ దేశంలో పాలకులు ఏ ప్రాంతానికి అన్యాయం చేసినా త్యాగం చేసే నాయకులు అన్యాయం మీద తిరుగుబాటు చేసే ప్రజలు సదా సిద్ధంగా ఉంటారని కేంద్ర, రాష్ట్ర నాయకులు మరువగూడదు.

విద్యార్థులారా త్యాగగుణం వల్ల పెద్ద పెద్ద కార్యాలు సాధించబడతాయి. స్వార్థ గుణం వల్ల వ్యక్తి ప్రయోజనాలే ముఖ్యం. మీరు త్యాగాలు చేయకపోయినా మీ పరిధిలో ఇతరులకు సహాయం చేయడానికి, దేశాభివృద్ధికి, మొక్కలు నాటడానికి కొంత మీ సమయాన్ని, మీ శక్తిని వినియోగించండి.

చివరగా ఈ అంశంలో లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానాలను మరలా చూద్దాం:

**1. త్యాగం అంటే ఏమిటి?**

జ. త్యాగమనేది మానవగుణాల్లో ఉత్తమగుణం. మనం మన సమయాన్ని గాని, ధనాన్ని గాని, ఆస్తినిగాని, మన గ్రామం, రాష్ట్రం, దేశం కోసం ఖర్చు చేస్తే, దేశం కోసం, రాష్ట్రం కోసం మన ప్రాణాలు సైతం అర్పించడానికి సిద్ధపడి, పాలకులు పెట్టే కష్టాలను అనుభవించడానికి మానసికంగా సిద్ధపడి అవసరమైనప్పుడు వాటిని అనుభవించి మన కార్యసాధనలో విజయం సాధించినా, సాధించకపోయినా – దానిని త్యాగమంటారు.

**2. త్యాగం వల్ల ఎవరికి లాభం ?**

జ. త్యాగం వల్ల దేశానికి, సంఘానికి, రాష్ట్రానికి లాభం, ప్రయోజనం చేకూరుతుంది.

**3. త్యాగం చేసేవారిని చరిత్ర ఏ విధంగా చూస్తుంది?**

జ. త్యాగం చేసేవారిని దేశభక్తులుగా, త్యాగధనులుగా చరిత్ర గుర్తిస్తుంది.

చివరగా ప్రతి వ్యక్తి ఒక కన్నతల్లి బిడ్డే. తల్లిని త్యాగమూర్తిగా చూడాలి. మనలను పదినెలలు కడుపులో మోసి, కని, పెంచుతుంది తల్లి. పిల్లలకు ఏదైనా కష్టం వచ్చినా, జ్వరం వచ్చినా, అపాయం జరిగినా తల్లి ప్రాణం తల్లడిల్లుతుంది. మనకు సరిగా చదువురాకపోయినా, మనం సరిగా చదవకపోయినా, మంచి పిల్లలుగా ఎదగకపోయినా తల్లి పిల్లలను గురించే ఆలోచిస్తుంది. పిల్లల శ్రేయస్సే తన శ్రేయస్సుగా భావిస్తుంది. పిల్లల కోసం ఎటువంటి త్యాగాలకైనా సిద్ధపడుతుంది. కనిపించని దేవతలు లేక దేవుళ్ళు మనం మొక్కినా వరమిస్తారో లేదో మనకు తెలియదు. కాని తల్లి మనం అడగకుండానే మన అవసరాలు తీర్చి, తన దీవెనలిచ్చే ప్రత్యక్ష దేవత, త్యాగమూర్తి.

**త్యాగ గుణానికి మరొక ఉదాహరణను పరిశీలిద్దాం.**

"మహాభారతం" అరణ్యపర్వములో శిబి చక్రవర్తి వృత్తాంతము గలదు. ఒక రోజు ఇంద్రుడు, అగ్ని శిబి యొక్క మహాగుణాలను పరిశీలింపదలచి ఇంద్రుడు 'డేగ'గాను, అగ్ని 'కపోతము'గాను (పావురం) మారు వేషములలో శిబివద్దకు వచ్చిరి. డేగ తన ఆహారము కొరకు పావురమును వెంటాడగా పావురము శిబిని శరణుజొచ్చెను. డేగ శిబితో "అయ్యా! నేను మిక్కిలి ఆకలితో ఉన్నాను. నాకు ఈ పావురము 'వేదవిహితమైన ఆహారము'. దీనిని నాకిమ్మ"ని అడుగగా శిబి డేగతో ఇట్లనెను. **"నీ ఆకలి తీర్చుటకు నేను ఇతర జంతువుల, పక్షుల మాంసాన్ని ఆహారంగా పెడతాను"** అన్నాడు. అందుకు డేగ అంగీకరించలేదు. అదే సమయంలో పావురము శిబితో శరణుజొచ్చినవారిని రక్షించుట ధర్మమనెను. అందుకు శిబి పావురం బరువుకి సరితూగు తన శరీర మాంసాన్నిస్తానని డేగతో అనగా అందుకు డేగ అంగీకరించెను. శిబి తన శరీర మాంసాన్ని కోసి కాటాలో పెట్టగా అది పావురము యొక్క బరువుకి సరితూగలేదు. చివరకు శిబి తానే స్వయంగా కాటాలో కూర్చొనగా ఇంద్రాగ్నులు

మారువేషములు విడిచి వారి నిజస్వరూపములో శిబికి దర్శనమిచ్చిరి. వారు శిబి శౌర్య, ధైర్య, త్యాగ గుణాలను మెచ్చుకొనిరి. ఒక పక్షి ప్రాణాన్ని కాపాడటానికి తన ప్రాణాన్ని త్యాగం చేయటానికి సిద్ధపడ్డ శిబి త్యాగ నిరతికిది గొప్ప ఉదాహరణ. చూచితిరా! త్యాగము వలన ఇతరులకు ఎంత మేలు జరిగినదో! ఇది త్యాగగుణం యొక్క విశిష్టత, గొప్పతనం.

**గమనిక :** ఈ అంశము "త్యాగము–స్వార్థము" – త్యాగాన్ని గురించి వివిధ ఉదాహరణలతో పరిశీలించాం. స్వార్థగుణాన్ని గురించి ఇంతకు ముందు వ్రాసిన "స్వార్థం–నిస్వార్థం" అనే అంశంలో చూచాము. ఈ అంశములోని "స్వార్థము" అనే భాగానికి ఆ అంశాన్ని చూడాలని తెలియజేస్తున్నాను.



# 15. మానవత్వం - దానవత్వం

[Humanity - Inhumanity]

"మానవత్వం పరిమళించే మంచి మనిషికి స్వాగతం" అన్నారు ఒక సినీ రచయిత. అసలు మానవత్వం అంటే ఏమిటి? మానవత్వం కలిగి మనందరం జీవిస్తున్నామా? మానవత్వం పరిధి ఏమిటి? మానవత్వం ప్రతి వ్యక్తి కలిగి ఉండకపోతే సమాజానికి కలిగే నష్టం ఏమిటి? ఎటువంటి సమాజాన్ని, భవిష్యత్తుని మానవుడు ఆశిస్తున్నాడు? మానవత్వపు విలువలు ప్రస్తుత సమాజంలో అవసరమా? మానవత్వం, మానవత్వపు విలువలు లోపిస్తే సమాజం ఎలా ఉంటుంది? ఇత్యాది ప్రశ్నలకు సమాధానమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.

ఒక వ్యక్తి ప్రాణాపాయ స్థితిలో, నిస్సహాయ స్థితిలో ఉన్నప్పుడు ఆ వ్యక్తి మీద కరుణ జాలి చూపించటం, ఆ వ్యక్తిని ఆదుకోవటం, సహాయం చేయటమే మానవత్వమైన చర్యగా పరిగణించబడుతుంది. మానవత్వాన్ని తెలియజేసే చర్యలు ఇంకా అనేక రూపాల్లో, అనేక విధాలుగా ఉంటాయి. మానవ జీవితం అశాశ్వతం. పేదరికం, ముసలితనం, ప్రమాదాలు, ప్రాణాపాయ స్థితి, నిస్సహాయ స్థితి ఇంకా అనేక రకాల దుర్ఘటనలు జీవితంలో చోటు చేసుకుంటాయి. వీటన్నిటినుండి అందరూ బయటపడలేరు. అప్పుడప్పుడూ సమాజంలో ఉన్న ఇతర వ్యక్తుల సహాయ సహకారాలు కూడా ప్రతి వ్యక్తికి ఏదో ఒక సమయంలో అవసరమవుతాయి.

తోటి మానవుడు కష్టాల్లో, ఆపదలో, ప్రమాదంలో, క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొని నిస్సహాయుడై ఉన్న సమయంలో వారిమీద జాలి, కరుణ చూపి మన చేతనైన సహాయాన్ని వారికందించే అలవాటు చేసుకోవటమే మానవత్వపు చర్య. కొన్ని క్రూర జంతువుల కన్నా మానవ మృగాలే అత్యంత ప్రమాదకరమైవని అప్పుడప్పుడూ కొందరు అంటుంటారు. ఇతరుల యొక్క కష్టాలను, అపాయాలను, బలహీనతలను, నిస్సహాయ స్థితిని, దురదృష్టాన్ని

ఆసరాగా తీసుకొని వారి కోరికలు తీర్చు కోవటం లబ్ది పొందడమనేది నిజంగా క్రూరమృగాల పనే మరి. సంఘంలో మానవ మృగాల సంఖ్య పెరిగితే సంఘానికే ప్రమాదము. మంచిని, మానవత్వపు విలువలని పెంచి పోషించితే మంచి సమాజ స్థాపనకు పునాదులు వేసినవార మవుతాం.

మానవత్వపు విలువలను కేవలం డబ్బుతో ముడిపెట్టి చూడకూడదు. ఏ సమాజంలో అయితే డబ్బుకు ప్రాధాన్యత పెరిగి ధన సంపాదనే ధ్యేయంగా ఆ సమాజంలో వ్యక్తులు పనిచేస్తారో అక్కడ మానవత్వపుటి లువలు సన్నగిల్లుతాయి.

మానవత్వాన్ని, మానవత్వపు విలువలని నిత్య జీవితంలో జరిగే అనేక సంఘటనల ద్వారా విశ్లేషించుకోవచ్చు. ఉదాహరణకు ఒక పేదవాడు అనారోగ్యంతో బాధపడుతూ, చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్నాడు. ఆ సమయంలో అతడు నిస్సహాయ స్థితిలో ఉన్నాడు. అతని దగ్గర ధనం లేదు. కొందరు కలసి అతనిని హాస్పిటల్‌లో చేర్చారు. కానీ దురదృష్టవశాత్తూ అతడు మరణించాడు. చనిపోయిన తరువాత ఐదువేల రూపాయల బిల్లు వేసి డాక్టరు గారు ఆ బిల్లు చెల్లించకపోతే శవాన్ని తాకడానికి వీల్లేదని భీష్మించుకొని కూర్చుంటే, ఆ డాక్టరుగారికి కనీస మానవత్వం లేదని, ఆ సమయంలో తన చుట్టూ ఉన్నవాళ్ళంతా అంటారు.

ఒక వ్యక్తి బ్యాంకునుండి కొంత ధనాన్ని డ్రా చేసి బ్యాగులో పెట్టుకొని రోడ్డు మీద వెళుతుంటే అది గమనించిన బలవంతుడైన యువకుడొకడు కొంత దూరం పోయాక, ఆ బ్యాగ్‌ని బలవంతంగా లాక్కొని, రోడ్ మీద అందరూ చూస్తుండగా కత్తితో పొడిచి పరిగెత్తుతుంటే, మనకెందుకులే మన బ్యాగ్ కాదు కదా! అని మౌనంగా ఎవరి దారిన వారు వెళితే, వారిలో మానవత్వం నిద్రాణంలో ఉన్నదన్నమాట. అలా కాకుండా, దొంగ! దొంగ! అని అరచి రోడ్డుమీద వారిలో కొంతమంది పరుగెత్తి అతడ్ని పట్టుకొని, అతని చేతిలోని క్యాష్‌బాగ్‌ను తీసుకొని నేరస్తుణ్ని పోలీసులకు అప్పగించి, గాయపడ్డ వ్యక్తిని హాస్పిటల్‌లో చేరిస్తే, అది మానవత్వపు చర్యగా పరిగణించాలి.

కొన్ని ఆర్.టి.సి. బస్సులలో కొంతమంది కండక్టర్లు, ప్రయాణీకులు మానవత్వాన్ని ప్రదర్శించిన సందర్భాలున్నాయి. వారిని నిజంగా అభినందించాలి. వారి వారి గమ్యస్థానాల్లో ప్రయాణికులలో కొందరు హడావుడిగా దిగిపోతు వారి సూట్‌కేసులు, హ్యాండ్‌బ్యాగులు మర్చిపోయి వెళతారు. ప్రక్కన కూర్చున్న తోటి ప్రయాణీకులు వారు దిగేటప్పుడు ఈ విషయాన్ని గమనించి, వారి అడ్రసు ఉంటే వారికి అందజేస్తారు. లేకపోతే కండక్టరుగారికీయగా, ఆయన దానిని యజమానికి అందజేసిన సందర్భాలు ఉన్నాయి. ఇది నిజంగా మానవత్వాన్ని ఇనుమడింపజేసే చర్యగా భావించవచ్చు.

ఒక నిరుద్యోగి వెళుతూ సిటీ బస్సు హడావుడిగా దిగి తన సర్టిఫికెట్ ఉన్న ఫైల్ మర్చిపోయారు. అతని తోటి ప్రయాణికుడు తన గమ్యస్థానంలో ఈ విషయాన్ని గమనించి, ఆ ఫైల్‌కి ఉన్న ఇంటర్వ్యూ అడ్రస్ కార్డు చూసి ఆ స్థలానికి చేరి కంగారుగా ఉన్న ఆ కుర్రవాడిని వెతికి తన సర్టిఫికెట్ ఫైలును తనకు అందజేశాడు. ఈ తోటి ప్రయాణీకుని చర్య వల్ల అతనికి నిజంగా ఉద్యోగం వస్తే ఇది కూడా మానవత్వాన్ని, మానవత్వ విలువల్ని చాటి చెప్పే చర్యగా మనం భావించవచ్చు.

కొన్ని గ్రామాలు ముఠా తగాదాలతో దద్దరిల్లుతుంటాయి. ఆయా వర్గాలు పసిపిల్లల్ని కూడా నిర్దాక్షిణ్యంగా చంపుతారు. అభం శుభం తెలియని పసిపిల్లల మీద శత్రువైనా జాలి, దయ, మానవత్వం చూపాలి.

ఒక యాజమాన్యం క్రింది, ఒక సంస్థలో కొందరు పనిచేస్తున్నారు. వారిలో ఒకరికి అకస్మాత్తుగా జబ్బుచేసింది. ప్రమాద స్థితిలో పడ్డాడు. తోటి పనివారు వెంటనే అతన్ని సమీప నగరంలో ఉన్న హాస్పిటల్‌లో చేర్చగా, అతను ప్రాణాపాయ స్థితినుండి బయటపడ్డాడు. కానీ యాజమాన్యం మాత్రం మీరు సెలవు పెట్టకుండా వెళ్ళారు? ఎవరు ఛస్తే మీకేం ? అని వారు నిలదీస్తే, దీనిని అమానుష చర్యగా, మానవత్వం లేని చర్యగా అభివర్ణించవచ్చు.

మానవత్వాన్ని చాటిచెప్పే కొన్ని కథలను పరిశీలిద్దాం. బైబిల్ గ్రంథంలో మంచి సమరయుడు అనే కథ ఉంది. ఒక రోజున సమరయ

దేశానికి చెందిన ఒక వ్యక్తి తన వ్యాపార నిమిత్తం మరొక పట్టణానికి బయలు దేరాడు. మార్గమధ్యంలో ప్రయాణిస్తున్న ఒక వ్యక్తిని కొందరు దొంగలు దోచుకొని, అతన్ని గాయపరచగా అతడు స్పృహ తప్పి పడిపోయాడు. నిస్సహాయ స్థితిలో, ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడు. ఆ దారిన అనేకమంది ప్రయాణించారు. కానీ స్పృహ తప్పి గాయాలతో నిస్సహాయ స్థితిలో ఉన్న ఇతనిని ఎవరూ పట్టించుకోలేదు. ఇతని మీద జాలి, దయ, కనికరము ఎవరూ చూపలేదు. ఒక సమరయుడు ఆ త్రోవను ప్రయాణిస్తూ ఈ నిస్సహాయ స్థితిలో ఉన్న వ్యక్తిని చూచి, ఆగి అతనిమీద జాలిపడి, కనికరపడి అతనిని దగ్గరలో ఉన్న ఒక ఊరికి చేర్చి ఒక పూటకూళ్ళవాని ఇంట్లో అతనిని అట్టిపెట్టి అతనికి చికిత్స చేయించి, వారం రోజులకు సరిపడా అతనికయ్యే ఖర్చులు ఇచ్చి, త్వరలో మరలా వస్తానని ఆ యజమానికి చెప్పి వెళ్ళాడు. నిస్సహాయ స్థితిలో, ప్రమాద స్థితిలో ఉన్న ఆ అభాగ్యుడిని ఆదుకున్న సమరయుడు చరిత్రలో "మంచి సమరయుడు"గా మానవత్వం ఉన్న వ్యక్తిగా, మానవత్వపు విలువలను చాటిచెప్పిన వ్యక్తిగా మిగిలిపోయాడు.

అష్టదిగ్గజ కవులలో హాస్య కవియైన తెనాలి రామకృష్ణుడు "పాండురంగ మహాత్యం" అనే కావ్యాన్ని వ్రాశాడు. అందులో 'నిగమశర్మోపాఖ్యానము' ఉంది. సద్బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన నిగమశర్మకు బ్రాహ్మణ లక్షణాలు లేని వ్యక్తిగా మిగిలిపోయాడు. నిగమశర్మ ఒకరోజు ఒక ఊరు వెళుతుండా మార్గమధ్యంలో కొందరు దొంగలు నిగమశర్మను కొట్టి, గాయపర్చి దోచుకున్నారు. స్పృహ లేని స్థితిలో దారి ప్రక్కన పడివున్న నిగమశర్మను పొలమునుండి ఇంటికి వెళుతున్న ఒక రైతు అతనిని తన ఎడ్లబండిలో ఎక్కించుకొని ఇంటికి చేర్చి సపర్యలు చేసి అతని గాయాలు మానేవరకు తన ఇంట్లో అట్టిపెట్టుకొని మానవత్వాన్ని ప్రదర్శించాడు ఆరైతు. కానీ నిగమశర్మ మాత్రం తనకు ఆశ్రయమిచ్చి తన ప్రాణాలు కాపాడిన రైతు భార్యతో లేచిపోయి తన దానవత్వాన్ని చాటుకున్నాడు.

మరొక బైబుల్ కథని పరిశీలిస్తే (ఆదికాండం 40 నుండి 45వ అధ్యాయం వరకు) ఏసోపు వృత్తాంతం కలదు. ఏసోపు తండ్రి యాకోబుకు

12 మంది కుమారులు. ఏసోపు ఇంటినుండి వెళ్ళినపుడు అతడే చివరివాడు. తరువాత బెన్యామీను అనే వ్యక్తి జన్మించాడు. వారిలో మొదటి పదిమంది ఒక తల్లిపిల్లలు కాగా, చివరి ఇద్దరు మరొక తల్లి పిల్లలు. ఏసోపును తమ తండ్రి ఎక్కువగా ప్రేమిస్తున్నాడని గ్రహించిన అతని అన్నలు ఒక రోజు అతనిని అమ్మివేసి ఒక మేకను చంపి, దాని రక్తాని బట్టలకు పూసి, రక్తసిక్తమైన ఆ బట్టలు ఏసోపువని, అతనిని పులి చంపినదని తండ్రికి అబద్ధం చెప్పారు. ఆ తరువాత ఏసోపు భగవంతుని కృపవలన ఐజిప్తు దేశానికి చేరి, ఐజిప్తు రాజైన ఫరో ఇంటికి చేరి అతనికి అతి నమ్మకమైన వ్యక్తిగా ఉండి రాజ్యపెత్తనం కూడా చేయసాగాడు. ఏసోపు స్వస్థలమైన కానాను దేశంలో గొప్ప కరవు సంభవించి, తిండిగింజలు కొందామన్నా దొరకని స్థితి ఏర్పడ్డది. ఐజిప్తు రాజ్యంలో ధాన్యం అమ్ముతున్నారని విన్న ఏసోపు అన్నలు ఐజిప్తు చేరి ఫరో ఇంటికి ధాన్యం కొనడానికి వెళ్ళిరి. వారిని తన సోదరులుగా ఏసోపు గుర్తించాడు. కానీ వారు మాత్రం ఏసోపు వారి సోదరుడని గుర్తు పట్టలేదు. ఏసోపు వారి కుటుంబ వివరాలు అడిగి తెలుసుకొని, వారిని వేగులుగా అనుమానించినట్లుగా వారితో కఠినంగా వ్యవహరించి, చివరకు ఇంటి దగ్గర తన తండ్రితో ఉన్న బెన్యామీనును తీసుకురావాలని ఆజ్ఞాపించగా, వారు తండ్రికి నచ్చచెప్పి, అతనిని ఏసోపు వద్దకు కొనిపోయిరి. వారందరికి ఏసోపు విందు ఏర్పాటు చేసి, వారితో కలిసి భోజనము చేసి, వారికి తాను సోదరుడనే అనుమానం రాకుండా జాగ్రత్తగా వ్యవహరించి, చివరకు ఎవరి ధాన్యం గోతంలో వారి రూకలనుంచి వారిని సాగనంపి తన మానవత్వాన్ని ప్రదర్శించాడు. తనను అమ్మివేసిన సోదరుల మీద ఏమాత్రం పగ, ద్వేషం చూపక లోలోపల జాలి, కరుణ చూపాడు.

ఇలా అనేక గ్రంథాల్లో మానవత్వపు విలువలు చాటి చెప్పే కథలు, గాథలు కోకొల్లలు. మానవత్వాన్ని పెంచి పోషించుట, మానవత్వాన్ని కలిగియుండుట మానవ ధర్మం. మానవత్వాన్ని వికసింపచేయటానికి ప్రతి ఒక్కరూ వారి వంతు కర్తవ్యాన్ని నిత్యం గుర్తుచేసుకోవాలి. మానవత్వాన్ని మరచిన వ్యక్తికి మృగానికి తేడా ఉండదనటంలో అతిశయోక్తి లేదు.

ఒక పర్యాయము ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ స్పీకరుగారైన డా॥ కోడెల శివప్రసాదరావు గుంటూరు వెళుచుండగా ఫిరంగిపురం దగ్గర ప్రమాదానికి గురైన ఒక వ్యక్తిని చూసి, తన కారును ఆపి అందులో ఎక్కించుకొని ఆసుపత్రిలో చేర్చినట్లు వార్త వెలువడింది. ఇది కూడా ఆయన మానవత్వానికి ఉదాహరణే.

## దానవత్వం [Inhumanity]

దానవత్వం అంటే రాక్షసత్వం, రాక్షస గుణాలతో వ్యవహరించటం. అమానుష చర్యలకు పాల్పడటం. ఇతరులను ఇబ్బందులకు గురిచేయటం, అన్యాయం చేయటం, స్త్రీలను చెరచటం, ఇతరుల ప్రాణ, ధన, మానాలను దోచుకోవటం – ఇవన్నీ దానవత్వపు చర్యలే. మంచి, మానవత్వం లేకుండా మంచికి, చెడుకి తేడా లేకుండా విచక్షణారహితంగా, స్వార్ధ ప్రయోజనాల నాశించి చెడు, క్రూరమైన చర్యలు, హేయమైన చర్యలు.

ఇటీవలి కాలంలో ఒక స్త్రీని దేశరాజధాని నగరంలో ఒక బస్సులోనే ఆరుగురు వ్యక్తులు దారుణంగా మానభంగం చేసి చంపారు. నిర్భయ చట్టం క్రింద వారిని అరెస్టు చేశారు. ఇటీవల కోర్టు వారికి ఉరిశిక్ష విధించింది. ఇది దానవత్వానికి ఒక ఉదాహరణ.

కొన్ని నెలల క్రితం దాచేపల్లిలో ఒక రిక్షావాలా, 60 సంవత్సరాల వృద్ధుడు ఒక అమ్మాయిని మానభంగం చేశాడు. తనను పోలీసులు గాలిస్తారని, ఉరిశిక్ష తప్పదని భావించి, తానే చెట్టుకి ఉరివేసుకొని ఆత్మహత్య చేసుకున్నాడు.

హరియాణాలో ఒక పూజారి తమ వ్యక్తిగత సమస్యలు తీరుస్తానని 120 మంది మహిళలను అత్యాచారం చేసినట్టు వార్తలు వెలుగులోకి వచ్చాయి. (ఈనాడు దినపత్రిక 22–7–18)

రాజస్థాన్‌లో 7 నెలల పసిపాపని అత్యాచారం చేశాడొకతను, అతనికి రాజస్థాన్ కోర్టు 21–9–18న ఉరిశిక్ష విధించింది ఇవన్నీ అమానుష, రాక్షస, దానవత్వపు చర్యలే.

చండీఘడ్‌లో 21 సంవత్సరముల అమ్మాయిని ఒక 'గెస్ట్‌హౌస్'లో బంధించి 15 మంది యువకులు ది. 15–7–18 నుండి 18–7–18 వరకు

విడతలవారీగా అత్యాచారం చేసినట్టు ది. 22-7-18న దినపత్రికలో ప్రచురితమైంది. ఇటువంటి దానవత్వపు చర్యలను గూర్చి ప్రస్తావించాలంటే ఒకటిగాదు అనేక పుస్తకాలు వ్రాయాలి.

ఇటీవల గుంటూరు పట్టణంలో 60వ సంవత్సరాలు దాటిని వృద్ధ దంపతులను అర్ధరాత్రి వారి ఇంట్లోనే చంపి బంగారాన్ని దోచుకెళ్ళిన వార్తలు చూశాం.

భార్య మీద అనుమానంతో భర్త భార్యను చంపిన కేసులు, భార్య ప్రియునితో కలిసి భర్తను చంపిన కేసులు రోజూ వార్తల్లో వింటూనే ఉన్నాం, వార్తాపత్రికల్లో చదువుతున్నాం. ఇవన్నీ దానవత్వపు చర్యలే.

చాలామంది అమ్మాయిలు అబ్బాయిలతో ప్రేమలో పడి ప్రేమ కార్యకలాపాలు సాగించినవారు, వివాహం చేసుకుంటానని చెప్పి, చివరకు అమ్మాయి నిలదీస్తే తప్పించుకునే అబ్బాయిలు, ఇక గర్భవతులైన అమ్మాయిలు కోకొల్లలు. అబ్బాయిల ఇళ్ళముందు నిరాహారదీక్ష, ఆమరణ నిరాహారదీక్ష చేసినవారు గూడా కోకొల్లలు. తెలుగులో ఒక సామెత ఉంది. "అడుసు తొక్కనేల, కాలు కడుగనేల" అని. ప్రేమ వ్యవహారాల్లో కాలుజారినవారి పరిస్థితి అట్లుగాక తప్పదంటారు. ఇవన్నీ అమానుష చర్యలే.

ఆస్తుల ఆక్రమణలు, ధనదోపిడీలు, ఆస్తికోసం మర్డర్లు - ఇవన్నీ దానవత్వపు చర్యలే. దానవత్వపు చర్యలను ముక్త కంఠంతో జనం అందరూ కుల, మత, ప్రాంతీయతతో సంబంధం లేకుండ ఖండించాలి. దానవత్వం చర్యలకుపక్రమించే వారిపై కేవలము చట్టపరమైన చర్యలు చాలవేమో.

కొన్నిసార్లు అవి కోర్టుల్లో ఋజువు కావచ్చు, కాకపోవచ్చు. జనం ఏకమై సామాజికంగా అడ్డుకోవాలి. అన్యాయం చేసినవారినెదిరించాలి, అన్యాయానికి గురైన వారికి అండగా నిలవాలి.

విద్యార్థులారా! అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడే మనస్తత్వాన్ని విద్యార్థి దశనుండే అలవాటు చేసుకొని, న్యాయానికి అండగా నిలవండి. అన్యాయం మీద నిరసనలు, ధర్నాలు, తిరుగుబాటు ధోరణిని ప్రదర్శించండి.

# 16. విద్యార్థులు - క్రీడలు - ప్రయోజనాలు

[Students - Games & Sports - Uses]

క్రీడలు (ఆటలు) విద్యార్థులకు మూడు దశల్లో ముఖ్యమైనవి. పాఠశాల స్థాయి, కళాశాల స్థాయి, విశ్వవిద్యాలయ స్థాయుల్లో.

**పాఠశాల దశ :** ఉన్నత పాఠశాల దశ విద్యార్థి కొన్ని మంచి అలవాట్లు నేర్పబడే, నేర్చుకునే దశ. ఈ దశలో నేర్చుకున్న అలవాట్లు మారవు. జీవితాంతం మనం వాటిని పాటిస్తాము. చదువుతోపాటు క్రీడలు ఆడటం, క్రీడల మీద ఆసక్తి పెంచుకోవటం అలవాటు చేసుకోవాలి. క్రీడల వల్ల శారీరక, మానసిక ఆరోగ్యము దృఢంగా తయారవుతుంది. శరీరము యొక్క రోగనిరోధక శక్తి పెరుగుతుంది. మానసిక ఆనందాన్ని గూడా పొందుతాము. ఈ క్రీడలు పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ వార్షికోత్సవానికి వారం రోజుల ముందు నిర్వహించే ఆటలు మాత్రమే ఆడి, గెలుపొంది, బహుమతులు తీసుకోవడానికి పరిమితం కాకూడదు. క్రీడల్లో నిరంతర సాధన ఉత్తమ క్రీడాకారులుగా తీర్చిదిద్దగలదు. మనకు ఆసక్తి ఉన్న క్రీడల్లో ప్రతి రోజు కనీసం అరగంట అయినా సాధన చేస్తే మంచి క్రీడాకారులుగా కొన్ని సంవత్సరాల తరువాత రూపుదిద్దుకోవచ్చు.

## క్రీడలు – ప్రోత్సాహము

క్రీడలు విద్యలో భాగమనే విషయాన్ని విద్యార్థులు, తల్లిదండ్రులు, అధ్యాపకులు సదా గుర్తుంచుకోవాలి. కేవలము క్రీడల అధ్యాపకులే కాదు, మిగతా అధ్యాపకులు, తల్లిదండ్రుల ప్రోత్సాహించాల్సిన అవసరమున్నది. ప్రస్తుత విద్యావిధానములో మార్కులు – ర్యాంకులే పరిమితమైనందున, విద్యార్థులు, అధ్యాపకులు, వారి తల్లిదండ్రులు, చదువు మీద ఎక్కువ శ్రద్ధ చూపించి, విద్యార్థుల సమయాన్ని పాఠశాల తరగతులు విడిచిపెట్టిన వెంటనే చదివించటం, ట్యూషన్ క్లాసులకు పంపించటం – ఈ కార్యక్రమంలో నిమగ్నమవుతున్నారు. పాఠశాల తరగతుల సమయం అయిన తరువాత ఒక గంటపాటు క్రీడలు ఆడమని, విద్యార్థులను ప్రోత్సహించే తల్లిదండ్రులు, అధ్యాపకులు గూడా

కరువయ్యారనే చెప్పాలి. వెయ్యిమంది విద్యార్థులున్న పాఠశాలలోగాని, కళాశాలలోగాని సాయంత్రం 5 గంటలకు కనీసం 50 మంది విద్యార్థులు గూడా ఆటస్థలాల్లో కనిపించరు. ఇది ఆటస్థలాల దుస్థితి. పాఠశాలలను, కళాశాలలను పోలిస్తే కళాశాలలకంటె కొన్ని పాఠశాలలే మెరుగ్గా ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు క్రీడా రంగానికి పెద్దపీట వేస్తున్నారు. ప్రోత్సహిస్తున్నారు. ప్రతి మండల హెడ్క్వార్టర్స్‌లో ఒక మినీ స్టేడియాన్ని నిర్మించటానికి నిర్ణయించి నిర్మాణ సన్నాహాలు చేస్తున్నారు. పట్టణాల్లో ఉన్న స్టేడియాల వసతులను అభివృద్ధి చేసి క్రీడా వసతులను పెంచి, క్రీడాకారులను ప్రోత్సహిస్తున్నారు. 2022వ సంవత్సరములో జరగనున్న ఒలంపిక్ క్రీడా పోటీలను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో జరపాలనే కృత నిశ్చయంతో మన రాష్ట్ర ముఖ్యమంత్రి గారున్నారు. ఇందులో భాగంగా 'ఆపరేషన్ గరుడ'ను ప్రారంభించి, రాష్ట్రంలో పాఠశాల విద్యార్థులను ప్రోత్సహించాలని వారి సామర్థ్య వివరాలు మండలం వారీగా పంపాలని ఆదేశించారు. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో కొన్ని కోట్ల రూపాయలతో ఈ శిక్షణా నిర్వహణ కార్యక్రమాలకు వేదికగా తయారు చేస్తున్నారు. బందరు పట్టణంలో గూడా స్టేడియాన్ని నిర్మించి క్రీడాకారులను తయారు చేసే ప్రణాళికను తయారు చేస్తున్నారు. శాప్ పర్యవేక్షణ చేస్తుంది.

ప్రస్తుతం గతం కంటె క్రీడాకారుల సంఖ్య పెరిగింది. ఇంకా బాగా పెరగాలి. క్రీడాకారులకు మంచి ప్రోత్సాహకాలు పతకాలు సాధించినాక కాదు, పతకాల సాధన కోసం ప్రోత్సాహకాలుండాలి. వారి వసతుల కోసం ప్రోత్సాహకాలుండాలి. ఈ దిశగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం క్రీడాకారుల శిక్షణ కోసం వసతులు కల్పించి వారి శిక్షణకవసరమైన ఖర్చులను భరిస్తుంది.

వివిధస్థాయిల విద్యార్థులకు విద్యా, ఉద్యోగ రిజర్వేషన్ల శాతం ఇంకా పెంచవలసిన అవసరముంది. చదువుకున్నవారికే గాదు, చదువుతోపాటు క్రీడల్లో రాణించినవారికి ఉద్యోగ రిజర్వేషన్లుగాని, వివిధ సంస్థల్లో అడ్మిషన్ల రిజర్వేషన్లు గాని కనీసం 8,9 శాతానికి పెంచాలి. తద్వారా అనేకమంది విద్యార్థులు

క్రీడల పట్ల ఆసక్తి చూపే అవకాశముంది. ఈ రిజర్వేషన్ల వ్యవహారం రాజ్యాంగ బద్ధం గనుక కొన్ని సమస్యలు ప్రభుత్వానికి గూడా ఉండవచ్చునేమో.

క్రీడాకారులు ఒక ప్రదేశానికి, ఒక జిల్లాకు, ఒక రాష్ట్రానికి, ఒక దేశానికి కామన్‌వెల్త్, ఒలంపిక్ గేమ్స్‌లో వారి ప్రతిభ ద్వారా పేరు తెస్తారు. అది వారికి గర్వకారణంగా ఉంటుంది. గతంలో చెప్పుకున్నాం. క్రీడల ద్వారా శారీరక, మానసిక ఉల్లాసం కలుగుతుంది. క్రీడాకారులకే గాదు, క్రీడలను చూచేవారికి గూడా ఉత్సాహం పెరుగుతుంది. క్రీడల ద్వారా ఐక్యత పెరుగుతుంది. జయాపజయాలను ఒకేవిధంగా పరిగణిస్తారు క్రీడాకారులు. దీనినే 'స్పోర్ట్‌మెన్ స్పిరిట్' అంటారు. కుల, మత, ప్రాంతీయ భేదాలు క్రీడల్లో ఉండవు. ఉండకూడదు. అది ఆటల స్ఫూర్తికే విరుద్ధం.

దురదృష్టవశాత్తూ అన్ని రంగాల్లాగా క్రీడారంగంలోకూడా కొన్ని అవాంఛనీయ సంఘటనలు చోటు చేసుకుంటున్నాయి. కులప్రభావం కొన్నిచోట్ల, ప్రాంతీయ ప్రభావం కొన్నిచోట్ల, ఇతరత్రా సమస్యలు అనగా ప్రతిభ ఉన్న క్రీడాకారులు కొన్ని సందర్భాల్లో స్టేట్, దేశ టీముల్లో స్థానం దక్కటం లేదని, సిఫార్సులతో అనర్హులు సెలక్ట్ అవుతున్నారనే ఆరోపణలు ఇటీవల వినబడుతున్నాయి. ఇది అనారోగ్యకరమైన వాతావరణము. దీనికి బాధ్యులయినవారిని ఆయా సెలక్షన్ కమిటీలనుండి తీసివేయాలి. మరలా సెలక్షన్లు జరిపి ప్రతిభకు న్యాయం చేయాలి. ఇందులో ఏ రాజకీయు శక్తుల ప్రమేయం ఉండగూడదు. వారు క్రీడా వ్యవహారాలకి దూరంగా ఉండాలి. వసతులు కలుగజేయటము, నిధులు దుర్వినియోగం కాకుండా చూడటానికే వారు పరిమితం కావాలి.

ఆయా పాఠశాలల, కళాశాలల ఆటస్థలాలు బాగు చేయాలి. వివిధ ఆటల కోర్టులు వేయాలి. ఆటలకు సౌకర్యాలు పెంచాలి. దురదృష్టవశాత్తూ అధికశాతం ప్రైవేటు పాఠశాలలకు ఆటస్థలాలు లేవు. విద్యార్థుల సంఖ్య బాగానే ఉన్నది. వారు ఆటలకంటే చదువుకే అధిక ప్రాధాన్యతనిస్తున్నారు. వార్షికోత్సవాలు చాలా ఘనంగా జరుపుతారు. అందులో భాగంగా

సంవత్సరములో నాలుగైదు రోజులు ఏదో ఒక కళాశాల క్రీడా మైదానంలోగాని, స్టేడియంలోగాని, వివిధ రకాల పోటీలు జరిపి, విజేతలకు వార్షికోత్సవం రోజు బహుమతులనిస్తుంటారు. ప్రైవేటు రెసిడెన్షియల్ కళాశాలలు గూడా అదే విధంగా చేస్తున్నాయి. కానీ జిల్లాలో, రాష్ట్రంలో జరిగిన కొన్ని ఆటల పోటీల్లో ఆయా సంస్థల విద్యార్థులు ప్రథమ, ద్వితీయ బహుమతులు సాధించినట్లు విద్యార్థులకు శుభాకాంక్షలు తెలియజేస్తూ వివిధ దినపత్రికలలో చూస్తాము.

చివరిగా ఆటలు రెండు రకాలు. అవుట్ డోర్, ఇండోర్ గేమ్స్. ఇవిగాక అథ్లెటిక్స్ గూడా ఉంటాయి. ఖోఖో, కబడ్డీ, వాలీబాల్, బేస్‌బాల్, బాస్కెట్‌బాల్, హాకీ, క్రికెట్, బాల్ బ్యాడ్మింటన్ తదితర ఆటలు అవుట్ డోర్ ఆటలు. చెస్, క్యారమ్స్ తదితర ఆటలు ఇండోర్ గేమ్స్. త్రోబాల్, రన్నింగ్‌రేస్, జావాలిన్ త్రో, హైజంప్, లాంగ్‌జంప్, వెయిట్ లిఫ్టింగ్ తదితర ఆటలు అథ్లెటిక్స్.

విద్యార్థులకు మాస్ డ్రిల్లింగ్ తప్పనిసరిగా చేయించాలి. పైన పేర్కొన్న క్రీడలు కొంతమంది విద్యార్థులకే పరిమితం. విద్యార్థులందరికీ మాస్ డ్రిల్లింగ్ ద్వారా 15 నిముషాలు వివిధ రకాల ఎక్సర్‌సైజులు నేర్పితే వారు జీవితాంతం ఆ ఎక్సర్‌సైజెస్ చేసుకుంటారు. ఇది ప్రతి పాఠశాల క్రీడల అధ్యాపకులు నేర్పే ప్రయత్నం చేస్తే విద్యార్థులందరికీ ప్రయోజనం సమకూరుతుంది. మాకు నేర్పిన మాస్ డ్రిల్ ఎక్సర్‌సైజెస్ ప్రతిరోజు, ఈ రోజుకి నేను ఇంట్లో చేస్తాను. ఇది మాస్ డ్రిల్ ప్రభావమే.

విద్యార్థులు, వారి తల్లిదండ్రులు క్రీడలు ఆడటం వల్ల సమయం వృధా అవుతుందని అనుకోకూడదు. క్రీడా ప్రయోజనాలను గుర్తుంచుకొని విద్యార్థుల క్రీడల పట్ల ఆసక్తిని పెంచుకొని ఆటలు ఆడి ఆరోగ్యాన్ని పెంపొందించుకొని, మానసికోల్లాసాన్ని వారు పొంది, ప్రేక్షకులు కూడా పొందేటట్లు చేయాలని కోరుకొంటున్నాను.

క్రీడల విషయాన్ని ప్రస్తావించినపుడు నరసరావుపేటవాసిగా, నరసరావుపేటలో ఉన్న డా॥ కోడెల శివప్రసాదరావు స్టేడియాన్ని గురించి

తప్పక ప్రస్తావన చేయాలి. క్రీడా ప్రాంగణము ఒకప్పుడు అది ఒక వాగు, ఉబ్బడి. దానిని 25 ఎకరాల సువిశాల ప్రాంగణంగా డాక్టరు కోడెల శివప్రసాదరావు తీర్చిదిద్దారు. ఆ క్రీడా ప్రాంగణంలో వివిధ రకాల కోర్టులు, ఇండోర్‌గేమ్స్ సౌకర్యం, జిమ్ సౌకర్యం, స్విమ్మింగ్‌పూల్, వాకర్స్‌ట్రాక్ – ఇవన్నీ ఉన్నాయి. క్రీడాకారుల వసతి భవనాలు గూడా ప్రారంభమవుతున్నాయి. ఇది గుంటూరు బ్రహ్మానందరెడ్డి స్టేడియంకంటే చాలా పెద్దది. ఇంత పెద్ద స్టేడియాన్ని నిర్మించిన డాక్టరుగారు చిరస్మరణీయుడు. పేట క్రీడాకారులు ధన్యులని చెప్పాలి. ఈ స్టేడియాన్ని విద్యార్థులందరు ఉపయోగించుకోవచ్చు.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు రాష్ట్రంలో కొన్ని జిల్లాల్లో క్రీడా అకాడమీలు మంజూరు చేశారు. అందులో భాగంగా నరసరావుపేట, కోడెల శివప్రసాదరావు స్టేడియానికి కూడా క్రీడా అకాడమీ మంజూరైంది. ఈ క్రీడా అకాడమీకి అనుగుణంగా వసతి గృహానికి డాక్టరుగారు శంకుస్థాపన చేశారు. శాప్ వారు కొంతమంది కోచ్‌లను గూడా నియమించారు.



# 17. విశ్వాసము

[Faith]

"విశ్వాసం కొండలనైనా పెకలించగలదు" అనేది బైబుల్ వాక్యం. తల్లిదండ్రులకు వారి బిడ్డల మీద విశ్వాసం ఉండాలి. భార్యాభర్తలకు ఒకరి మీద ఒకరికి విశ్వాసం ఉండాలి. స్నేహితులకు, ప్రేమికులకు కూడా ఒకరి మీద ఒకరికి విశ్వాసం ఉండాలి. వ్యాపారస్తుల మీద ప్రజలకు, అధ్యాపకుల మీద విద్యార్థులకు, విద్యార్థుల మీద అధ్యాపకులకు, రాజకీయ పార్టీల మీద ప్రజలకు, కార్యకర్తలకు – ఈ విధంగా పరిశీలిస్తే విశ్వాసం పరిధి చాలా పెద్దది. ఈ అంశము కూడా చాలా విస్తృతమైంది. ఇంకా మత విశ్వాసాలు, దేవుని మీద విశ్వాసము అనేక రకాలుగా ఈ అంశమున్నది. కానీ ఇక్కడ మనం విద్యార్థులకు ఈ అంశాన్ని పరిమితం చేసి పరిశీలిద్దాం.

తల్లిదండ్రులకు అతి ముఖ్యమైన విషయం వారి బిడ్డల చదువులు. వారి చదువుల విషయంలో ప్రతి తల్లిదండ్రి చాలా జాగ్రత్తలు తీసుకుంటారు, బాధ్యతాయుతంగా ఉంటారు. వారు బాగా చదువుకొని జీవితంలో పైకి రావాలని, మంచి ఉద్యోగాలు రావాలని ఆశిస్తారు. బిడ్డల మీద వారు విశ్వాసాన్ని కలిగి ఉంటారు. వారిని పాఠశాల స్థాయినుండి ఉన్నతవిద్య వరకు నానా కష్టాలు పడి చదివిస్తారు.

పాఠశాల స్థాయిలో పిల్లలు కొన్ని అలవాట్లు నేర్చుకుంటారు, కొన్ని అభిప్రాయాలు కలిగి ఉంటారు. వారికి చదువుల పట్ల ఆసక్తి, శ్రద్ధ పెరగాలంటే తొలుత వారి అధ్యాపకుల మీద విశ్వాసముండాలి. వారు మా భవిష్యత్తును తీర్చిదిద్దగలరనే నమ్మకముండాలి. ఆ విధమైన నమ్మకం వారికి కలుగ చేయవలసిన బాధ్యత, పాఠశాల వాతావరణం, ఆ పాఠశాల అధ్యాపకుల మీద ఆధారపడి ఉంటుంది.

అధ్యాపకులు వారి బోధనా సామర్థ్యంతో, వారి క్రమశిక్షణతో విద్యార్థులకు మంచి అలవాట్లు నేర్పి వారికి చదువు పట్ల ఆసక్తిని, శ్రద్ధను

కలుగజేయాలి. విద్యార్థులకు వారి చదువుపట్ల వారి జీవితం పట్ల విశ్వాసాన్ని పెంపొందించాలి.

విశ్వాసం లేకుండ ఏ పని చేసినా అది విజయవంతం కాదు. విద్యార్థులు మేము బాగా చదవగలం, మంచి మార్కులు తెచ్చుకోగలం, క్రీడలు ఇతర రంగాలలో రాణించగలం అనే విశ్వాసాన్ని కలిగి ఉన్నప్పుడే వారు శ్రద్ధతో, అంకితభావంతో పని చేయగలరు. ఫలానా పాఠం నేను చదువలేను, ఫలాన పరీక్ష నేను వ్రాయలేను, నేను ఉత్తీర్ణతను, మంచి మార్కులను సాధించలేను, ఆటలు ఆడటం నాకు రాదు – అని ఈ విధమైన అవిశ్వాసాన్ని, నిరాశను, నిరుత్సాహాన్ని వ్యక్తం చేయగూడదు. విశ్వాసానికి మూలం కృషి, పట్టుదల, అంకితభావం, చిత్తశుద్ధి. ఈ గుణాలు పుష్కలంగా మనం అభివృద్ధి పరచుకుంటే విశ్వాసము మనలో తొణికిసలాడుతుంది. విశ్వాసం పూర్తిగా ఉన్న వ్యక్తి ఏ కార్యాన్నైనా సాధించగలడు. సాధించే మనస్తత్వం కలిగి ఉంటాడు. ఈ రోజు నేను 8 గంటలు చదువగలను, లేక వ్రాయగలను అనే విశ్వాసాన్ని కలిగి ఉండి ప్రారంభిస్తే కనీసం 7 గంటలైనా చదువగలడు. నేను ఈ రోజు ఈ పనిని పూర్తి చేయాలి, చేయగలను అని విశ్వాసముండి ఆ పని చేయుటకుపక్రమిస్తే తప్పకుండా ఆ పనిని పూర్తి చేయగలడు. తలచుకున్న పని పూర్తి కావటానికి మూలం విశ్వాసము, పట్టుదలగా పనిచేయటము.

కొందరు విద్యార్థులు వారికి "ఏ" గ్రేడు రావాలని సంవత్సరం ఆరంభం నుండే విశ్వాసంతో శ్రద్ధగా చదివి సాధిస్తారు. ఈ సాధన విశ్వాసం, శ్రద్ధ, పట్టుదల, కృషి ద్వారానే సాధ్యమైంది. అట్లుగాక మనకి "ఏ" గ్రేడు రాదులే అనే అవిశ్వాసాన్ని కలిగి ఉంటే, వారు శ్రద్ధ వహించరు, పట్టుదల ఉండదు, కృషి చేయరు.

కొందరు విద్యార్థులు విశ్వాసంతో గ్రూప్ వన్ పరీక్షలకు చదివి మొదటి ప్రయత్నంలో విఫలమవుతారు. కాని వారిలో విశ్వాసం ఏమాత్రం సడలదు. మరలా మరలా ప్రయత్నించి చివరకు విజయాన్ని సాధిస్తారు. విజయం తరువాత వారి ఆనందానికి అవధలు ఉండవు. ఇదంతా వారి విశ్వాసం

ద్వారానే జరిగింది.

జీవితంలో ఒక్క చదువేకాదు, ఏ కార్యాన్ని సాధించాలన్నా మొదట కావలసింది విశ్వాసమే. కనుక విద్యార్థులారా మీరు మీ విద్యార్థి దశనుండే చదువు పట్ల, జీవితం పట్ల విశ్వాసాన్ని కలిగి ఉండి, ఆ విశ్వాసానికి, కృషి, శ్రద్ధ, పట్టుదలను జోడించి అద్భుతమైన ఫలితాలను సాధించాలని ఆశిస్తున్నాను.



# 18. సాహిత్యము - సమాజము

[Literature and Life]

భాషనుండి పుట్టిందే సాహిత్యము. దాదాపు అన్ని భాషల్లో సాహిత్యముంటుంది. తెలుగు సాహిత్యము, ఆంగ్ల సాహిత్యము, హిందీ సాహిత్యము, తమిళ సాహిత్యము, కన్నడ సాహిత్యము – ఈ విధంగా అనేక భాషల్లో సాహిత్యమున్నది. ఏ భాష మాట్లాడేవారు ఆ సాహిత్యం గొప్పదనే వాదనలున్నాయి. **"దేశ భాషలందు తెలుగు లెస్స"** అని తెలుగువారు తెలుగు భాష, తెలుగు సాహిత్యం గొప్పదంటారు. నిజానికి తెలుగు సాహిత్యంలో కొన్ని ప్రత్యేకతలున్నాయి. అవి మిగతా సాహిత్యాల్లో కనబడవు.

ఉదాహరణకు పద్యనాటకం, సమస్యా పూరణం, అష్టావధానం, శతావధానం, సహస్రావధానం, భువన విజయం, కవన విజయం, తోలుబొమ్మ లాటలు – ఇవన్నీ తెలుగు సాహితీ ప్రక్రియల్లో భాగమే.

సాహిత్యమంటే ఏమిటి ? సాహిత్య రకాలు ఎన్ని? సాహిత్య ప్రయోజనాలు ఏమిటి? సాహిత్యానికి సమాజానికి ఉన్న సంబంధం ఏమిటి? – ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలను, సాహిత్యం యొక్క సామాజిక ప్రాముఖ్యతను పరిశీలిద్దాం.

సంఘజీవనానికి వ్యక్తి లేక వ్యక్తుల జీవితానికి అద్దం పట్టేదే సాహిత్యము. మరో రకంగా చెప్పాలంటే సంఘ జీవనాన్ని ప్రతిబింబింప చేసేదే సాహిత్యము. ఆవిధంగా సాహిత్యానికి, సమాజానికి సన్నిహిత సంబంధం ఉంది. సమాజము లేకుండా సాహిత్యము లేదు. సాహిత్యము లేని సమాజము లేదు. ఈ రెంటికి అవినాభావ సంబంధం ఉంది.

ఉదాహరణకు రాజుల కాలంలో కవులను పోషించి ప్రోత్సహించేవారు. ఆనాటి సామాజిక స్థితిగతులు వారి కావ్యాల్లో ప్రతిబింబించేవి.

**సాహిత్య రకాలను పరిశీలిద్దాం :**

పద్య సాహిత్యం, వచన సాహిత్యం, నాటక సాహిత్యం, నవలా సాహిత్యం, ఆధునిక సాహిత్యం, గేయ సాహిత్యం, విప్లవ సాహిత్యం, దళిత

సాహిత్యం, అభ్యుదయ సాహిత్యం – ఈ విధంగా సాహిత్యంలో అనేక విభాగాలున్నాయి. సాహిత్యంలో ఎన్ని విభాగాలున్నా వీటన్నిటినీ సాహిత్యమే అంటారు.

**సాహిత్యానికి సమాజానికి ఉన్న సంబంధాన్ని పరిశీలిద్దాం :**

సాహిత్యం సమాజం నుండి పుట్టిందేనని గతంలో చెప్పుకున్నాం. సమాజం కోసమే సాహిత్యం పుట్టింది. భారతదేశంలో భారత, రామాయణ గ్రంథాలు ఇతిహాసాలే కాకుండ అవి గొప్ప సాహిత్య గ్రంథాలు కూడా. పద్య, గద్య సాహిత్యంలో అవి నేడు లభ్యమవుతున్నాయి. పద్య సాహిత్యంలో ఉన్న భారత, రామాయణ గ్రంథాలు చాలా గొప్పగా సమాజాన్ని, సామాన్యులను, చదువురాని వారిని గూడా బాగా ఆకర్షించాయనటంలో సందేహం లేదు. తిరుపతి వేంకట కవులు వ్రాసిన పద్య నాటకం “శ్రీకృష్ణ రాయబారం” నాలుగైదు దశాబ్దాల క్రితం ఊరూర ప్రదర్శనలుండేవి. ఒక గ్రామంలో ఉన్న గ్రామస్తులే వాటిని రిహార్సలు వేసి, రిహార్సలు ద్వారా రాత్రి పూట్ల నేర్చుకొని, పగలు వారి వ్యవసాయపనులు, వివిధ వృత్తుల వారు వారి వారి పనులను చేసుకొనేవారు.

ఆ విధంగా రెండు, మూడు నెలలు అభ్యాసము చేసి సంక్రాంతికి ఆ గ్రామంలో వారు ఆ నాటకాన్ని ప్రదర్శించేవారు. వారికి చదువు రాకపోయినా స్టేజీ మీద ఆ పద్యాలను చక్కగా పాడేవారు. రాయబారంలో “చెల్లియో చెల్లకో”, “బావా ఎప్పుడు వచ్చితీవు” మొదలయిన పద్యాలు దాదాపు గ్రామస్తులలో అధికశాతం వచ్చును. వారు పొలానికి ఒకటి రెండు కిలోమీటర్లు నడిచి వెళతారు. ఆవిధంగా వెళ్ళేటపుడు ఈ పద్యాలను రాగయుక్తంగా పాడుకుంటూ వెళ్ళేవారు. భారతాన్ని చదవకపోయినా, చదువు రాకపోయినా, ఆ రోజుల్లో ఆ గ్రంథాన్ని గూర్చి తెలియనివారు ఉండేవారు కాదు.

నేటికి భారతంలో ఉన్న సన్నివేశాలను, ఆయా పాత్రలను సమాజంలో ఆయా వ్యక్తులతో పోలుస్తుంటారు. ఈ పోలిక ద్వారా వ్యక్తుల గుణగణాలను వర్ణిస్తారు. ప్రస్తుత మన సమాజంలో ఆయా పాత్రల మనస్తత్వంగల వ్యక్తులకు

కొదువలేదు. ఒక వ్యక్తిని దృతరాష్ట్రుడంటాము. దృతరాష్ట్రునికి పుత్ర వాత్సల్యము అధికము. ధుర్యోధనుడు పాండవులకు అన్యాయం చేస్తున్నాడని తెలిసి గూడా, తనయుడ్ని ఖండించడు, తప్పని చెప్పలేదు. ఈ విధంగా కొడుకు చేసిన తప్పులను సమర్థించేవారిని దృతరాష్ట్రుడంటారు. "దృతరాష్ట్రుని కౌగిలి" అంటారు. మనం ఎవరినైనా ప్రేమతో, అభిమానంతో ఆలింగనం చేసుకుంటాము. కాని కుట్ర, కుతంత్రాలు, ఈర్ష్య, ద్వేషాలతో ఆలింగనం చేసుకుంటే దానినే "దృతరాష్ట్రుని కౌగిలి" అని అంటారు.
మరి కొన్ని పాత్రలను చూద్దాం.

ఫలాన వ్యక్తిని 'శకుని' అంటాము. శకుని దురుద్దేశ పూరితమైన మనస్తత్వం కలవాడు. ఫలాన వ్యక్తిని 'కీచకుడు' అంటాము. ఆడవారిని వేధించే వారిని, ఆడవారితో అక్రమ సంబంధాలకు తహతహలాడే మనస్తత్వం గల వారిని కీచకుడంటారు. 'కీచక పర్వం' కొనసాగుతుందంటారు. స్త్రీలను లైంగికంగా వేధించేవారిని ఆ విధంగా అంటాము. కీచకులు, కీచక మనస్తత్వం గలవారు మహాభారతంలోనే కాదు నేటి సమాజంలో వారికి కొదువలేదు.

ఫలాన వ్యక్తి "ధర్మరాజు" అంటాము. ధర్మానికి, న్యాయానికి ప్రతీకగా ఉండి, శాంత స్వభావము గలవారిని ఆ విధంగా అంటాము. ఇంకా అనేక ఉదాహరణలు మహాభారతంలో కలవు. ఇవన్నీ సాహిత్యం యొక్క సామాజిక ప్రయోజనాలే.

అదేవిధంగా రామాయణం గూడా భారత ప్రజలను ప్రభావితం చేసిన గ్రంథమే. శ్రీరాముడు, రావణుడు, హనుమంతుడు, కైకేయి, ఇంకా అనేక పాత్రలు నేటి సామాజిక జీవనాన్ని ప్రభావితం చేసేవే.

రావణుడు లేకుండా శ్రీరాముడు రాణించలేడు. చెడు ఉంటేనే లోకంలో మంచి విలువ తెలిసేది. చీకటి ఉంటేనే వెన్నెల విలువ తెలిసేది. అదే విధంగా దుష్టస్వభావానికి ప్రతీకగా రావణుడిని, మంచి స్వభావానికి, ధర్మానికి ప్రతీకగా రాముడిని రామాయణకర్త చిత్రీకరించాడు. ఆయా పాత్రల స్వభావాలు నేటి సమాజంలో జీవిస్తున్నాయి. రాముడు, రావణుడు మరణించినా వారి స్వభావాలు

జీవించే ఉన్నాయి, నేటి సమాజాన్ని ప్రభావితం చేస్తున్నాయి.

అట్లే హనుమంతుడు నమ్మినబంటుగా, రామభక్తుడిగా ప్రసిద్ధిగాంచాడు. హనుమంతుడు అంటే శక్తికి, నమ్మకానికి, భక్తికి మారుపేరు. ఒక వ్యక్తిని మనం ఫలానవాని హనుమంతుడు అంటే అతనికి నమ్మకస్తుడు అనే అర్థంలో వాడతాము. అట్లే అన్నదమ్ముల అనుబంధానికి రామలక్ష్మణుల పేరు ప్రతీక. ఇద్దరు అన్నదమ్ములు ఐకమత్యంగా కలిసి జీవిస్తే వారిని రామలక్ష్మణు లంటాము. వారు లేకపోయినప్పటికీ వారి స్వభావాలు నేటి సమాజంలో బ్రతికే ఉన్నాయి. ఇది సాహిత్యం యొక్క సామాజిక ప్రయోజనం.

ఒక వ్యక్తికి ఇద్దరు సతులు ఉంటే వారిద్దరి మధ్య కుటుంబంలో చిన్న చిన్న కలహాలు వస్తుంటాయి, సఖ్యత కొరవడుతుంది. ఆ ఇద్దరి మధ్య భగవంతుడైనా నలిగిపోవాల్సిందే, చాకచక్యంగా వ్యవహరించాల్సిందే! శ్రీకృష్ణుడు, సత్యభామ, రుక్మిణిల పారిజాతాపహరణ కథ అందరికీ తెలిసిందే. అట్లే శివునికున్న ఇద్దరి సతులు పార్వతి, గంగ. ఈ ఇద్దరిని గూర్చి శ్రీనాథ మహాకవి ఒక చాటువు పద్యం చెప్పాడు. తిరిపమెత్తి బ్రతికేవాడికి ఇద్దరు భార్యలెందుకు, పార్వతి చాలు, గంగను విడవమని చమత్కరిస్తాడు. నేటి సమాజంలో గూడా ఇద్దరు భార్యలున్న వ్యక్తి అవస్థలు మనం చూస్తూనే ఉన్నాం. వారిద్దరికి సఖ్యత లేక అనేక దుష్పరిణాలకు దారితీసిన సంఘటనలు కోకొల్లలు.

**ఆంగ్ల సాహిత్యాన్ని పరిశీలిద్దాం :**

ఆంగ్ల సాహిత్యానికి, తెలుగు సాహిత్యానికి భాషాభేదమే కాని భావ భేదాలు లేవు. నన్నయ – ఋతువర్ణన చేస్తాడు. అదేవిధంగా జాన్ కీట్స్ కూడా ఋతువర్ణన చేశాడు. ఈ రెంటికి తేడా లేదు. ఋతు ధర్మాలు, ఋతువుల ద్వారా ప్రకృతిలో జరిగే మార్పులు వర్ణించబడ్డాయి.

నేటి సమాజంలో ప్రజలను ఇబ్బందులకు గురి చేసే వడ్డీ వ్యాపారులున్నారు. వడ్డీ వ్యాపారుల బాధలకు తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకున్న సంఘటనలు కూడా ఉన్నాయి. వీరికి దయ, దాక్షిణ్యాలుండవు. బాకీల వసూలుకి కఠినాతి కఠినంగా వ్యవహరిస్తారు. ఇదే విషయాన్ని ప్రపంచ

ప్రసిద్ధి చెందిన ఆంగ్ల నాటక రచయిత విలియం షేక్స్పియర్ 'మర్చంట్ ఆఫ్ వెనీస్' నాటకంలో షైలాక్, బసానియో పాత్రల ద్వారా కళ్ళకు కట్టినట్టుగా 16వ శతాబ్దంలోనే వర్ణించాడు. ఇది సామాజిక సమస్యలను ప్రతిబింబింప చేసే అంశమే గదా!

మనిషికి ఆశ ఉండాలి గాని దురాశ ఉండరాదంటారు. ఆశ తప్పు కాదు. అత్యాశ తప్పంటాడు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు 'నవయుగాల బాట'లో. ఈ విషయాన్నే విలియం షేక్స్పియర్ 'మాక్‌బెత్' అనే నాటకంలో మాక్‌బెత్ పాత్ర ద్వారా స్పష్టం చేస్తాడు. భార్య లేడీ మాక్‌బెత్ ప్రోత్సాహంతో డంకన్ అనేకింగ్‌ని చంపి తాను కింగ్‌ని కావాలనుకుంటాడు. ఆ దురాశ నెరవేరలేదు. నేటి ప్రజాస్వామ్య వ్యవస్థలో గూడా మాక్బెత్ స్వభావముగలవారు లేరని అనలేము.

భార్య మీద అనుమానంతో భార్యను చంపేవాళ్ళు అనేకమంది. మనం అప్పుడప్పుడు వార్తాపత్రికల్లో, టి.వి. ఛానళ్ళలో చూస్తున్నాము. షేక్స్పియర్ వ్రాసిన 'ఒథెల్లో' నాటకం కథ ఈ కథే. ఇది సాహిత్యానికి సమాజానికి ఉన్న సంబంధం.

ఈ విధంగా వ్రాస్తే కొన్ని వందల పేజీలవుతుంది గనుక ఆధునిక నవలా సాహిత్యాన్ని పరిశీలించి ముగిద్దాం.

నవలా సాహిత్యం గూడా సామాజిక జీవనాన్ని ప్రతిబింబింప చేస్తుంది. ఊహాజనితం గాకుండా వాస్తవ సన్నివేశాల నవలలు సామాజిక జీవన ప్రతిబింబాలే. అవి బ్రిటీష్ పాలన రోజులు. స్వాతంత్ర్యం కావాలని భారతీయులు తహతహలాడుతున్నారు. దేశంలో ఏ మూల చూసినా బ్రిటీష్ ప్రభుత్వం మీద నిరసనలు, విమర్శలు, ఉద్యమాలు. ఎక్కడ చూసినా స్వాతంత్ర్యం ముచ్చట్లే. ఆ సందర్భంలో ముల్క్‌రాజ్ ఆనంద్ అనే భారతీయుడు ఆంగ్ల భాషలో "కాంతపుర" అనే నవలను వ్రాశాడు. అది దేశ స్వాతంత్ర్య కోరికను ప్రతిబింబింప చేసేదే.

శ్రీమతి సరోజినీనాయుడు మంచి కవయిత్రి, రచయిత, గొప్ప ఉపన్యాసకురాలు. ఆమె హైదరాబాద్‌లో ఎక్కువ కాలం నివశించారు.

పాతబస్తీలో ఇప్పటికీ రకరకాలు, రంగురంగుల గాజులు అమ్ముతుంటారు. "బ్యాంగిల్ సెల్లర్స్" అనే పద్యంలో గాజులు, వాటి రకాలు, వాటి రంగులు కళ్ళకు కట్టినట్టుగా వర్ణించారు. గాజులను చూడనివారికి గూడా ఆ పద్యం చదివితే గాజుల విలువ తెలుస్తుంది. రకరకాల వయసుల వారు ధరించే గాజులను కళ్ళకు కట్టినట్టుగా వర్ణించారు.

సాహిత్యము – కవులు సామాజిక నిర్దేశకులు. సమాజం ఇలా ఉండాలి అని వారు చూపిస్తారు. ఆధునిక యుగంలో శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) గొప్ప విప్లవ రచయితగా పేరొందాడు. ఆయన వ్రాసిన "మరో ప్రపంచం" కొత్త ప్రపంచం, కొత్త వ్యవస్థవైపు యువతను పరుగు తీసేటట్లు చేసింది. మనం ప్రస్తుతమున్న సామాజిక వ్యవస్థతో సంతృప్తి చెందనప్పుడు, వ్యవస్థ మారాలనుకుంటాం. ఆ మార్పుకు నాంది, ఆ మార్పువైపు నడిపించేదే "మరో ప్రపంచం" సృష్టి.

మహాకవి గుఱ్ఱం జాషువాగారు వ్రాసిన "గబ్బిలం"లో హరిజనులను నాటి హైందవ సమాజం ఏవిధంగా చూస్తున్నదో వివరించాడు. భారతమాతకు నలుగురు పుత్రులని విన్నాముగాని ఈ పంచముడెవరని ప్రశ్నించాడు. అతని గాలి సోకగానే కస్సుమనే హైందవ సమాజతీరుని ఎండగట్టాడు. గబ్బిలాన్ని శివునితో హరిజనుల సమస్యలను ఏకరువు పెట్టమన్నాడు. అంటరానితనం బాగా ఉన్న రోజులవి. హరిజనులకు రక్షణ లేని దినాలవి. హరిజనులకు కర్మ సిద్ధాంతానికి వదలివేయవద్దని, కర్మ అంటే ఏమిటి? దాని ఫలితం, స్వభావమేమిటని శివుని ప్రశ్నించాడు. ఆ విధంగా అతి ముఖ్యమైన సామాజిక సమస్యను ప్రస్తావించాడు కవి 'గబ్బిలం' అనే కావ్యం ద్వారా.

విద్యార్థులారా, ఈ విధంగా సాహిత్యమెప్పుడూ సమాజ హితకారిణి. సమాజ హితం కోరేదిగా గ్రహించవలయును. మరొక విషయం. సాహిత్యాన్ని చదివి అర్థం చేసుకోవడానికి, అభినందించటానికి, ఆనందించటానికి జీవితానుభవం తప్పక కావాలి. విద్యార్థి దశలో, పాఠశాల విద్యార్థి దశలో మార్కుల కోసం మాత్రమే చదువుతాము. సాహిత్యం మీద అభిరుచి, ఆసక్తిని ప్రతి విద్యార్థి అభివృద్ధి చేసుకోవాలి. అది మీ భావి జీవితానికి బాటలు వేయగలదు.

# 19. అహంకారము - వెటకారము - మమకారము

ఈ కారత్రయము మనం తినే కారము కాదు. మనలో శాశ్వతంగా ఉండే కారాలు. ఇవి గుణత్రయము. మానవ గుణాలకు, ఆయా వ్యక్తుల స్వభావాలకు సంబంధించినవి. ఈ గుణత్రయము పుష్కలముగా ఉన్న వ్యక్తులు చరిత్రలో, ప్రస్తుత మన సంఘుజీవనంలో కూడా చూస్తున్నాము. ఈ గుణత్రయము ఒకే వ్యక్తిలో ఉండకపోవచ్చును. వీటిలో ఏదో ఒకదానికి రాజపోషకులు కావచ్చు. లేక అన్నీ కూడా ఒక వ్యక్తిలో నిక్షిప్తము కావచ్చు. ఇవి మానవులలో చెడు లక్షణాలు కలిగిన గుణాలు.

ఎవరు వీటిని కలిగి ఉంటారో లేక వాటిని ప్రదర్శిస్తారో వారిని సమాజము పైకి గౌరవించినా వారికి నిజమైన గౌరవము దక్కటము అతి దుర్లభము. వారిని గురించి గుసగుసలాడుకుంటారు. చెవులు కొరుక్కుంటారు. ఈ అహంకార, మమకార, వెటకారాలను తగ్గించుకోవాలని గీతాచార్యులు, గీతా వ్యాఖ్యాతలు చెబుతుంటారు. ఈ గుణత్రయాన్ని పరిశీలిద్దాము.

## 1. అహంకారము :

ఇది మానవ అవగుణాల్లో ఒకటి. ఈ అహంకార గుణం బైబిల్ గ్రంథంలో, మహాభారతంలో కూడా ప్రస్తావన చేయడమైనది. అహంకారం కొందరి ప్రవర్తనలో భాగంగా ఉంటుంది. వారి మాటల్లో, చేతల్లో, ప్రవర్తనలో ఇది వ్యక్తమవుతుంది. ఈ అహంకార గుణమున్నవారు ఎవరనీ లక్ష్యపెట్టరు. వారి మాట, పనితీరు వేరుగా ఉంటుంది. వారు వారికంటె తెలివికలవారు, గొప్పవారు లేరనే విధంగా ప్రవర్తిస్తారు. వారి ప్రవర్తన, వారి మాటతీరు ఇతరులను బాధిస్తాయి. వారికి వారే గొప్ప తెలివితేటలు గలవారమని ఇతరులు వారికంటే తక్కువవారనే భావన ఉంటుంది. ఇతరులను చులకనగా చూస్తారు, చులకనగా మాట్లాడతారు.

అహంకారమున్న వ్యక్తులను వారి చుట్టూ ఉన్న సమాజము వారిని వాస్తవముగా గౌరవించదు. అది వారి మనసుకు తెలిసినా, అర్థమయినా, వారి ప్రవర్తన మార్చుకోవటానికి, అహంకారాన్ని విడవటానికి ఇష్టపడరు,

ప్రయత్నించరు. సన్నిహితులు చెప్పినా వారు వినరు. వారి ధోరణిలో మార్పు రాదు. వారివలన సమాజానికి నష్టము వాటిల్లదుగానీ,వారు మాత్రం తప్పకుండా తమ జీవితంలో ఉన్న అనేక మజిలీలలో, ఏదో ఒక మజిలీలో నష్టపోవటం ఖాయం. వారు ఆపదలో ఉన్నప్పుడుగాని, కష్టాల్లో ఉన్నప్పుడుగాని, వారేదైనా కార్యము చేయ తలపెట్టినప్పుడుగాని ఇతరులనుండి సహాయ సహకారాలు అందవు. వారికి ఎవరూ చేయూతనివ్వరు. వారికి కులగజ్జి కూడా అధికమే.

అహంకారానికి మరో పేరు గర్వము. బైబిల్ గ్రంథములో ఈ విధంగా వ్రాయబడింది. **"నాశనానికి ముందు గర్వము నడుచును"**. గర్వమున్న వ్యక్తి పతనముకాక తప్పదని దీని భావం. ఈ గర్వాన్నే 'అహంభావమని, అహంకారమని' అంటారు. చరిత్రలో అనేకమంది నియంతపాలకులు గర్వంతో, అహంకారతో నాశనమైన సందర్భాలు ఉన్నాయి.

**కొన్ని ఉదాహరణలను పరిశీలిద్దాము.**

1) **నెపోలియన్ ఫ్రెంచి దేశస్థుడు.** జీవిత తొలిదశలో సైనికునిగా సైన్యములో చేరాడు. ఆ తరువాత సైన్యాధ్యక్షుడై, ఫ్రెంచి చక్రవర్తిగా మారాడు. నియంతగా పేరుగాంచారు. ఇంగ్లండు మీద యుద్ధం ప్రకటించి యుద్ధం చేశాడు. దానినే 'బ్యాటిల్ ఆఫ్ వాటర్లూ' అని అంటారు. ఆ సీజన్ చలికాలము.

కొందరు మిలటరీ ఆఫీసర్లు ఈ సీజన్‌లో యుద్ధానికి వెళ్లవద్దని సలహా ఇచ్చినా వారి మాట వినకుండా, "నెపోలియన్ చలికాలాన్ని కూడా జయిస్తాడు" అన్నాడు. ఆ యుద్ధంలో లక్షలాదిమంది ఫ్రెంచి సైనికులు ఇంగ్లాండు వారు చంపకుండా చలికే చనిపోయారు. నెపోలియన్ ఓడిపోయి మిగిలిన సైన్యంతో వెనుదిరిగాడు. ఈ సందర్భంగా ఒక చరిత్రకారుడు ఈ విధంగా వ్రాశాడు. "నెపోలియన్ లక్షల సైన్యంతో యుద్ధానికి వెళ్ళి వేల సైన్యంతో తిరిగి వచ్చాడు. ఇది నెపోలియన్ గర్వానికి, అహంకారానికి, అహంకారం ద్వారా జరిగిన పతనానికి మచ్చుతునక".

2) **మహాభారతంలో కురుక్షేత్ర యుద్ధం** ముగిసిన తర్వాత పాండవులలో పెద్దవారైన ధర్మరాజు రాజ్యపాలన చేయాలి. కానీ రాజ్యపాలనయందు ధర్మరాజు

ఆసక్తి చూపక యుద్ధంలో మరణించిన బంధువులనుగూర్చి వగచుచుండెను. రాజ్యపాలన తనకవసరము లేదని వనములకేగి తపస్సు చేసుకుంటానని తమ్ములతో, భార్యతో చెప్పగా వారు అతనికి కొన్ని ఉపశమన వాక్యములు చెప్పిరి. అప్పుడు ద్రౌపది ధర్మరాజుతో కౌరవులగురించి మీరు చింతించ నవసరము లేదు. వారు గర్వముతో నాశనమొందారు. దుర్మార్గులను శిక్షించడం రాజదండనలో, రాజనీతిలో భాగమేనన్నది. ఈవిధంగా ఆమె కౌరవుల గర్వాన్ని, అహంకారాన్ని గుర్తుచేసి కౌరవులు వారి అహంకారముచే పతనము నొందారని వారికోసం ధర్మరాజు చింతించుట తగదని ఉపశమన వాక్యాలు పల్కెను.

3) **మహాభారతంలో దుర్యోధనుని మించిన** అహంకారి లేడని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం. అహంకారముతో, రాజ్యమదాంధకారముతో పాండవులను లెక్కచేయకుండా, దర్మబద్ధంగా వారికి రావలసిన వాటాను రాజ్యంలో ఇవ్వకుండా, చివరకు పాండవులు తమ ఐదుగురికి ఐదూళ్ళు ఇవ్వమన్నా రాజ్యంలో సూది మొన మోపినంత స్థలాన్ని కూడా ఇవ్వనని అహంకార పూరితంగా మాట్లాడాడు. అహంకారంతో పాండవులను అనేక ఇబ్బందులకు గురిచేశాడు. నిండుసభలో ద్రౌపది వస్త్రాపహరణము, లక్క ఇంటిలో పాండవ దహనము, పాండవ వనవాసము, విరాటరాజు కొలువులో మారువేషాలతో పాండవులు కాలం గడపటం – ఇవన్నీ దుర్యోధనుని అహంకార పూరితమైన వైఖరివల్ల జరిగిన చర్యలు. చివరకు దుర్యోధనుని అహంకారమే కురు, పాండవ యుద్ధానికి దారి తీసి కౌరవ నాశనం జరిగింది. పాండవుల పాలన కొనసాగింది. మహాభారతంలో దుర్యోధనునికి కొన్ని రాజలక్షణాలున్నా వాటికి మించి అతని స్వభావంలో అహంకారము గూడుకట్టుకున్నందువల్ల చివరకు అతనికి పతనం తప్పలేదు. ఇది అహంకార ఫలితమే.

## 2. వెటకారము :

మానవ అవలక్షణాలు, దుర్గుణాల్లో ఇది గూడా ఒకటి. వెటకారమనగా ఇతరులను చులకనగా, హేళనగా మాట్లాడటము. కొంతమంది ఇతరులను, గిట్టనివారి గురించి హేళనగా మాట్లాడతారు. ఈ హేళన అనేది ఇతరులను

చులకనగా అంటే మర్యాద లేకుండా, అగౌరవంగా,ఎగతాళిగా, లెక్కలేనితనంగా మాట్లాడే అంశము. ఈ విధమైన హేళన మాటలు, వెకిలి నవ్వులు మాట్లాడేవారి ప్రవర్తనను గూర్చి కూడా తెలియజేస్తాయి. ఇతరులు ఈ విధమైన సంభాషణల్లో తేలికైనవారని వారి భావన. వారు కూడా అగౌరవానికి గురవుతున్నారనే విషయాన్ని వారు గమనించరు. వెటకారపు మాటలవల్ల కొన్ని సందర్భాల్లో ఆ మాట్లాడేవారిని కూడా చులకనగా భావించడమే కాకుండా, జుగుప్సాకర వాతావరణం ఏర్పడే అవకాశం ఉంది. వెటకారపు మాటలవల్ల సాధించేది ఏమీ లేనప్పటికీ మాట్లాడినవారికి శత్రువులు పెరుగుతారు, బలంగా తయారవుతారు. హుందాతనం లేనందువల్ల వారి ప్రవర్తన గూడా చులకన అవుతుంది. ఈ విధంగా వెటకారపు వ్యాఖ్యలు, మాటలు ఎవరు మాట్లాడినా వాటిని సభ్యసమాజము మెచ్చదు, నచ్చదు. కనుక ముఖ్యంగా మన సంభాషణలో మర్యాదగా మాట్లాడటం అలవాటు చేసుకుంటే మన ప్రవర్తనను సభ్య సమాజము, ఇతరులు మెచ్చుకుంటారు. వెటకారానికి సంఘంలో అందరూ దూరంగా ఉండాలి. ముఖ్యంగా విద్యార్థులు ఈ వెటకారానికి చిన్నతనం నుండే దూరంగా ఉండే అలవాటు చేసుకున్నప్పుడే వారు మంచి పౌరులుగా తీర్చిదిద్దబడతారు.

**3) మమకారము :**

మమకారమనగా వాత్సల్యము, ప్రేమ. ఈ మమకారం తల్లిదండ్రులకు పిల్లల మీద, మంచి స్నేహితుల మీద, బంధువుల మీద ఉంటుంది. దీనికి తారతమ్యాలున్నాయి. మితిమీరిన మమకారం అనర్థాలకు దారి తీస్తుంది. నిజమైన ప్రేమికులకు ఒకరిమీద ఒకరికి మమకారం ఉంటుంది. నిస్వార్థపరులకు గూడా సమాజం మీద మమకారం ఉంటుంది.

**తల్లిదండ్రుల మమకారాన్ని పరిశీలిద్దాం :**

తల్లిదండ్రులకు సాధారణంగా వారి బిడ్డలే సర్వస్వము. వారి మీద మమకారాన్ని ప్రదర్శించి ప్రేమగా పెంచుతారు. మితిమీరిన మమకారం పిల్లలను చెడగొడుతుంది. విచక్షణా జ్ఞానంతో కూడిన మమకారాన్నే

తల్లిదండ్రులు పిల్లల మీద చూపించాలి. వారికి అవసరమైన వస్తువులను, దుస్తులను కొని విద్యను నేర్పించాలి. నేటి సమాజంలో కొందరి తల్లిదండ్రుల మమకారం వారి బిడ్డలను చెడగొట్టేదిగా ఉంటుంది. అలా ఉండకూడదు. కష్టపడి చదివటం నేర్పించాలిగానీ, ఏదోవిధంగా మా అమ్మాయి/ అబ్బాయి ఉత్తీర్ణులు కావాలనే అభిప్రాయముండకూడదు. కొందరు తల్లిదండ్రులు పరీక్షల సమయంలో పాఠశాల అధ్యాపకుల చుట్టూ, దళారీల చుట్టూ తిరుగుతారు. వారి పిల్లలు చదివినా, చదవకపోయినా మంచి మార్కులు రావాలి, ఉత్తీర్ణులు కావాలని ఆశిస్తారు. ఇది వారి అతి మమకారానికి, విచక్షణారహితమైన మమకారానికి ఉదాహరణ. బిడ్డలు తప్పు చేస్తే తల్లిదండ్రులు దండించాలి, తప్పు తీవ్రతను బట్టి శిక్షించాలి. ఆ విధంగా చేయకపోతే భవిష్యత్తులో వారు వారి తల్లిదండ్రులకే కాదు, సమాజానికి కూడా సవాలుగా మారే అవకాశం ఉంది.

**ప్రేమికుల మమకారాన్ని పరిశీలిద్దాము :**

నిజమైన ప్రేమకు స్వార్థముండదు. తాను ప్రేమించిన అమ్మాయి పరిస్థితుల ప్రభావం వల్ల వేరే వ్యక్తిని వివాహమాడినా, ఆ అమ్మాయి సుఖంగా ఉండాలని కోరుకుంటే అది నిజమైన మమకారం. కానీ ప్రస్తుత సమాజంలో అందుకు భిన్నమైన దృశ్యాలను మనం రోజూ టీవీఛానళ్ళలో, వార్తాపత్రికల్లో చూస్తున్నాము.తాను ప్రేమించిన అమ్మాయి తనను వివాహానికి నిరాకరించిందని ఆమెను చంపేవాళ్ళు, ఆత్మహత్య చేసుకునేవారు కోకొల్లలు. ఇది నిజమైన ప్రేమ, మమకారానికి నిదర్శనం కాదు. ఇది పూర్తిగా స్వార్థపూరిత చర్య.

**మహాభారతంలో దృతరాష్ట్రుని మమకారాన్ని పరిశీలిద్దాం :**

ఒకరకంగా చెప్పాలంటే దృతరాష్ట్రునిది పుత్ర మమకారం. అనగా దుర్యోధనుని మీద తనకున్న మమకారమే దుర్యోధనుని నాశనానికి, కౌరవుల నాశనానికి కారణభూతమైందంటారు. దుర్యోధనుని అధర్మ వైఖరిని దృతరాష్ట్రుడు ఖండించి ఉంటే భారత యుద్ధం జరిగేది కాదు. కౌరవ వంశం నాశనమయ్యేది కాదు. దుర్యోధనుడు చెడు చేసినా, పుత్రవాత్సల్యముతో తన మనసులో

సమర్థించి సంతోషించాడు. దృతరాష్ట్రుడు చివరకు దుర్యోధనుని హతమార్చిన పాండవుల మీద మనసులో ద్వేషం పెంచుకున్నాడు. ఈ లోకంలో పిల్లలు చేసే తప్పులను ఖండించకుండా సమర్థించి సంతోషించే తల్లిదండ్రుల సంఖ్యకు కొదవలేదనే చెప్పాలి. ఇదంత మమకారమే.

కనుక ప్రతి వ్యక్తి జీవితంలో అహంకార, మమకార, వెటకారాలను విడనాడాలని మానవతావాదులు, సంఘహితులు చెబుతున్నారు. విద్యార్థి లోకం చిన్నతనం నుంచే ఈ త్రిగుణాతీతులై ఉన్నచో వారికి మేలు జరుగగలదు.

# 20. సెల్‌ఫోన్ల వినియోగము - లాభ, నష్టాలు

కమ్యూనికేషన్ వ్యవస్థలో టెక్నాలజీ అభివృద్ధి చెందిన కారణంగా పెను మార్పులు సంభవించాయి. ఈ క్రమంలో లాండ్‌లైన్ల వాడకం తగ్గి సెల్‌ఫోన్ల వాడకం గణనీయంగా పెరిగింది, పెరుగుతుంది. ఈ సెల్‌ఫోన్ల వాడకంలో వయోబేధం లేదు. విద్యార్థుల దగ్గరనుండి వయోవృద్ధుల వరకు వారి దినచర్యలో భాగంగా సెల్‌ఫోన్లు వాడుతున్నారు.

భారతదేశంలో 2013వ సంవత్సరము నుండి 2018వ సంవత్సరం వరకు సెల్‌ఫోన్ల వినియోగదారుల గణాంకాలు ఈ విధంగా ఉన్నాయి.

| సంవత్సరము | వినియోగదారుల సంఖ్య (మిలియన్లలో) |
|---|---|
| 2013 | 524.9 |
| 2014 | 581.1 |
| 2015 | 638.1 |
| 2016 | 684.1 |
| 2017 | 730.7 |
| 2018 | 775.5 |

2019 నాటికి ఈ సంఖ్య 813.2 మిలియన్లకు చేరవచ్చునని గణాంకాల అంచనా.

మరొక సర్వే ప్రకారం భారతదేశ జనాభా 130 కోట్లని, సెల్‌ఫోను వినియోగదారుల సంఖ్య 120 కోట్లమందని గణంకాల వివరణ. వీరిలో కొంతమందికి అసలు సెల్‌ఫోన్లు లేకపోవచ్చు, కొంతమందికి రెండు అంతకు మించి కూడా ఉండవచ్చు.

ఈ సెల్‌ఫోన్లని మొబైల్‌ఫోన్లని, స్మార్ట్‌ఫోన్లని పిలుస్తారు. ఈ సెల్‌ఫోనులను మన ఆఫీసుకుగాని, పనిచేసే స్థలానికిగాని, బజారుకుగాని, ఏదైనా ఊరు వెళ్ళేటప్పుడుగాని, జేబులో పెట్టుకొనిగాని, బ్యాగ్‌లో పెట్టుకొనిగాని,

వెళతాం. సెల్యులర్ రేడియో సిస్టమ్‌కు దీనికి యాక్సిస్ ఉంటుంది. కొందరు వారికొచ్చే కాల్స్‌ని, మేసేజెస్‌ని చూడటానికి, ఎవరికైనా కాల్ చేయటానికి, మెసెజ్ పెట్టడానికి ఉపయోగిస్తారు.

స్మార్ట్ ఫోనులో ఇంటర్నెట్ సౌకర్యం కూడా ఉంటుంది.

**సెల్‌ఫోను వల్ల లాభాలు :**

1) మొబైల్ ఫోన్ల ద్వారా మన కుటుంబ సభ్యులతో, బంధువులతో, స్నేహితులతో సాధారణంగా మాట్లాడుతుంటాము. ఈ మాట్లాడటానికి దూరంతో సంబంధం లేదు. మనం ఎక్కడున్నవారితోనైనా మాట్లాడవచ్చు. ప్రపంచంలో మనకు తెలిసినవారితో, బంధువులతో, స్నేహితులతో, మన పిల్లలతో, వారి పిల్లలతో మాట్లాడుకునే అవకాశం ఉంది. గతంలో మన కుటుంబంలో ఎవరైనా విదేశాల్లో ఉంటే వారికి ఉత్తరం వ్రాయాలన్నా, వారు వ్రాసినా ఎయిరోగ్రాము ద్వారా ఉత్తరాలు పంపేవారు. ఇప్పుడు అటువంటి ఉత్తరాలతో అవసరం లేదు. ఒక నిమిషంలో ఏ దేశంలో ఉన్నవారితోనైనా మాట్లాడవచ్చు. ఈ సౌకర్యం సెల్‌ఫోన్ల ద్వారానే సాధ్యమైంది.

2. వ్యాపారాల ఉత్తర, ప్రత్యుత్తరాలే కాకుండా మనం ఏదైనా ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టాలన్నా, కొన్ని యాప్స్‌ని డౌన్‌లోడ్ చేసుకొని మన సమాచారాన్ని పంపవచ్చు. కొన్ని సెల్‌ఫోన్ కంపెనీల ఉద్యోగాలకు కూడా సెల్‌ఫోన్‌ద్వారా మనం అప్లయి చేయవచ్చు, ఉద్యోగాన్ని పొందవచ్చు.

3. విద్యార్థులు కొన్ని విద్యాసంస్థల్లో చేరటానికి మొబైల్ ఫోన్ల ద్వారా వారి అప్లికేషన్లు పంపవచ్చు. వారి సబ్జెక్టులకు సంబంధించిన సమాచారాలను రాబట్టవచ్చు, తెలుసుకొని చదువవచ్చు.

4. సెల్‌ఫోన్ల ద్వారా చిన్నపిల్లలు 'కార్టూన్‌షో'లు చూస్తారు. అనేకరకాల ఆటలు, వినోద కార్యక్రమాలు చూస్తారు. వారు బయటకు వెళ్ళకుండా తల్లిదండ్రుల పర్యవేక్షణలో ఉంటారు.

5. సెల్‌ఫోనుకి జి.పి.యస్. అనుసంధానించడం ద్వారా మనం ఏదైనా తెలియని ప్రదేశానికి సులభంగా, ఎవరినీ దారి అడక్కుండా వెళ్ళవచ్చు. జి.పి.యస్. మనకు కావలసిన సూచనలిస్తుంది. మనం ఉన్న ప్రదేశాన్ని మన స్నేహితులకు తెలియజేయవచ్చు. ఒక నగరంలో ఉన్న, మనకు దారి తెలియని విమానాశ్రయానికిగాని, రైల్వేస్టేషన్‌కిగాని, బస్సుస్టేషన్‌కిగాని జి.పి.యస్. సూచనలతో సులభంగా చేరవచ్చు.

6. మనం ఉదయం పెందలకడ నిద్ర లేవాలనుకున్నా, ఏదైనా ప్రయాణం ఉండి తెల్లవారకముందే లేవాలన్నా మనకు మెలకువ రాకపోవచ్చు. అటువంటి సందర్భాల్లో సెల్‌ఫోనులో ఉన్న అలారం పెట్టుకుని మనం అనుకున్న సమయానికి ఖచ్చితంగా లేవవచ్చును.

7. ప్రస్తుత ఫ్యాషన్ ప్రపంచంలో మంచి సెల్‌ఫోను లేకుండా కొంతమంది ముఖ్యమైన ఫంక్షన్లకు వెళ్ళడానికి కూడా సందేహిస్తారు.

8. సెల్‌ఫోనులో ప్రస్తుతం ఉన్న అన్నీ డివైస్‌లు ఫోనులోనే సెట్ చేసి ఉంటాయి. మనం పాత క్యాలెండర్‌ను చూడాలనుకుంటే వెంటనే చూడగలము. చేతి గడియారంతో పనిలేకుండా సెల్‌ఫోన్‌లో 'టైం' చూడగలము. మనకు కాలిక్యులేటర్‌తో పనిలేకుండానే సెల్‌ఫోనులో ఉన్న కాలిక్యులేటర్‌ను వాడవచ్చును. దానిని మనం ప్రత్యేకంగా కొనాల్సిన అవసరం లేదు.

9. డేటా ట్రాన్స్‌ఫర్‌ను ఒక ఫోను నుండి మరొక ఫోనుకు చేయవచ్చును. మన ఫోటోలు, వీడియోలు, ముఖ్యమైన పేపర్లు సులభంగా మరొకరికి పంపవచ్చును.

10. ఎవరైనా తప్పిపోయినా, కిడ్నాప్‌కి గురైనా కాల్‌డేటాను బట్టి వారున్న ప్రదేశాన్ని గుర్తించవచ్చును.

11. మన కుటుంబసభ్యులుగాని, స్నేహితులుగాని, ముఖ్యమైన స్నేహితులు గాని వారు ఎక్కడ ఉన్నారో, ఏమి చేస్తున్నారో యాప్ ద్వారా

తెలుసుకోవచ్చును. ఇంతవరకు మనం సెల్‌ఫోన్ ఉపయోగాలను చూసాం.

**సెల్‌ఫోను వల్ల నష్టాలను చూద్దాం**

1. మన కుటుంబసభ్యులుగాని, చుట్టాలుగాని, స్నేహితులుగాని, బాగా తెలిసినవారుగాని మనకు ఫోన్ చేసినప్పుడు మనం ఎవరితోనైనా మాట్లాడుతుంటే వేరువారు మనతో మాట్లాడలేరు. వారు అసహనానికి గురవుతారు. తరువాత మనమీద వారికి కోపంరావచ్చు. వారి హృదయంలో ద్వేషించే అవకాశం గూడా ఉండవచ్చు.

2. సెల్‌ఫోను ఎక్కువ సమయం మాట్లాడినందువల్ల మన సమయం వృథా అవుతుంది. గంటల తరబడి సెల్‌ఫోను మాట్లాడే సమయాన్ని మనం మంచి పనులకు ఉపయోగించవచ్చు.

3. సెల్‌ఫోను ఎక్కువ సమయం మాట్లాడినందువల్ల మన శక్తి కూడా వృథా అవుతుంది. మన శరీర భాగాలైన కళ్ళు, చేతులు, మనస్సుయొక్క శక్తి వృథా అవుతుంది.

4. మొబైల్ ఫోను ఎక్కువగా మాట్లాడితే చర్మవ్యాధులు, కేన్సర్, కళ్ళ సమస్యలు వచ్చే అవకాశముంది.

5. చదువుకునే విద్యార్థులకు వారు చదువుకునే సమయం వృథా అవుతుంది. తరువాత చదువుకుందామనుకుంటే నిద్రరావచ్చు. ఏకాగ్రత ఉండవకపోచ్చు.

6. **సెల్‌ఫోన్లుద్వారా మరణాలు సంభవిస్తాయి.**

కొంతమంది సెల్‌ఫోను మాట్లాడుతూ డ్రైవింగ్ చేస్తారు. అవి ఫోర్‌వీల్స్ కావచ్చు, టూవీలర్స్‌కావచ్చు, సైకిల్‌కావచ్చు, ఆటోకావచ్చు, సెల్‌ఫోను మాట్లాడుతూ డ్రైవ్ చేస్తూ మరణించిన వారి సంఖ్య కూడా తక్కువేమీ కాదు. కొన్నిసార్లు వారెట్లున్నా ఇతరులు గూడా ప్రమాదాలబారిన పడతారు.

7. మన సెల్‌ఫోన్‌లో ఉన్న డేటాని ఇతరులు చోరీ చేసే అవకాశం ఉంది. కొంతమంది సెల్‌ఫోన్లు దొంగతనం చేసి, దొంగతనాన్నిగాని, దోపిడీలకు గాని పాల్పడితే వారు దొంగిలించిన సెల్‌ఫోన్ సిమ్ కార్డుని అక్కడ వదలి వెళితే ఎవరి ఫోన్ అయితే దొంగిలించబడ్డదో వారు ఇబ్బందుల్లో పడే అవకాశం, లీగల్ సమస్యలు ఎదుర్కొనే అవకాశం ఉంటుంది.

8. మన సెల్‌ఫోనులో ఉన్న మన ఫోటోలు, వీడియోలు, బ్యాంకు ఎకౌంటు నంబర్లు, ఇంకా విలువైన సమాచారాన్ని ఇతరులు దొంగిలించి ఆ ఫోటోలను మార్ఫింగ్ చేసి మనలను బ్లాక్‌మెయిల్ చేసి డబ్బులు డిమాండ్ చేసే అవకాశం ఉంది లేక సోషల్ మీడియాలో ఉంచి మన పరువు ప్రతిష్ఠలను దెబ్బతీయవచ్చు.

9. సెల్‌ఫోను వాడకం వలన జ్ఞాపకశక్తి నశిస్తుంది. ఒకప్పుడు సెల్‌ఫోను వాడకముందు నాకు కనీసం 40 ఫోన్ నంబర్లు గుర్తుంటే, ప్రస్తుతం రెండు నంబర్లు కూడా గుర్తులేవు. కొన్నిసార్లు నా లాండ్ లైన్ నెంబరు కూడా వెంటనే గుర్తురాదు. పొరపాటున సెల్‌ఫోను పోతే నేను ఎవరికీ ఫోన్ చేయలేను. ఎవరి నంబరు నాకు గుర్తు లేదు, గుర్తు రాదు. గనుక సెల్‌ఫోను ఉపయోగించడవల్ల నశించిన జ్ఞాపకశక్తి, బుద్ధిమాంధ్యం వల్ల కలుగుతుంది.

10. మార్చి 2018లో నేను ఒక ఎలక్ట్రికల్ షాపుకి వెళ్ళి మూడు జీరో బల్బులు తీసుకున్నాను. ఒక్కొక్క బల్బు ఖరీదు ఎంత అని షాపులో నాకు బల్బులు ఇచ్చిన గుమస్తాను అడిగాను. అతను క్యాలిక్యులేటర్లో 3×15 =45 అని చెప్పాడు. అంటే దీనికి కాలిక్యులేటర్ అవసరం లేదు. నోటితో చెప్పవచ్చు. నాకు అర్ధమయిందేమంటే అతనికి ఎక్కాలు రావని. ఇదంతా సెల్‌ఫోన్‌లో ఉన్న కాలిక్యులేటర్ మహిమే!

11. సెల్‌ఫోను ఉన్నందువలన, ఆ ఉన్నవారు వాటితో మాట్లాడుతున్నందు వలన, ఎక్కడ ఉన్నా మనం ఫోన్ చేస్తే వారు ఉన్న ప్రదేశం గాకుండా అబద్ధాలు చెప్పే అవకాశం ఉంది. సెల్‌ఫోను వారిని అబద్ధాలు

మాట్లాడేవారిగా మారుస్తుందన్నమాట.

12. కొంతమంది కళాశాల విద్యార్థులు వారి సెల్‌ఫోనులో ఉన్న ఇంటర్‌నెట్ ద్వారా బూతుబొమ్మలు, అశ్లీల దృశ్యాలను చూడటం గమనించాం. అంటే సెల్‌ఫోను విద్యార్థులను చెడగొడుతుంది, చెడుని ప్రోత్సహిస్తుంది. అది చూసే వారి మనస్తత్వాన్నిబట్టి జరుగుతుంది. కొంతమంది విద్యార్థులు తరగతి గదుల్లో చివరి బల్లలమీద కూర్చుని సెల్‌ఫోన్‌లో దృశ్యాలు చూస్తున్నారనే వార్తలు కూడా వింటున్నాము.

ఇవన్నీ సెల్‌ఫోనుయొక్క దుష్పరిమాణాలే. ప్రస్తుతం ఒకరోజు ఆహారము, నీరు లేకపోయినా బ్రతకవచ్చు గాని సెల్‌ఫోను లేకపోతే బ్రతకలేమనే స్థాయికి కొంతమంది చేరినట్లుగా వార్తలు వింటున్నాము. ఇది ఒక ఆశ్యర్యకరమైన మార్పే.

సెల్‌ఫోన్‌లో అనేక రకాలున్నాయి. టచ్ స్క్రీన్ ఫోన్లు సహజంగా ధర ఎక్కువగా ఉంటాయి. అవి త్వరగా చెడిపోతుంటాయి కూడా. వాటిని కొంతమంది తరచూ మారుస్తుంటారు. ఆ విధంగా సెల్‌ఫోన్లు మీద ఎక్కువ ధనాన్ని వ్యయం చేసేవారు కూడా ఉన్నారు.

చివరిగా ఒక మాట విద్యార్థులైనా, పెద్దవారైనా సెల్‌ఫోనుని, సెల్‌ఫోను టెక్నాలజీని మంచికి ఉపయోగించినంతకాలం సెల్‌ఫోనువల్ల ఉపయోగమే కాని నష్టం ఉండదు. ఆ విధంగా ఉపయోగించకపోతే సెల్‌ఫోను వల్ల లాభం కంటే నష్టాలే ఎక్కువగా ఉంటాయి.



# 21. విద్యార్థులు - సివిక్‌సెన్స్

'సివిక్‌సెన్స్' అనే పదం ఆంగ్ల పదం. దీని అర్థం మనం మన చర్యల ద్వారాగానీ, ప్రవర్తన ద్వారాగానీ ఇతరులకు ఏవిధమైన అసౌకర్యాన్ని, ఇబ్బందిని కలిగించకుండా ఉండటము.

ముఖ్యంగా మన దైనందిన జీవితంలో మనం ఈ సివిక్‌సెన్స్‌ని పాటించాలి. విద్యార్థులు, ఉద్యోగస్తులు, వివిధ రకాల వ్యాపారులు ఉదయం నుండి రాత్రి వరకు వారి వారి దైనందిన కార్యక్రమాలలో నిమగ్నులవుతారు. విద్యార్థులు పాఠశాలకు, కళాశాలలకు వెళ్ళి వారి చదువులు కొనసాగిస్తుంటారు. ఈ సమయంలో వారి మేనర్స్, మేనరిజమ్స్ ఎలా ఉండాలి, వారు సహచర విద్యార్థులు, అధ్యాపకులు, ఇతర పెద్దలతో ఎలా మెలగాలి, పబ్లిక్ ప్లేసెస్ అయిన హోటళ్ళు, సినిమాహాల్స్, రహదారిమీద రాకపోకలందు వారి ప్రవర్తన ఏవిధంగా ఉండాలి, ఎలా ఉండాలి ఇవన్నీ సివిక్‌సెన్స్ క్రిందకే వస్తాయి.

పబ్లిక్ జీవితంలో డీసెంట్‌గా ప్రవర్తించడం ప్రతి ఒక్క పౌరుడి కనీస ధర్మం.

విద్యార్థులు పాఠశాల, కళాశాల పనివేళల్లో ఆవరణలో కేకలు వేయటం, అరవటం, ఈలల వేయటం, చప్పట్లు కొట్టి ఇతరులను పెద్దగా పిలవటం ఇవన్నీ ఇండీసెంట్ అనగా సివిక్‌సెన్స్ లేని పనులే. మనతోటి విద్యార్థులతోగాని, మన తరగతి విద్యార్థులతోగాని ఏదైనా అవసరముంటే నేరుగా వారి దగ్గరకు వెళ్ళి మెల్లగా మాట్లాడాలి. మనం మాట్లాడే విధానంలో ఇతరులకు, వారి కార్యకలాపాలకు ఆటంకం కలుగరాదు. వారిని అసౌకర్యానికి గురి చేయరాదు. దీనినే సివిక్‌సెన్స్ అంటారు. కొంతమంది విద్యార్థులు తరగతి గదిలో అధ్యాపకులు పాఠ్యాంశాల బోధనలో నిమగ్నమై ఉన్నప్పుడు వారు లేటుగా వచ్చి ఆ తరగతి గదిలోకి వెళ్ళాల్సి ఉంటే ఆ అధ్యాపకుడు గమనించి ఆ విద్యార్థిని కమ్ ఇన్ అనేవరకు వెళ్ళకూడదు. లేక ఆ టీచర్‌ని ఏక్స్‌క్యూజ్‌మీ సర్ / మేడమ్ అని అడిగి, వారు అనుమతించినాకే లోపలికి వెళ్ళి కూర్చోవాలి. అలా గాకుండా తరగతి గదిలో ఉన్న టీచర్ అనుమతి లేకుండా పోయి

తరగతి గదిలో కూర్చుంటే దానిని 'మొరటు ప్రవర్తన' అంటారు. ఆ విద్యార్థికి సివిక్‌సెన్స్ లేదు అని అర్థము.

కొంతమంది విద్యార్థులు వెనుక బెంచీలో కూర్చొని అధ్యాపకుడు పాఠం బోధిస్తుండగా గుసగుసలాడుకుంటారు. ఆ బెంచీలో ఉండి శ్రద్ధగా పాఠం వినే మిగతా విద్యార్థులకు ఇబ్బందిగా ఉంటుంది. కానీ వారు ధైర్యం చేసి టీచర్‌కు చెప్పలేరు. ఆ టీచర్ గమనించి మీరెందుకు గుసగుసలాడు కుంటున్నారని అడిగితే మేము మాట్లాడటం లేదని సమాధానం వస్తుంది. అంటే చిన్న విషయానికే వారు అబద్ధాలు చెబుతున్నారన్నమాట. ఇండీసెంట్ ప్రవర్తన, సివిక్‌సెన్స్ లేనందువల్లే ఈ విధంగా జరుగుతుంది.

కొందరు పెన్‌గాని, నోట్సుగాని మరచిపోయి రావటమో, మధ్యలో రీఫిల్ అయిపోవటమో సాధారణంగా జరుగుతుంది. అట్టివారు మర్యాదగా తోటి విద్యార్థులను అడిగితే రెండు పెన్నులున్నవారు ఒకటి ఇస్తారు. కానీ అలాగాకుండా చేతి సైగలతో అడిగితే వారు సైగలతో లేదంటారు. మనకు చిన్న చిన్న ఏ అవసరము తరగతి గదిలో ఏర్పడినా తోటి విద్యార్థులను మర్యాదగా అడగాలి. తరువాత వారికి ధన్యవాదాలు తెలపాలి. ఇవి మంచి మ్యానర్స్. కొంతమంది మరచిపోయామని, ఇచ్చినవారు అడిగేవరకు వారి పెన్ వారికి ఇవ్వరు. మన అవసరానికి ఏ వస్తువునైనా ఇతరులను డిమాండ్ చేసే హక్కు మనకు లేదు. కేవలము గుడ్ మేనర్స్ వలనే సంఘ జీవనం సాఫీగా సాగగలదు. ఇది సివిక్‌సెన్స్‌లో భాగమే.

కొందరు విద్యార్థులు పరీక్ష ప్రారంభము అయిన అరగంటనుండే గుసగుసలాడుకుంటారు. ఫలాన ప్రశ్నకు సమాధానమేమిటి? బిట్ పేపరు చూపించమని మెల్లిగా అడుగుతుంటారు. ఈ చర్య శ్రద్ధగా పరీక్ష వ్రాసే విద్యార్థులకు డిస్ట్రబెన్స్‌గా ఉంటుంది. వారు అసౌకర్యానికి గురౌతారు. వారి ఏకాగ్రతకు భంగం కలుగుతుంది. ఈ విషయాన్ని గుసగుసలాడేవారు గమనించరు. వారి ధోరణిలోనే వారుంటారు. ఇదికూడా ఇబ్బందికరమైన వాతావరణాన్ని సృష్టిస్తుంది. కొందరికి సివిక్‌సెన్స్ లేనందువల్లే ఈవిధంగా

జరుగుతుంటుంది.

ఎవరు సినిమాకెళ్ళినా వారి ధ్యేయం సినిమా చూసి ఆనందించటమే. ఈ క్రమంలోనే టిక్కెట్లు కొని సినిమాహాల్లో కూర్చుంటాము. కొందరు యువకులు సినిమాహాల్లో డైలాగులు, పాటలు, కొన్ని సన్నివేశాల్లో ఈలలు, కేకలు, కేరింతలు కొడతారు. సినిమా తెరమీద పాట వస్తుంటే మరలా వీరు వీళ్ళ సీట్లలో కూని రాగాలు తీస్తుంటారు. ఈ వాతావరణమంతా కొంతమందికి ఇబ్బందికరంగా ఉంటుంది. ప్రతి ఒక్కరికి సినిమా చూసి ఆనందించే హక్కు ఉందిగాని, గోల చేసి, కేకలు వేసి, ఈలలు వేసి, కూనిరాగాలు తీసి ఇతరులకు ఇబ్బందిని, అసౌకర్యాన్ని కలిగించే హక్కు లేదు. ఇది సివిక్‌సెన్స్ లోపించటమే.

హోటళ్ళు, టీ, కాఫీ షాపులు కూడా పబ్లిక్ స్థలాలే. ఎవరైనా వెళ్ళవచ్చు. ఇక్కడ కూడా కొంతమంది ఇండీసెంట్‌గా ప్రవర్తిస్తారు. ఇతరులకు అసౌకర్యాన్ని, ఇబ్బందిని కలుగజేస్తారు. ఒక టేబుల్ దగ్గర ముగ్గురు, నలుగురు కూర్చొని వారికిష్టమొచ్చిన సంభాషణ పెద్దపెద్దగా మాట్లాడుకోవడం, వెకిలినవ్వులు నవ్వటం, అరచుకోవటాలు, ఇవన్నీ ఇతరులకు ఇబ్బందిని కలిగించే అంశాలే. కొంతమంది టేబుల్ మేనర్స్ కూడా ఎదుటివారిని ఇబ్బంది పెడతాయి. కొంతమంది కాఫీ తాగుతుంటే పెద్ద శబ్దం వస్తుంది. అది ఒక గేదె కుడితి తాగినంత శబ్దం వస్తుంది. ఇదికూడా ఇతరులను ఇబ్బంది పెట్టే అంశమే. పబ్లిక్ స్థలాల్లో ప్రతి ఒక్కరూ డీసెంట్‌గా సివిక్‌సెన్స్‌తో ప్రవర్తించాలి.

కొందరు ప్రయాణం చేసేటప్పుడు బస్సులోగాని, రైలులోగాని కూర్చున్న వెంటనే నిద్రకు ఉపక్రమిస్తారు. వారితల పక్కవారి భుజం మీద పడుతుంది. పక్కవాడు ఆ తలని పక్కకు నెడతాడు. అతడు మేల్కొని మరలా వెంటనే నిద్రమత్తులో అదే పని చేస్తాడు. ప్రయాణికుడు నిద్రపోతే ప్రక్క ప్రయాణికుడు ఇబ్బందిపడతాడు. మరొక వ్యక్తి గురకపెట్టి నిద్రపోతాడు. ఆ గురక శబ్దము చాలామందికి ఇబ్బందికరంగా ఉంటుంది. కొందరు బస్సులో కూర్చున్న తరువాత కక్కుకుంటారు. ప్రక్కవాని బట్టలమీద కూడా ఎంగిలి మెతుకులు పడతాయి. ఇదంతా ఇబ్బందికర వాతావరణమే. మరికొందరు కూర్చున్న

వెంటనే చుట్టనో, బీడీనో, సిగరెట్టో కాలుస్తారు. ఆ పొగంతా ఇతరులు పీల్చాలి. ఇది కూడా అసౌకర్యమైనదే, ఇతరులను ఇబ్బందికి గురిచేసే అంశమే.

ఎ.జి. గార్డెనర్ అనే ఆంగ్ల రచయిత 'ఆన్ ది రూల్ ఆఫ్ ది రోడ్' అనే వ్యాసంలో లండన్ నగరంలో నడిరోడ్డుమీద నెత్తిమీద పండ్ల గంపతో అడ్డదిడ్డంగా నడుచుకుంటూ ఒక బలమైన స్త్రీ వెళుతూ ఉంటుంది. వెనుక వచ్చే వారికి ఆమె నడకతీరు ఇబ్బందికరంగా ఉండి వారు రోడ్‌కి ఎడమప్రక్కన నడవమని సలహాఇచ్చారు. అందుకామె నేను స్వంతదేశంలో ఉన్నాను. నా ఇష్టమొచ్చినట్లు నడుస్తానన్నది. ఆమెకు రోడ్డుమీద నడిచే హక్కు ఉందన్న మాట వాస్తవమే కానీ ఇతరుల స్వేచ్ఛ, ఇతర ప్రయాణీకులను ఇబ్బంది, అసౌకర్యానికి గురి చేసే హక్కు ఆమెకు లేదు. ఇతరులను అసౌకర్యాలకు, ఇబ్బందులకు గురిచేస్తున్నాననే సివిక్‌సెన్స్ తనకు లేదని ఆమె గ్రహించలేదు. అందువల్లే ఆమె వల్ల ఇతర ప్రయాణీకులు ఇబ్బందులకు గురి అయ్యారు.

మనం కూడా రోడ్లమీద వెళ్ళేటప్పుడు ఇతరులకు ఇబ్బంది కలగకుండా, అసౌకర్యానికి గురిచేయకుండా ఉండటం నేర్చుకుని పాటిస్తే సివిక్‌సెన్స్ ఉన్నవారమవుతాం. సెల్‌ఫోను మాట్లాడుతూ డ్రైవ్ చేయటం, నడిరోడ్డు గుండా నడవటం, ఒకే టూవీలర్‌మీద ముగ్గురు లేదా నలుగురు ఎక్కి డ్రైవ్ చేయడంవల్ల ప్రమాదాలు జరిగే అవకాశముంది. ఇతరులను ఇబ్బంది పాలు చేసే హక్కు మనకు లేదు. ఇదంతా సివిక్‌సెన్స్ పాటించకపోవడమే.

కొన్ని ప్రాంతాల్లో అప్పుడప్పుడు ఫంక్షన్స్ చేసుకునే సందర్భంలో రాత్రి పొద్దుపోయేవరకు మైకు పెద్దగా పెట్టి రకరకాల పాటలు, రికార్డింగు డాన్సులతో హోరెత్తిస్తారు. ఆ పరిధిలో తెల్లవారితే పబ్లిక్ పరీక్ష వ్రాయవలసిన ఇంటర్, డిగ్రీ, ఇంజనీరింగ్ విద్యార్థులు ఉన్నచో వారికి అసౌకర్యము, ఇబ్బందులు వర్ణనాతీతం. వారికి ఏమి చేయాలో, ఎవరికి చెప్పాలో అర్థంకాని స్థితి.

ఒక వ్యక్తి మంచి గాయకుడు, మరో వ్యక్తి మంచి పియానిస్టు, మూడవ వ్యక్తి మంచి వయోలినిస్టు. కానీ వారికి వారి పనితనాన్ని ప్రదర్శించటానికి పరిమితులున్నాయి. నేను మంచి సింగర్‌నని అర్ధరాత్రి వీధిలో పాడతానంటే

ఆ వీధిలో ఉన్న జనం లేచి వచ్చి మాకు నిద్రాభంగం చేసే హక్కు మీకు లేదు కాని పాటలు పాడే హక్కు మీకుంది. దానికి పరిమితులున్నాయని అతనిని పంపివేస్తారు. ప్రతి విషయంలోనూ ప్రతి పౌరుడు ఇతరులను ఇబ్బందికి గురిచేయకుండా చూసుకోవాలి.

కొందరు తాగి అర్ధరాత్రి వరకు బజారులో ఏవో వాగుతుంటారు. పెద్ద పెద్దగా కేకలు వేస్తుంటారు. ఆ దగ్గరలో ఉన్న ఇళ్ళ వారికి నిద్రాభంగం అవుతుంది. వారు తాగుబోతు వ్యక్తితో కలహించరు. ఇది కూడా ప్రజలను ఇబ్బందికి గురిచేసే వాతావరణమే, పరిస్థితే. సివిక్‌సెన్స్ ఉంటే తాగినవారు కూడా నడివీధిలో గోలచేయకుండా ప్రశాంతంగా వారి ఇంటికి వెళ్ళి నిద్రిస్తారు.

కనుక విద్యార్థులారా చాలా ఉదాహరణల ద్వారా ఈ 'సివిక్‌సెన్స్' అనే అంశాన్ని పరిశీలించాము. మీరు మీ జీవితంలో ఈ సివిక్‌సెన్స్‌ను కలిగి ఉండి ఇతరులకు మీ ప్రవర్తన, చర్యలద్వారా ఇబ్బందులు కలిగించకుండా ఉంటారని ఆశిస్తున్నాను.



# 22. విద్య - ప్రయోజనాలు - లక్ష్యాలు

'విద్' అనే ధాతువు నుండి 'విద్య' అనే పదము వచ్చింది. విద్య అనగా 'చదువు', 'జ్ఞానము' అని అర్ధం. మనదేశంలో అనేక దశలలో విద్యాబోధన జరుగుతుంది. 1. పాఠశాల విద్య 2. ఇంటర్మీడియట్ విద్య 3. ఉన్నత విద్య ఈ అంశములలోని డేటాను ఇంటర్నెట్ గూగుల్, ఈనాడు దినపత్రిక నుండి తీసుకున్నాను.

పాఠశాల విద్యకు రెండు, మూడు దశలున్నాయి. 1. ఎలిమెంటరీ విద్య 2. అప్పర్‌ప్రైమరీ విద్య. 3. ఉన్నత పాఠశాల విద్య. కొన్ని రాష్ట్రాల్లో ఉన్నత పాఠశాల విద్యలో 12వ తరగతి వరకు ఉన్నది. మన రాష్ట్రంలో 10వ తరగతి వరకు పాఠశాల విద్యాబోధన జరుగుతుంది. ఇటీవల విశ్వవిద్యాలయ ఉపకులపతుల సమావేశంలో రాష్ట్ర ముఖ్యమంత్రిగారు ఇంటర్మీడియట్ విద్యను పాఠశాల విద్యతో కలిపి ఆంధ్రప్రదేశ్‌లో రెండు దశలలోనే విద్యావిధానం కొనసాగేలా ప్రయత్నం చేస్తామన్నారు. అంటే విద్యా విధానము 1. పాఠశాల 2. కళాశాల లేక ఉన్నత విద్యగా కొనసాగుతుందని అర్ధము.

భారతదేశ అక్షరాస్యతా శాతాన్ని పరిశీలిద్దాము. దేశంలో 29 రాష్ట్రాలు, 7 కేంద్రపాలిత ప్రాంతాలు ఉన్నాయి. ఈ మొత్తం 36 రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ అక్షరాస్యతాపరంగా వెనుకబడ్డ రాష్ట్రాలలో ఐదవ రాష్ట్రంగా 2011 జనాభా లెక్కల ప్రకారం ఉన్నది. వివిధ రాష్ట్రాల అక్షరాస్యతా శాతం ఈవిధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| (1) కేరళ - 93.93 | (2) లక్షద్వీప్ - 92.28 |
| (3) మిజోరాం - 90.28 | (4) త్రిపుర - 87.75 |
| (5) గోవా - 87.40 | (6) డామన్ & డయ్యు - 87.07 |
| (7) పాండిచ్చేరి - 96.55 | (8) చండీఘర్ - 86.43 |
| (9) ఢిల్లీ - 96.34 | (10) అండమాన్&నికోబార్–83.75 |
| (11) హిమాచల్‌ప్రదేశ్ - 82.91 | (12) మహారాష్ట్ర - 82.81 |

(13) సిక్కిం - 82.20 (14) తమిళనాడు-80.33

(15) నాగాలాండ్ - 80.11 (16) మణిపూర్ - 79.95

(17) ఉత్తరాఖండ్ - 79.63 (18) గుజరాత్ - 79.31

(19) దాదర్ అండ్ నాగర్‌హవేలి - 77.65

(20) పశ్చిమబెంగాల్ (బంగ్లా) - 77.08

(21) పంజాబ్ - 76.68 (22) హరియాణా - 76.64

(23) కర్ణాటక - 75.60 (24) మేఘాలయ - 75.40

(25) ఒరిస్సా - 73.45 (26) చత్తీస్‌ఘడ్ - 71.04

(27) అస్సాం-73.18 (28) మధ్యప్రదేశ్ - 69.74

(29) ఉత్తరప్రదేశ్ - 69.72 (30) జమ్ము & కాశ్మీర్ - 68.74

(31) ఝార్ఖండ్ - 67.63 (32) ఆంధ్రప్రదేశ్ - 67.4

(33) రాజస్థాన్ - 67.06 (34) అరుణాచల్‌ప్రదేశ్ - 66.95

(35) తెలంగాణా - 66.05 (36) బీహార్ - 63.82

**భారతదేశ అక్షరాస్యతా శాతం 70.04 గా ఉన్నది.**

మన దేశ ఉన్నత విద్యను పరిశీలిస్తే అఖిల భారత ఉన్నత విద్య సర్వే ప్రకారము వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1) ఉన్నత విద్యను అభ్యసించేవారి శాతం - 30.90.

2) ఉన్నత విద్యను అభ్యసించేవారి సంఖ్య 32 శాతానికి మించటం లేదు.

3) 2016-17తో పోలిస్తే 2017-18లో మరింత ఆందోళనకరంగా ఉంది.

4) అఖిల భారత ఉన్నత విద్య సర్వే నివేదికను కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖ ది. 27-7-2018న విడుదల చేసింది. ఆ వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

ఎ) 2015-16లో ఉన్నత విద్యా ప్రవేశాలు 30.8 శాతం.

బి) 2016-17లో 32.4 శాతానికి పెరిగింది.

సి) 2017–18లో 30.91 శాతానికి పడిపోయింది.

డి) దేశవ్యాప్తంగా ఎక్కువ కళాశాలలు ఉన్న ఎనిమిది రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఐదవ రాష్ట్రంగా ఉంది.

ఇ) వివిధ రాష్ట్రాలలోని కళాశాలల్లో 82 శాతం ప్రైవేట్ కళాశాలలు కావటం విశేషం.

ఎఫ్) ప్రతి లక్షమందికి (18–23 ఏళ్ళు) జాతీయ సరాసరి 28 కళాశాలలు ఉండగా ఆంధ్రప్రదేశ్‌లో ఈ సంఖ్య 48గా ఉంది.

జి) దేశవ్యాప్తంగా అధిక కళాశాలలున్న పది జిల్లాలలో గుంటూరు జిల్లా తొమ్మిదోస్థానంలో ఉంది. గతంలో 296 కళాశాలలు ఉండగా ఇప్పుడు ఆ సంఖ్య 303కి చేరింది.

హెచ్) ఉన్నతవిద్యలో స్త్రీ, పురుష శాతాలు ఈ విధంగా ఉన్నాయి.
పురుషుల శాతం 51.9 కాగా, స్త్రీల శాతం 48.1గా ఉన్నది.
పి.హెచ్.డి. స్థాయిలో పురుషులశాతం 57కాగా, స్త్రీలశాతం 42.6.

ఐ) 18.5 శాతం కళాశాలల్లో 100 మందిలోపే ప్రవేశాలున్నాయి. 3.6 శాతం కళాశాలల్లో మాత్రమే 3 వేలకు పైగా విద్యార్థులు ప్రవేశాలు పొందు తున్నారు.

జె) దేశవ్యాప్తంగా 188 రకాల కోర్సులు ఉండగా ఎక్కువగా పది రకాల కోర్సుల్లోనే 81.2 శాతం మంది విద్యనభ్యసిస్తున్నారు. 79.2 శాతం మంది డిగ్రీలో చేరుతుండగా పి.హెచ్.డి. చేస్తున్నది కేవలము 0.5 శాతమే. ఎక్కువ మంది విద్యార్థులు బి.ఏ., బి.యస్.సి., బి.కాం కోర్సులలో చేరుతున్నారు.

కె) పరిశోధనకు ఐరోపా దేశాలు జి.డి.పి.లో 3.3 శాతం నిధులు కేటాయిస్తుంటే భారతదేశంలో 0.8 శాతానికే పరిమితమైంది. మనదేశంలో నిధులు తక్కువగా వెచ్చిస్తున్న కారణంగా పరిశోధనలు బాగా తగ్గిపోయాయి.

ఎల్) డిగ్రీ పూర్తి అయిన తరువాత మనదేశంలో ఉన్నతవిద్యకు వెళ్తున్నవారు 100కి 25.2 శాతం మాత్రమే. చైనాలో అది 43 శాతం, యు.యస్.లో 85 శాతంగా ఉంది.

రాష్ట్రాలవారీగా చూస్తే తమిళనాడు 46.7 శాతంతో ముందుంది. బీహార్ 14.9 శాతంతో అట్టడుగున ఉంది. దేశంలో ఉన్నత విద్యకు ప్రాధాన్యతనిచ్చే ఎనిమిది రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. గణాంకాలను పరిశీలించిన తరువాత విద్యవలన కలిగే ప్రయోజనాలను పరిశీలిద్దాము.

1) ఒక దేశం యొక్క ప్రగతి ఆ దేశం యొక్క విద్యా విధానం మీద (సాధారణ, టెక్నికల్ విద్య మీద) చదువుకునే విద్యార్థుల సంఖ్య మీద ఆధారపడి ఉంటుంది.
2) విద్య వ్యక్తులను విజ్ఞానవంతులుగా, ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దుటలో ప్రముఖ పాత్ర వహిస్తుంది.
3) విద్య ద్వారా ఉపాధి అవకాశాలు పెరుగుతాయి. దేశానికి, రాష్ట్రానికి ప్రభుత్వ కార్యకలాపాలు నిర్వహించడానికి అవసరమైన ఉద్యోగ అవకాశాలు విద్య ద్వారానే కల్పించబడతాయి. విద్యార్హతలను బట్టి ఆయా వ్యక్తులు ఉద్యోగాలు పొందుతారు. పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ స్థాయివరకు అన్నిరకాల అధ్యాపకులు విద్యార్హతల ద్వారానే ఉద్యోగాలు పొందుతారు.
4) విద్య ద్వారా సామాజిక జీవన విధానం మెరుగుపడుతుంది. శాంతియుత వాతావరణం నెలకొల్పడానికి విద్య ఉపకరిస్తుంది. విద్యావంతుల ద్వారా న్యాయస్థానాల ద్వారా అనేక కేసులకు పరిష్కారం లభిస్తాయి.
5) విద్య ద్వారా విచక్షణాజ్ఞానం పెంపొందుతుంది. ఏది మంచి, ఏది చెడు, ఏఏ పనులు చేయవచ్చు, ఏది చేయకూడదు తదితర విషయాల్లో విచక్షణా జ్ఞానం పెరుగుతుంది.
6) విద్య ద్వారా మనోవికాసం, వ్యక్తిత్వ వికాసం జరుగుతుంది. ఆలోచనా శక్తి పెంపొందగలదు. స్వతంత్రంగా ఆలోచించే శక్తి, నిర్ణయాత్మ శక్తి

అభివృద్ధి చెందుతుంది.

7) విద్య ద్వారా ఆలోచనా శక్తి, తార్కిక శక్తి పెరుగుతుంది. కొన్ని మంచి అలవాట్లు, సంస్కారము అబ్బగలదు.

8) విద్యాధికులను సమాజము గౌరవిస్తుంది. వ్యక్తుల గౌరవాన్ని విద్య ఇనుమడింపజేస్తుంది.

9) క్రమశిక్షణతో కూడిన జీవితాన్ని, క్రమబద్ధమైన జీవితాన్ని గడపడానికి విద్య ఉపయోగపడుతుంది.

10) విద్యావంతులకు సమయం ఎలా గడపాలనే సమస్య ఉండదు, రాదు. పుస్తక పఠనం ద్వారా వారి సమయాన్ని సద్వినియోగపరచుకోవచ్చు.

11) విద్య ద్వారా మన పట్టణంలో, మన జిల్లాలో, రాష్ట్రాల్లో, మన దేశంలో మరియు అంతర్జాతీయంగా ఏం జరుగుతుందో టి.వి.లో కాకుండా వార్తాపత్రికలు చదవడం ద్వారా గ్రహించగలము.

ఈ విధంగా విద్య ద్వారా అనేక ప్రయోజనాలు ఉన్నాయి. ప్రతి పౌరుడు బాధ్యతాయుతమైన పౌరునిగా తీర్చిదిద్దబడటానికి, మెలగడానికి మంచి సామాజిక జీవన విధానానికి విద్య ఉపకరిస్తుంది.

విద్య వలన ప్రయోజనాలు చూశాం. విద్యా లక్ష్యాలను పరిశీలిద్దాం.

1) ప్రతి వ్యక్తిని విద్య ద్వారా పరిపూర్ణ మానవుడిగా తయారు చేయడమే విద్య యొక్క ప్రథమ లక్ష్యం.

2) వ్యక్తిత్వ వికాసం, మనో వికాసం, సమాజ హితం ఇవన్నీ విద్యా లక్ష్యాలే.

3) నిరక్షరాస్యత నిర్మూలన, వ్యక్తి, సంఘ ప్రయోజనాలు కూడా విద్యా లక్ష్యాలే.

4) విద్య ద్వారా జ్ఞానము తద్వారా మోక్షసాధన లక్ష్యం కూడా విద్యాలక్ష్యంలో భాగమే. దేశంలో అతి పెద్ద విశ్వవిద్యాలయాల్లో ఒకటైన కాశీ విశ్వవిద్యాలయం ఆశయము (మోటో) విద్యయొక్క అంతిమలక్ష్యం మోక్షసాధనకు సహకరించటమే అన్నారు.

5) విద్య ద్వారా సామాజిక న్యాయం జరగాలి. శాంతియుత సామాజిక జీవనం సాగాలి. ఈ శాంతియుత సామాజిక జీవనం అనేది కూడా విద్యా లక్ష్యాలలో ఒకటే.

6) విద్య ద్వారా వ్యక్తి నిజాయితీ గుణం, నిస్వార్ధ గుణం, ధైర్య గుణం, శాంత స్వభావము, సత్యాన్ని మాట్లాడటము, ఈర్ష్యాద్వేషాలకు దూరంగా ఉండడము, అందరినీ గౌరవించడం, అందరిచేత గౌరవించబడటము, బీదవారికి, ఆపదలో ఉన్నవారికి సహాయం శక్తికొలది చేయటం, స్నేహభావం – ఇత్యాది గుణాల పెంపుదల అమలు కూడా విద్యా లక్ష్యాలలో భాగమే.

7) మానవత్వం – దాని విస్తృత పరిధి, మానవ సమాజ అవగాహన, మానవత్వం అవసరమైనచోట ప్రదర్శించుట – ఇత్యాది విషయాలు పాఠ్యాంశాలు కాకపోయినప్పటికీ విద్యా లక్ష్యాలే. విద్య ద్వారా రావాలని సమాజము ఆశించే అంశాలే.

8) మానవుడు కేవలము భౌతిక జీవి కాదు, ఆధ్యాత్మిక జీవి కూడా. ఆధ్యాత్మికంగా ప్రతి మానవుడు తన్ను తాను తెలిసికొని భగవత్ జ్ఞానం కూడా పొందాలి. ఇది ఏ పాఠ్యాంశాలలో ఉండకపోవచ్చు. కానీ విద్య పరోక్ష లక్ష్యంలో భాగమే.

9) విద్యద్వారా ఉద్యోగం రాకపోయినా, వ్యక్తిత్వం, స్వతంత్ర ఆలోచనా విధానం, ధైర్యము, కష్టించి పనిచేసే తత్వం అబ్బుతాయి.

10) విద్యద్వారా ఉన్నత ఆశయాలు ఏర్పడాలి. వాటి సాధనకు నిరంతరం కృషి, పట్టుదల కలిగి ఉండడం విద్యా లక్ష్యాల్లో ఒకటి.

11) వ్యక్తిలోని సృజనాత్మకశక్తిని వెలికితీయడం కూడా విద్యా లక్ష్యాల్లో భాగమే.

**విద్య – ప్రయోజనాలు – లక్ష్యాలు**

1) విద్యయొక్క లక్ష్యం కేవలము డిగ్రీలు పొందటమే కాదు. వ్యక్తి తనకు తనమీద విశ్వాసాన్ని పెంపొందించుకోవటము, నమ్మకాన్ని

పెంపొందించుకోవటము తద్వారా ఇతరుల మీద, సమాజం మీద విశ్వాసాన్ని కలిగి ఉండడము విచక్షణా జ్ఞానంతో ఇతరులను నమ్మటం, విశ్వాసం, నమ్మకం గూడా విద్యా లక్ష్యాలే.

2) వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని, నిజాయితీని పెంపొందిచుకోవటం కూడా విద్యా లక్ష్యాలలో భాగమే.

మహాభారతం 'ఉద్యోగపర్వము'లో విదురుడు ధృతరాష్ట్రునికి కొన్ని నీతివాక్యాలు చెప్పాడు. వాటినే 'విదురనీతి' అంటారు.

విదురనీతిలో విదురుడు సత్యాన్నిగూర్చి ఈ విధముగా వచించెను.

"సముద్రమును దాటుటకు ఓడవలె జీవిత యాత్రకు సత్యమే సాధనము. కావున సత్యమును మించిన గుణము మరొకటి లేదు. సత్యము లేకుండా ధర్మము లేదనెను".

**"సత్యమంటే సర్వప్రాణి హితం**
**ఇదే లోకం ఉనికికి మూలం**
**సకల విద్యల పరమ లక్ష్యం"**

